కొత్త సీరియల్ 27-8-58 సంచికలో

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక



ప్రసిద్ధ బెంగాలీ నవల

# జీవనలీల

[అనువాదం: మద్దిపట్ల సూరి]

  

శరత్‌బాబు తరవాత బెంగాలీ రచయితలలో అగ్రగణ్యుడుగా పరిగణింపబడిన కీ॥ శే॥ మానిక్‌లాల్ బంద్యోపాధ్యాయ రచియించిన "పుతుల్ నాచేర్ ఇతికథ" నవలకు తెలుగు అనువాదం ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా **27-8-58** సంచిక నుంచి ప్రచురిస్తున్నాము.

  

వరస తప్పకుండా మీ కాపీ మీకు చేరాలంటే
వెంటనే చందాదారులుగా చేరండి.
లేదా, ఏజెంట్లవద్ద మీ కాపీ రిజర్వు చేసుకోండి.

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 51
13-8-58

Founder · K. NAGESWARA RAO

విలంబి శ్రావణ బహుళ త్రయోదశి బుధవారం


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:

సినీనటి జానకి

—ఫొటో: సోమయాజులు




## జమ్మి వారి లివర్ క్యూర్

పసిబిడ్డల లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులకు క్రమమైన నెలవారి కార్యక్రమం.

పసిపాపల లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులకు మా ఖాతాదారుల సౌకర్యము నిమిత్తము, మా డాక్టరుగారు యీక్రింది ప్రదేశములలో ప్రతినెల నిర్ణీతమైన తేదీలలోను, గంటలలోను, తగిన సలహోలిచ్చుటకై హాజరులో నుండగలరు.

సలహోలిచ్చు వేళలు ఉ॥ 9 నుండి 11 వరకు సా॥ 3 నుండి 5 వరకు

| స్థలము | తేదీ | అడ్రసు |
|---|---|---|
| సికిందరాబాదు | 8, ఉ॥ | తాజ్ మహల్ హోటల్, సరోజినీదేవిరోడ్. |
| హైదరాబాదు | 9, ఉ॥ | తాజ్ మహల్ హోటల్, కింగ్ కోఠీరోడ్ |
| తెనాలి | 12, ఉ॥ | కన్నికాపరమేశ్వరి సత్రం |
| గుంటూరు | 14, ఉ॥ | మెసర్సు మెడికల్ స్టోరు, కొత్తపేట. |
| మచిలీపట్నం | 16, ఉ॥ | మెసర్సు ఆనంద ఫార్మసీ, కెమిస్ట్స్, మెయిన్ రోడ్. |
| రాజమండ్రి | 19, ఉ॥ | మెసర్సు ఈశ్వరదాస్ & కంపెని, జాండు కం॥ ఏజెంట్లు 8/101 ఇన్నీస్ పేట. |
| భీమవరం | 20, ఉ॥ | మెసర్సు ప్రసాద్ సన్సుటికం, కెమిస్ట్స్, |
| జంషడ్ పూర్ | 15, 9-11 ఉ॥ 4-6 సా॥ | సిటీ కెమిస్ట్స్ సాక్చి |
| ఖరగ్ పూరు | 4, ఉ॥ సా॥ | మెసర్సు యునైటెడ్ మెడికల్ స్టోర్సు, కెమిస్ట్స్ & డ్రగ్గిస్ట్స్ ఎస్ టి ఇ 155, రైల్వే మార్కెట్టు. |

జమ్మి వెంకటరమణయ్య & సన్సు,

బ్రాంచీలు

* సుండా కృష్ణమూర్తి బిల్డింగ్ · 17/829, నాగేశ్వరరావుపంతులురోడ్, గాంధీనగర్ P. O., విజయవాడ-2

* పిరుగంటివారి వీధి, విజయనగరం సిటీ, * 182/1, హారిసన్ రోడ్, కలకత్తా

# కూచిపూడి నాట్యం

## ఇందులో యథార్థం కానిదేమిటి?

కూచిపూడి నాట్యాన్ని దేశంలోని ప్రధాన శాస్త్రీయ నాట్యాలలో ఒకటిగా ఢిల్లీలో జరిగిన నాట్యసదస్సు పరిగణించనందుకు గుంటూరు ఆంధ్రసంసత్ వారు నిరసన తెలియచేయడం నాట్యకళాభిమానులు అందరూ సంతోషించదగిన విషయం

సంసత్ వారి సభా విశేషాలను బట్టి చూసినా అసలు ఢిల్లీ సదస్సులో కూచిపూడి నాట్యానికి ఎందుకు అన్యాయం జరిగిందనే విషయం బోధపడటం లేదు దేశంలోని నాలుగు ప్రధాన శాస్త్రీయ నాట్యాలలో కూచిపూడి నాట్యమును ఒకటిగా గుర్తించనందుకు మాత్రం వీరు విచారం వెలిబుచ్చారు అయితే దీనివల్ల తేలిన విషయం ఏమిటంటే మన నాట్యానికి ఒక తీరని అన్యాయం జరిగిందని ఇప్పటికైనా గుర్తించటం ఢిల్లీ నాట్యసదస్సుకు వెళ్ళిన శ్రీ విస్సా అప్పారావుగారే ఈ సభకు అధ్యక్షత వహించారు

ఢిల్లీలో జరిగిన నాట్య సదస్సు విశేషాలను వివరించి అక్కడ జరిగిన చర్చ దృష్ట్యా పత్రికలలో బయలుదేరిన వదోపవాదాలు అన్నీ నిరాధారాలన్నట్లుగా ఈ వార్తలో వుంది

కూచిపూడి నాట్యాన్ని ఢిల్లీ సదస్సులో శాస్త్రీయ నాట్యంగా గుర్తించలేదన్న విషయం యథార్థం కాదా? ఈ విషయం యథార్థం కాకపోతే కూచిపూడి నాట్యం అభివృద్ధికి ఒక పథకం తయారు చేయాలనే అగత్యము ప్రసక్తి ఈ సభలో ఎందుకు రావలసి వచ్చింది?

అకపోతే ఢిల్లీ సెమినార్‌లో కుమారి కాంచనమాల డిమాన్‌స్ట్రేషన్ న విషయం యథారం కాదా? ఆమె ఆ సదస్సులో పాల్గొని ప్రత్యక్షముగా వివరించిన అనుభవాలు నిరధారాలా? కూచిపూడి నాట్య ప్రతినిధిగా సదస్సులో వ్యాసం చదివిన శ్రీ అప్పారావు గారు డిమాన్‌స్ట్రేషన్ ఇచ్చే వారికి తమ ఉపన్యాసం ద్వారా ప్రయోగంలో ఏ ప్రత్యేక అంశాలు నిరూపించాలో ఆదేశించారా? ఒక సంప్రదాయములోని శాస్త్రీయ లక్షణాలను నిరూపణ చేయటానికి నిర్దేశించిన ప్రయోగములో సాధారణంగా పాటించవలసిన గుణావగుణ నిరూపణ, లక్ష్య లక్షణ విపులీకరణ, విషయ చర్చ మొదలైనవి జరిగినవా? ఏ శాస్త్ర సూత్రాలను ప్రమాణాలను ఆధారముగా తీసుకొని యే లోపాలను చూపించి కూచిపూడి శాస్త్రీయం కాదన్నారు?

ఢిల్లీ సదస్సులో జరిగిన వాస్తవ విషయాలను బయట పెట్టటం ఇష్టం లేదు కాబోలు?

ఢిల్లీలో కొందరు అధికార ప్రాబల్యంతో, ప్రాంతీయ దురభిమానంతో యథార్థమైన శాస్త్రీయార్హత గల ఒక బహు ప్రాచీనమయిన నాట్య సంప్రదాయాన్ని నిరసించిన కారణంగా దానికి సహజసిద్ధంగా లభించవలసిన ప్రభుత్వ ఆర్థిక సహాయం లభ్యం కాకుండా పోయే ప్రమాదం యేర్పడింది

ఈ గుప్పలికాలనుంచి ఆంధ్రుల నాట్య సంస్కృతిని కాపాడటానికి సముచితమైన సాంగంలో దాన్ని నెలకొల్పటానికి ఆంధ్ర ప్రదేశ్ సంగీతనాటక అకాడమీ వెంటనే బాధ్యతవహించాలి ఢిల్లీ సదస్సులో జరిగిన నిర్ణయాన్ని రద్దు చేయించేందుకు ఆంధ్ర సంసత్ జరిపే కృషికి రాష్ట్ర అకాడమీ సంపూర్ణ సహకారం లభ్యమవుతుందని ఆశిస్తున్నాను ★

—సీతారామారావు



ఢిల్లీలో విద్యార్థి సైనిక శిక్షణోద్యోగులుగా శిక్షణ పొందిన దక్షిణ ప్రాంత మహిళలతో శిక్షణశాఖ డైరెక్టరు బ్రిగేడియర్ అమృతసింగ్ ఎడమనుంచి—రాజేశ్వరి (శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం) నీలా శ్రీనివాసన్ అజీజున్నిసా, ఆనందవల్లి, అమృత్ సింగ్, కాంతాకుమారి, మేబుల్, లలిత, వత్సల




# లెబనాన్ విప్లవంలో అమెరికా జోక్యం

అధినేతల సమావేశం గురించి న్యూఢిల్లీలో ఇటీవల ఒకటే తహతహ. ప్రచ్ఛన్న యుద్ధ ప్రచారం దృష్ట్యా చూస్తే రష్యా పని దూకుడుగానే ఉంది. అధినేతల సభకు భారతదేశాన్ని కూడా పిలవాలని పట్టు పట్టటం ప్రచ్ఛన్నయుద్ధపు ఎత్తుగడల్లో కల్లా బ్రహ్మాండమైన ఎత్తు. అంతే లెబనాన్‌లో అమెరికా చర్యను నేను సమర్థిస్తున్నానని కాదు. ప్రజాస్వామ్య వ్యవస్థను మాత్రమే సమర్థిస్తున్నాను. ఫ్రాంకో రాక ముందు స్పెయిన్‌లో మాదిరిగానే లెబనాన్‌లో కూడా ప్రజలచేత సక్రమంగా ఎన్నుకోబడి ఏర్పడిన ప్రజాస్వామిక ప్రభుత్వం వున్నది. అది చేసిన తప్పల్లా పశ్చిమ రాజ్యాలపట్ల సుముఖంగా ఉండటమే. స్పెయిన్‌లో మాదిరిగానే ఈ ప్రభుత్వాన్ని రాజ్యాంగ విహిత పద్ధతులలో కాక, ఆయుధబలంతో పడగొట్టాలని ప్రయత్నం జరిగింది.

మనం మనకి సంబంధించిన ఒక ఉదాహరణను తీసుకుందాం. మాటవరసకి కేరళలో వచ్చే ఎన్నికలలో కమ్యూనిస్టులు ఓడిపోతారనుకుందాం. వారిస్థానంలో ప్రజాభీష్టానుసారమైన ప్రభుత్వం ఏర్పడిందనుకుందాం. కమ్యూనిస్టులు అప్పుడు ఆ ప్రభుత్వాన్ని ఆయుధబలంతో కూలద్రోయాలనుకుంటే, భారత ప్రభుత్వ వైఖరి ఏలా ఉంటుంది?

లెబనాన్‌లో అధ్యక్షుని మీద తిరుగుబాటు జరగటం ఇదే మొదటిసారి కాదు. బిషారా అల్ ఖురీ ఆధ్వర్యంలో లెబనాన్‌కు పూర్తి స్వాతంత్ర్యం లభించింది. 1948 మే 27-వ తేదీన అల్ ఖురీ మరొక ఆరేళ్లపాటు అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. ఈ విషయమై ప్రొ॥ ఫిలిప్ హిట్టీ ఇలా వ్రాశారు: "అల్ ఖురీ అధ్యక్ష పదవిలో స్థిరంగా తిష్ఠ వేసుకునే సూచనలు కనిపించసాగాయి. సంస్కరణను తీసుకురావాలని ప్రజలు ఏకగ్రీవంగా కోరినప్పటికీ ప్రభుత్వం అంగీకరించలేదు. ప్రతిపక్షాలన్నీ తాత్కాలికంగా ఏకమై పెద్ద పెద్ద ప్రదర్శనలు, నగరమంతటా సమ్మెలు జరిపాయి. వెంటనే ఈ ఉద్యమం ఇతర పట్టణాలకు కూడా వ్యాపించింది. ప్రధాన మంత్రి రాజీనామా యిచ్చారు. ఏం చేయటానికి తోచక, అధ్యక్షుడు సమ్మెను అణచి వేయటానికి, శాంతి నెలకొల్పటానికి సైన్యాన్ని పిలిపించారు. కాని సేనాధిపతి అధ్యక్షుని కోర్కెను నిరాకరించారు. ఆఖరికి 1952 సెప్టెంబరు 18న అధ్యక్షుడు అల్ ఖురీ ప్రజల ఒత్తిడికి దాసోహమన్నారు. రాజీనామా ఇచ్చారు. రక్తపాతం లేకుండా, రాజ్యాంగసమ్మతంగా,

## శ్రీ కృష్ణ

[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

ప్రజాస్వామిక పద్ధతులలో ప్రభుత్వాన్ని కూలద్రోసిన ఈ ప్రజావిప్లవం సమకాలిక సమీపప్రాచ్య రాజకీయచరిత్రలో ఎప్పుడూ జరగని వింత" ముందు జరగబోయే సంఘటనలనుగూర్చి ప్రొ॥ హిట్టీ ఇలా వ్రాశారు:

"1945 మార్చిలో అరబ్ సమితి బ్రిటన్ ఆశీర్వాదంతో ఏర్పడింది. లెబనీస్ రిపబ్లిక్ కూడా ఈ సమితిలో చేరింది. సభ్యదేశాల స్వాతంత్ర్యాన్ని కాపాడతాననీ, సభ్యదేశాలమధ్య సాయుధ సంఘర్షణ జరగకుండా వారిస్తాననీ అరబ్ సమితి వాగ్దానం చేసింది. 1949లో ఈజిప్టు, సిరియా, సౌదీ అరేబియా, యెమెన్ రాజ్యాలతో లెబనాన్ సమష్టి రక్షణ ఒడంబడిక చేసుకుంది. కాని యూదులతో యుద్ధంలో ఓడిపోవటంతో అరబ్ సమితి చావు దెబ్బ తిన్నది. కమ్యూనిజానికి వ్యతిరేకంగా పశ్చిమరాజ్యాలతో స్నేహం చేసుకుంటూ టర్కీ, ఇరాక్‌లు ఒక ఒడంబడిక చేసుకోటంతో అరబ్ సమితికి ఇంకో పెద్ద దెబ్బ తగిలింది. లెబనాన్‌కూడా పశ్చిమరాజ్యాల వైపే మొగ్గటంతో ఈజిప్టు, అరేబియా, సిరియాలనుంచి ఆర్థిక మైన ఒత్తిడిని ఎదుర్కోవలసి వచ్చింది"

1956 ఏప్రిల్‌లో ప్రొ॥ హిట్టీ ఇది వ్రాశారు. ఆతరవాత ఈజిప్టు, సిరియాలు ఏకరాజ్యంగా రూపొందాయి. సౌదీ అరేబియా తటస్థంగా ఉన్నది. ఇరాక్ రిపబ్లిక్ రాజ్యమైంది. రాజ్యాంగవిహితంగా ఎన్నికైన ప్రభుత్వాన్ని సాయుధ విప్లవంతో కూలద్రోయటానికి లెబనాన్‌లో ప్రయత్నం జరిగింది.

లెబనాన్‌లో ఐక్యరాజ్యసమితి పరిశీలకుల తంతు చూస్తుంటే మహాభారతకథ జ్ఞాపకం వస్తోంది. ద్రోణాచార్యుడు తన కుమారుడైన అశ్వత్థామ హతుడైతే అస్త్రసన్యాసం చేస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. ఆయన చేంత అంతపనీ చేయించటానికి పాండవ పక్షం వారు అశ్వత్థామ అనే పేరుగల ఏనుగును చంపుతారు. ఈ వార్తను ద్రోణుని చెవుల వేయటానికి యుధిష్ఠిరుని పంపిస్తారు. ఆయన ద్రోణునివద్దకు వెళ్ళి "అశ్వత్థామా హతః కుంజరః" అని కేక వేస్తాడు. "కుంజరః" అనే మాట వినబడకుండా చేయటానికి పాండవులు భేరీ వాద్యాలు మోగిస్తారు.

లెబనాన్‌లోకి ఇతర దేశాలనుంచి ఆయుధాలు వగైరా రావటం లేదని సమితి పరిశీలకులు ప్రకటించి "మేము చూసిన ప్రాంతాల్లో" అని తరవాత చేర్చారు. పరిశీలకుల మొదటి నివేదికలో ఇలా ఉన్నది —

"బేరూట్, ట్రిపోలీ, సయీదా పట్టణాలలో కొన్ని కొన్ని ప్రాంతాలు ప్రభుత్వ స్వాధీనంలో లేవు. అక్కడ పరిశీలనలు జరపాలంటే ప్రతిపక్షంతో ముందు సంప్రదింపులు జరిపి వారు ఒప్పుకున్న తరవాతగాని వెళ్ళటానికి వీలులేదు. ఈ పట్టణాలలో ఉండుండి సంఘర్షణలు జరుగుతున్నాయి. ట్రిపోలీకి ఉత్తరంగా సరిహద్దు వరకూ పోరాటం జరుగుతోంది. బాల్బెక్

ఉత్తరాన కూడా అదే పరిస్థితి దక్షిణాన, ఆగ్నేయాన పోరాటాలు జరుగుతున్నాయి. బేరూట్‌కు ఆగ్నేయంగా చౌఫ్ ప్రాంతం పూర్తిగా ప్రతిపక్షం చేతుల్లోనే ఉన్నది.

ప్రభుత్వాధీనంలో ఉన్న ప్రాంతానికి పరిశీలకులను స్వేచ్ఛగా పోనిస్తామని లెబనీస్ ప్రభుత్వం వాగ్దానం చేసింది ప్రభుత్వాధీనంలో లేని ప్రాంతాలకు స్వేచ్ఛగా రాకపోకలు చేయనిస్తామని నేవాగ్దానం ఎవరూ ఇవ్వలేదు అలా ఇవ్వమనికూడా పరిశీలక బృందం కోరలేదు ”

దీనిఅర్థం ఏమిటంటే, ప్రభుత్వాధీనంలో ఉన్న ప్రాంతంలోకి మాత్రమే ఇతరదేశాల నుంచి ఆయుధాలువగైరా సరఫరా కావటం లేదు. ప్రభుత్వాధీనంలోలేని ప్రాంతాల విషయం పరిశీలక బృందానికి తెలియదు తెలియదుగనుక వాటి విషయమై ఆ బృందం నోరు విప్పలేదు

ఇక రెండవ నివేదికలో పరిశీలకబృందం ఇలా చెప్పింది

“సరిహద్దులోని అన్ని ప్రదేశాలను నిర్విరామంగా పైనుంచి పర్యవేక్షణ చెయ్యగలిగినన్ని విమానాలను, వైమానికులను పరిశీలక బృందానికి ఇప్పించాలి 18 పర్యవేక్షక విమానాలు, నాలుగు హెలికాప్టర్లు, వీటికి సహాయంగా కొంత కాల్బలము, సామగ్రి ఇప్పిస్తే సరిపోతుంది ”

దీన్నిబట్ట తాము చేసిన పనిపై తమకే సంతృప్తిలేదని, అందుకనే సరియైన తీర్పు చెప్పటానికివీలుగా పరిశీలకులు మరికొందరు మనుషులను, ఎక్కువ విమానాలను కోరారనీ తెలుస్తుంది

లెబనాన్‌లో అమెరికన్‌జోక్యాన్ని సమర్థించటానికి ఏకోశానా వీలులేదు కాని కృశ్చేవ్‌కు నిద్రఎందుకు పట్టకపోవాలో అర్థంకావటంలేదు కర్నల్ నాసర్ ఎందుకు ఉద్రిక్తవాలో అర్థమవటంలేదు అమెరికా వారికి లెబనాన్‌లో ప్రమేయం లేనిమాట నిజమే అలాగే కర్నల్ నాసర్‌కూ లేదు.

ప్రధాని నెహ్రూవిధానం సరైనదని దీనివల్ల స్పష్టమవుతోంది. మిలిటరీ ఒడంబడికలకు ఆయన మొదటినుంచీ విముఖులే. ముఖ్యంగా బాగ్దాద్ ఒడంబడికను ఆయన గట్టిగా నిరసించారు. క్రియకు ప్రతిక్రియ సమానంగా ఉంటుంది బాగ్దాద్ ఒడంబడిక ఫలితంగా నాసరిజం ప్రబలింది

బ్రిటిషు వారెప్పుడు చూసినా ప్రజల్లో పలుకుబడిలేని ప్రభుత్వాలనే వెనకేసుకురావటం విచారకరంగా ఉంది భారతదేశంలో వారు సంస్థానాధిపతులను సమర్థించారు బ్రిటిషు వారు నిష్క్రమించగానే సంస్థానాధిపతులు నామరూపాలు లేకుండా అంతరానమయ్యారు లండన్ “టైమ్సు” పత్రిక విలేఖరి జోర్డాన్‌లో పరిస్థితి ప్రత్యక్షంగా చూసి ఇలా వ్రాశారు —



ఆపుకున్న నవ్వు

—ఫోటోపంపినవారు పి పి రామారావు]

“బ్రిటిషుసేనలూ అమెరికా సహాయమూ లేకపోతే ప్రభుత్వం ఒక్కక్షణంనిలవలేదు వీటిని తొలగిస్తే మొత్తం మేడంత పేకమేడలా కూలిపోతుంది. జోర్డాన్‌లో బ్రిటిష్ సేనలు ఉండటం మూలంగా యావత్తు అరబ్ ప్రపంచంలోనూ పాశ్చాత్యులపై ద్వేషం వ్యాపించేస్తోంది

“ప్రతిపక్ష నాయకులనదగినవాళ్లు అనేకులు కారాగారాల్లో మ్రగ్గుతున్నారు ఇంతమంది జైళ్లలో ఉన్నా ప్రభుత్వ వ్యతిరేకత ఇంకా ఇంతబలంగా వెల్లడి అవుతున్నదంటే ఆశ్చర్యంగా ఉంది జులై 20వ తేదీన అమ్మాన్‌లో అయిదు ప్రేలుడు సంఘటనలు జరిగాయి బ్రిటిష్ సేనల ప్రవేశానికి అసమ్మతిగా సమ్మె చేయటానికి పెద్దయత్నం జరిగి విఫలమైంది ”

స్పెక్టేటర్ పత్రిక బేరూట్ విలేఖరి మైకేల్ ఆడమ్స్ ఇలా వ్రాశాడు “పదివేలమంది అమెరికన్ సైనికులు దేశంలోకి దిగినా లెబనీస్ అంతర్యుద్ధ పరిస్థితి ఏమీ చక్కబడలేదు నిజానికి అమెరికన్ సైనికులవల్ల లెబనాన్‌కు రక్షణలేకుండా పోయింది ఒక లెబనీస్ పౌరుడిలా అన్నాడు మధ్య ప్రాచ్యంలో మీకు కావలసిందేమిటి? పెట్రోలేగదా? దాన్ని ఇక్కడికక రకుండా చేయాలనేగదా మీరు కోరేది? మరి మమ్మల్ని ఎందుకిలా చేతులారా శత్రువులుగా చేసుకుంటారు? మమ్మల్ని చేతులారా ఎందుకు రష్యన్ల చేతుల్లోకి తరుముతారు? అరబ్‌లు పెట్రోలు గనుల అభివృద్ధికి ఎలాగూ రష్యనకంటే ఎక్కువగా మీ మీదే ఆధారపడిఉన్నారు. కాని హుస్సేనను, నూరీ ఎస్ సయిద్‌లను నెత్తి నెక్కించుకుని మేము చేసే ప్రతి పనినీ అడ్డగించటం మొదలెడితే మాకు మా పెట్రోలు దక్కదు మా స్నేహమూ దక్కదు మేము సహాయంకోసం రష్యన్లను అర్థించవలసి ఉంటుంది రెండువేల సైనికులు హుస్సేన్‌ను ఎల్లకాలం కాపాడలేరు. పదివేలమంది సైనికులొచ్చినా ఆధునిక ప్రపంచంలో అతగాణ్ణి ఎదుర్కొంటున్న శక్తులనుంచి అతన్ని రక్షించలేరు అతనితో పాటు మీరూ ఎందుకు అధోగతి పాలవుతారు?”

న్యూయార్క్ టైమ్స్ విదేశీ వ్యవహారాల విలేఖరి ఇలా వ్రాశాడు

“అరబ్ పునర్జీవన మహోద్యమాన్ని వ్యతిరేకించి, చామోన్‌లను, సావూద్‌లను, హుస్సేన్‌లను వెనకేసుకునివచ్చి అమెరికా ఐక్యరాజ్య సమితిలో తను గొప్ప నైతిక శక్తినని పోజుపెట్టే అవకాశం కోల్పోయింది మన ఆశయాల్లో దాపరికమేమీ లేదు మధ్య ప్రాచ్యంలో సోవియెట్ ప్రాబల్యానికి అవకాశంలేకుండా చేసి, దీనికిగాను అక్కడొక కూటమిని స్థాపించటం మన ఆశయం. ఈ ఆశయం భగ్నమైంది. బాగ్దాద్ కూటమిని నెలకొల్పాం, గాని ఈజిప్టు, భారతదేశాల సానుభూతిని కోల్పోయాం ”



ప్రముఖ సినిమా నటుడు, నర్తకుడు అయిన ఫ్రెడ్ ఏస్టేర్ మొదటిసారిగా చిత్రాల్లోనటించటానికి హాలీవుడ్ వెడుతూ, తను చిత్రాల్లో నటనే కాకుండా నాట్యంకూడా చేసి తీరాలని నిశ్చయించుకున్నాడు నిర్మాతను కలుసుకుని “చూడండి నేను ఇరవై ఏళ్ళనుంచీ అదే పనిగా, విసుగూ విరామం లేకుండా నాట్యం చేస్తున్నాను ఇకమీద. ... ” అని ఏదో చెప్పబోతుండగా నిర్మాత “ఫ్రెడ్! అలిసిపోయి ఉంటారు కూర్చోండి” అన్నాడు

# అమరా నిర్జరా దేవా...

"చేటీ భవన్నిఖిల ఖేటీ కదమ్బ వనవాటీషు నాకిపటలీ
కోటీర చారుతర కోటీమణీ కిరణ కోటీకరంజితపదా
పాటీరగంధి కుచశాటీ కవిత్వ పరిపాటీ మగాధిపసుతా
ఘోటీకులా దధిక ధాటీ ముదారముఖ వీటీ రసేన తనుతాం"

విన్నావా ఓ విరిబోణీ మీ అమ్మమ్మ పోరింది. మీ అత్తయ్య కూడా ప్రతి మాలింది ఆఖరికి అమరకోశమైనా చదవ్వే అని అచ్చే నీకు వినిపిస్తేగా ఏమిటో నాకు మతిలేక కాని నే నెన్నిసార్లు చెప్పలేదూ! చూడు నిండా చూస్తే ఆ అమ్మాయికి తొమ్మిదేళ్ళు లేవు, పోనీ నువ్వు చెప్పినట్టే ఒప్పుకుందాం మొన్ననే కదా ఆ బుగ్గికి తొమ్మిదో పుట్టినరోజు వెళ్ళింది. మరి ఎంత స్ఫుటంగా స్వచ్ఛంగా చదువుతోందో చూశావా? ఊరికే ఉబలాట పడిపోతున్నావు—మీ చెల్లికి నాలుగు ఇంగ్లీషు ముక్కలొచ్చేసరికి ఓయబ్బో నే నెరగ నేమిటిలే దాని చదువెన్నాళ్ళో! హింగి మొదలెట్టిందా ఓ పరీక్ష పాసయిందో లేదో ఇంక మహాపండితురాల్నని వదిలేసింది తెలిసీ తెలీని రోజుల్లో దానిచేత రుక్మిణీ కళ్యాణం కంఠతా పట్టించినందుకు ఇప్పుడిప్పుడు నువ్వు కూడా నాగరికతకి భంగమని బాధపడుతున్నావు ఔనా కాదా.. నిజం చెప్పు ఎంచక్కా ఈ పెసరట్టు ముక్క తింటూ చెప్పావుటా పోనీ ఆ సుభద్రమ్మగారి శకుంతలను దగ్గర కూచోపెట్టుకుని హాయిగా ఆ గుంటముండకి సంగీతం నేర్పి, నువ్వు కాస్త సంస్కృతం చదవకూడ గుశ్చే?

నా కంఠశోష కానీ, నేను చెపితే నీ తలకెక్కుతుందా! సుబ్బలక్ష్మి, సుందర సౌభాగ్యం, సుశీలా సుషమా వచ్చి చెప్పాలి కానీ నా మాట నువ్వు వింటావా? అదిసరేకానీ రామరామ.. హరి హరీ ఇదేమిటే ఈ గ్లాసులో పంచదార పానకం పోసిచ్చావేమిటే ఓహో నీకూ కొంచెం పెరుగుతున్నట్టుంది, వరప్రసాద కుమారీదేవిగారి మన సత్వం నీకు గుర్తుందో లేదో.. మనదగ్గర అపప్పులుడకవు!

అదే వద్దన్నాను; ఇప్పుడెందుకు చెప్పు ఊరికే ఆ గాజులు సవరిస్తావు? అవి చూపిస్తేగాని నేను బంగారుగాజుల జత తీసుకురానన్నేగా నీ మనసులోపలి మనసులో భావం? లక్షసార్లు చెప్పాను. నువ్వా విషయం మరిచిపోయిన మరునాడు కానీ నీకా సన్మానం జరగదని. ఒక్కవారం రోజులు గాజుల ఆలోచన విరమిస్తే, నీకు తొమ్మిదో రోజుకి అవి వచ్చితీరతాయి.

కొంపతీసి కావే నువ్విక్కడకొచ్చి నాలుగు నెలలూ అవలేగుటే అయిదో నెలలో వచ్చావు కాదూ తొమ్మిదో నెల దాటుతూ

**"ఉషశ్రీ"**

న్నట్టుందే. అయితే ఇంక నీబలం పెరుగుతుందనుకుంటాను. కానియ్యి, అయితే అమ్మాయీ బుల్లెమ్మాయీ చిన్నపాపాయీ. పసిపిల్లా. నీ బుల్లిబొజ్జలో గోపాలకృష్ణుడున్నాడా సత్యభామాదేవి ఉన్నదే మరంగుకే ఏం మునిగిపోతుందో ఇలా ఉరకలేస్తూ వస్తోంది పోసిసింద్రీ భడవ. దాన్ని కొట్టమీదికెళ్ళి ఓహో అన్నట్టు ఈమధ్య దానిసన్మాన సూచకంగా అట్ల పంక్తివేయిస్తూ చిమ్మిల్ని తొక్కించావు కదూ అయితే దానిఅక్కని వెళ్ళమను. దానికీ జరిగిపోయినట్టుంది ఆసమ్మానం

అయితే సరేకానీ అదేమిటే అలా వెళ్ళిపోతుంది? ఓయమ్మో ఏం సిగ్గే సిసింద్రీకి.. ఇలాంటి భడవలే ఇరవై వేల కొంపలు చక్కబెట్టి చక్కా వస్తారు అదిగో చూశావా. ఎందుకు చెప్పూ అది అలా ఊరికే పైట కండువా సరిజేసుకుంటూ నెమిలిలా వంగి వంగి చూసుకుంటుంది? పోన్లే నీకంత కోపమయితే సరేగానీ ఓసి నీకడుపులో బాబిగాడు బంగారంగానూ కషాయంలా పోశావేమే కాఫీ. చాల్లేలే మీ చెల్లిశంఖిణీకిచ్చి త్రాగిస్తానుండు" ★



'ఎందుకొచ్చిన లాయలాన ఇది! ఆతాడు సరికేస్తే సరిపోదూ? లేకపోతే, మధ్యవున్న ఆ ముడి విప్పేస్తేనో...!"

# ఆంధ్రసచిత్రవారపత్రిక
# బాలల సంఘం

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 1958 జులై 1-వ తేదీ నుంచి 'బాలలసంఘం' స్థాపించాము. జులై 1-వ తేదీ నాటికి 15 సంవత్సరాల వయస్సు నిండని, ఆరేళ్ళ వయస్సుకు తక్కువ గాని ప్రతి తెలుగు బాలుడూ, బాలికా సభ్యత్వం పొందవచ్చు. సభ్యత్వానికి రుసుమేమీ చెల్లించవలసిన పనిలేదు. తెలుగు బాలబాలికలందరూ వెంటనే సభ్యులుగా చేరి సచిత్ర వారపత్రిక అప్పుడప్పుడు నిర్వహించే చిన్న చిన్న పోటీలలో పాల్గొని "సంఘం" ఆశయాలను జయప్రదం చేయడానికి సహాయపడతారని ఆశిస్తున్నాము.

### గమనిక

పదకొండు మొదలు 15 సంవత్సరాలవరకూ వయస్సుగలవారిని 'A' వర్గంగానూ, ఆరు మొదలు 10 సంవత్సరాల వయస్సువరకూ గలవారిని 'B' వర్గంగానూ విభజించడం జరుగుతుంది.

## ముఖ్య విషయాలు

సభ్యులుగా చేరదలచిన బాలబాలికలు చేయవలసిందేమిటంటే దీనితోపాటు ఒక సభ్యత్వపు దరఖాస్తును ముద్రిస్తున్నాము. అందులోని ఖాళీ సలాలను మీ వివరాలతో జాగ్రత్తగా నింపి (కొట్టివేతలు, తుడుపులు వుండకూడదు) ఆ అచ్చు దరఖాస్తును తిన్నగా కత్తిరించి కవరులో

సంపాదకుడు,
ఆంధ్ర పత్రిక సచిత్ర వారపత్రిక,
తంబుచెట్టివీధి, మద్రాసు-1

అనే చిరునామాకు పంపాలి. కవరుమీద వెనుకవైపు "సచిత్ర వారపత్రిక బాలల సంఘం" అని స్పష్టంగా వ్రాయాలి. మామూలు కాగితాలమీద వ్రాసిపంపే దరఖాస్తులను స్వీకరించము.

ఒక్కొక్క దరఖాస్తుమీదా ఒక్కొక్క సభ్యుని, లేదా సభ్యురాలి పేరుమాత్రమే వుండాలి. సభ్యత్వపు దరఖాస్తును సచిత్ర వారపత్రికలో సాధ్యమైనంతవరకు వారం వారం ప్రచురిస్తుంటాము.

సభ్యులుగా చేర్చుకున్నట్లు ఒక్కొక్కరి పేరా విడివిడిగా ఒక్కొక్క సభ్యత్వపు కార్డును పంపుతాము. ఆ కార్డుమీద సభ్యత్వ క్రమాన్ని సూచించే ఒక సంఖ్య వుంటుంది. ముందు ముందు సభ్యులు గాని, సంఘం గాని జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలలో ఆ సంఖ్యను ఉదహరిస్తూండడం జరుగుతుంది. పదిహేనేళ్ళ వయస్సు పూర్తికాగానే, ఆ తేదీతో బాలల సంఘంలో సభ్యత్వం దానంతటదే రద్దయిపోతుంది.

## లక్ష్యాలు

(1) సభ్యులుగాచేరే బాలబాలికలను ఆరుమొదలు పదేళ్ళవరకూ ఒక వర్గంగానూ (B) పదకొండు మొదలు పదిహేనేళ్ళ వరకూ మరొక వర్గంగానూ (A), విభజించి ఉభయ వర్గాలకూ విడివిడిగా అప్పుడప్పుడు రెండురకాల పోటీలు నిర్వహించి ప్రథమశ్రేణిలో నెగ్గేవారికి మాకుతోచిన బహుమతుల నివ్వడం (ఈ విషయంలో పోటీనిర్వహణకర్తలదే తుదినిర్ణయం)

(2) సభ్యులలో వారివయస్సుకు తగినట్లుగా రచనాశక్తినీ, పఠనాశక్తినీ, కళాభిమానాన్నీ యథాశక్తి పెంపొందచేయడం

(3) చిత్రలేఖనం, నృత్యం అభినయం, గాత్రం వీణ, వయొలిన్ మొదలయిన లలిత కళలలోనూ, వ్యాయామక్రీడలలోనూ ప్రత్యేక అభిరుచీ, ప్రవేశం కనబరిచే బాలబాలికలను బహుమతులద్వారానూ తదితర విధంగానూ ప్రోత్సాహించడం

(4) ఏ ప్రాంతంలో నివసిస్తున్నవారైనప్పటికీ తెలుగు బాలబాలిక లందరిమధ్యా స్నేహ సమైక్యభావాలను పెంపొందజేయడం

(5) ఉన్నత పాఠశాలలలో చదివే విద్యార్థులకు ఉచిత విద్యార్థివేతనాలను బహూకరించడం (దీనికి సంబంధించిన వివరాలను ముందుముందు ప్రకటిస్తాము)



---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
**బాలల సంఘం**
[సభ్యత్వపు దరఖాస్తు]

GROUP
**A** లేక **B**

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో)

పుట్టినతేదీ నెల, సంవత్సరం జులై 1 నాటికి వయస్సు ఏండ్లు : నెలలు

తండ్రి లేక సంరక్షకుని పూర్తి పేరు

ఊరిపేరు జిల్లా తాలూకా పోస్టు [వీధి నెంబరు]

* చదువుతున్న తరగతి, లేక, ఫారము :

పాఠశాల పేరు

ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే).

ఆర్యా

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ . -1958]

(సంతకము)

* వరా ఏ పాఠశాలలోనూ గాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి

**సంచిక: 13-8-58** | ఈ దరఖాస్తు **16-8-58** నాటికి మాకు చేరాలి

# ★ కొందరు సభ్యుల పేర్లు ★

[ఆంధ్ర సచిత్ర వార పత్రిక బాలలసంఘంలో సభ్యులుగా చేరిన మరి కొందరిపేర్లను ఇక్కడ ప్రచురిస్తున్నాము ]

1. ఎస్ ఎస్ జయరామమూర్తి (అనంతపురం) 2 రాయప్రోలు లక్ష్మీరాజ్యం (తిరుపతి) 3. ఎస్. బాబా (మహో సముండ్, మధ్యప్రదేశ్) 4. పత్తూరు నారాయణరావు (విజయనగరం) 5 పార్వతి వెంకట సత్య నారాయణమూర్తి (విశాఖపట్నం) 6 జి. మల్లయ్య (కామారెడ్డి, సిరిసిల్లారోడ్) 7. మూల్పూరి సరళా సావిత్రి (హైదరాబాదు) 8. సి. హెచ్. వెంకటేశ్వరరావు (కదిరి, అనంతపురం జిల్లా) 9. ముసునూరి సురేందర్ (హైదరాబాదు) 10. చివుకుల లీలావతి (సామర్లకోట) 11. యలమర్తి వెంకట రాఘవేంద్రరావు (గుణదల కృష్ణాజిల్లా) 12. కమ్మయూరు సువర్ణలత (హైదరాబాదు) 13. దాద జయరావు (మాచర్ల, గుంటూరు జిల్లా) 14. శిష్టలెంక లక్ష్మీదేవి (పెనమలూరు, కృష్ణాజిల్లా) 15. ఎస్. శివసుందర్ (సేకూరు, గుంటూరు జిల్లా) 16. బుద్దాల రామకృష్ణ (ఏలూరు) 17. ఆర్. కె ఖల్లూరి (ఏలూరు) 18. పల్లపాటు నాగమాణిక్యం (విజయవాడ) 19 వీసుపాటి శ్యామలాదేవి (గుంటూరు)20. వంకినేని పూర్ణచంద్రరావు (ఏలూరు).

21. గాజులపల్లె అంకిరెడ్డి (చిన్న గోపవరం, కడప జిల్లా) 22. సి. వివేకానంద (మద్రాసు) 23. బి. ఎస్. రఘు (బళ్ళారి) 24 రెబ్బా రామకృష్ణ (భగీశ్వరం, ప॥గో॥ జిల్లా) 25. పోలా ప్రగడ జనార్దనరావు (ఆలమూరు) 26. దువ్వూరి రత్నం (కాకినాడ) 27. కొత్తకోట అప్పారావు (వెంకంపేట,శ్రీకాకుళం జిల్లా) 28. ఉప్పాడ సుబ్రహ్మణ్యం (సోంపేట) 29. పెమ్మరాజు పద్మావతి (బల్లిపాడు, ప॥ గో. జిల్లా) 30. యానాల పద్మారెడి (నెల్లుపల్లి, నల్గొండ జిల్లా) 31. పోకల పద్మలత (నర్సీపట్నం, విశాఖజిల్లా) 32. శృంగారకవి భాను (తాడేపల్లిగూడెం, ప॥ గో.) 33. సూరి ప్రభాకరశాస్త్రి (అగిరిపల్లి, కృష్ణాజిల్లా) 34. కరవది కృష్ణమోహన్ (ఇంకొల్లు, గుంటూరుజిల్లా) 35. గజ్జల కేశవరావు (బందరు) 36. బి. ఎస్. నరసింహ (సికింద్రాబాదు) 37. అంగర కోనేటిరావు (న్యూఢిల్లీ) 38. హెచ్చి. రామమూర్తి (అనంతపురం) 39. కళాంచి నారాయణ ప్రసాద్ (బందరు) 40. చామర్తి పట్టాభి రామయ్య (ఉంగుటూరు, ప॥ గో.)

41. అయ్యగారి గాయత్రీ లక్ష్మీనారాయణ (రాజమండ్రి) 42 గట్టు తులసీబాయి (విజయనగరం) 43. తటవర్తి నాగ రవీంద్రనాథ్ (నరేంద్రపురం, తూ॥ గో॥ జిల్లా) 44. సి హెచ్చి. పాపారావుపంత్ (రాజమండ్రి) 45. కామవరపు సూర్యలక్ష్మి (పిఠాపురం) 46 తాడికొండ కోటేశ్వర రావు (గుంటూరు) 47. దేవభక్తుని నాగేశ్వర శర్మప్రసాద్ (చేబ్రోలు, గుంటూరుజిల్లా)48. జవంగుల రుద్రానందహరిప్రసాద్ (తెనాలి) 49. వడ్డి యశోధరకుమారి (గొల్లప్రోలు, కృష్ణాజిల్లా) 50. ఎమ్ సత్యనారాయణ రావు (మండపేట,తూ॥గో) 51 ఎం. విజయ కుమారి (కరోల్ బాగ్ ,న్యూఢిల్లీ) 52. ఎద్దనపూడి రామశేషు(మద్రాసు) 53. ఐనవోలు సుబ్రహ్మణ్యశర్మ(వినుకొండ) 54. గుడిపాటి మురళీధరరెడ్డి (హనుమకొండ, వరంగల్లు జిల్లా) 55 ఒంగోలు సత్యనారాయణ (పలాసా, శ్రీకాకుళం) 56. వండూరి రాజేశ్వరరావు (హైదరాబాదు) 57. ఎస్ నాగరాజు (సికింద్రాబాదు) 58. కింతలి మల్లేశ్వరరావు (బరంపురం, గంజాంజిల్లా) 59. నీలంరాజు వెంకట హనుమత్ ప్రసాద రాజారావు (కూచిపూడి, గుంటూరుజిల్లా) 60. భాగవతుల వెంకట శ్రీలక్ష్మి (నరసరావుపేట)

61. కే. భువనేశ్వరదేవి (గుడివాడ) 62. కొప్పర్తి రామమోహనరావు (పూనా) 63. ఘంటిరాజు సరస్వతీదేవి (మునగాల, కృష్ణాజిల్లా) 64 అద్దంకి శ్రీరాములు(పిఠాపురం) 65 గంగానరభట్ల సూర్యనారాయణమూర్తి (విజయనగరం) 66. అనువాది అనంత పద్మనాభన్ (ప్రొద్దుటూరు, కడపజిల్లా) 67.ఓగిరాల సూర్యనారాయణరావు (రాజమండ్రి) 68. రామకుసు మురళి (మైసూరు) 69 గిడుతూరి సూర్యనారాయణ (వడిశలేరు, తూ॥ గో॥) 70. రాపర్ల శ్రీరామచంద్రవిజయం (బందరు) 71. సి. హెచ్. విజయలక్ష్మి(విస్సన్న పేట, కృష్ణాజిలా) బైరగాని గీత (మాచర్ల) 73. మంగినపూడి లక్ష్మీకాంతరావు (పెదనక్కన, గుంటూరు) 74. చావలి దక్షిణామూర్తి (కాకినాడ) 75. పి. నారాయణ (ఆలూరు, నిజామాబాద్ జిల్లా) 76. పంగనామముల వెంకటలక్ష్మీనరసింహరావు (జగ్గయ్యపేట) 77. రెబ్బాప్రగడ వెంకటరమణమూర్తి (అచంట, ప॥ గో॥ జిల్లా) 78. నరెడ్ల భాస్కరరావు (విజయనగరం) 79. ఉప్పలూరి రవిశంకర్ (విజయవాడ) 80. కొచ్చర్లకోట నాగామణి (విశాఖపట్నం)

(81) వెలమూరి రామలక్ష్మి (సెల్లిమర్ల, విశాఖజిల్లా) 82 దొంతంశెట్టి శేషగిరిరావు (రాజమండ్రి) 83. ద్రోణంరాజు లలిత (బల్లిపాడు, ప. గో.) 84. చింతలపూడి శాయీకుమార్ (హైదరాబాదు) 85. ఆకుమారు సంజాతాదేవి (వట్టిఖమ్మంపహాడు, నల్గొండ జిల్లా) 86. నామన ఇందిరాదేవి (పాయకారావుపేట, విశాఖజిల్లా) 87. శింగితం జగన్నాథరావు (ధవళేశ్వరం తూ॥ గో॥) 88. పూసర్ల సూర్యకుమారి (చోడవరం, విశాఖజిల్లా) 89 కందాళ వెంకటసుబ్రహ్మణ్యశర్మ (బందరు) 90. శారకం అరుణాదేవి (అనంతపురం) 91. ఉద్దిరూప (విశాఖపట్నం) 92 ద్వివేదుల ఛాయాదేవి (సిమ్లా) 93. కుందుర్తి పద్మావతీదేవి ద్వారకామాయి (చీరాల) 94. ఎం. సీత (కరోల్ బాగ్, న్యూఢిల్లీ) 95. పి. లలితాబాయి (బోధన్ రోడ్, నిజామాబాద్) 96, జి. ఎం. సరోజ (ఎమ్మిగనూరు, కర్నూలుజిల్లా) 97. పొట్లమత్తు సూర్యకుమారి (నర్సీపట్నం) 98. ఊటుకూరి మురళీధరరావు (మధిర, ఖమ్మంజిల్లా) 99. కొత్త సూర్యనారాయణ (చినకాకాని, గుంటూరు జిల్లా) 100. బోనుమంగరాజు (విశాఖపట్నం.)

101. ఓ. వి. కృష్ణమూర్తి (మదనపల్లి, చిత్తూరుజిల్లా) 102. నవులూరి ఉప్పల వెంకటరామానందస్వామి బాపూజీ (ధవళేశ్వరం, తూ॥ గో॥) 103. మిర్తిపాటి నారాయణ (లంకలగన్నవరం, తూ॥ గో॥) 104 మూర్తి నాగరాజు (మద్రాసు) 105. వేటూరి సీతారామం (విశాఖపట్నం) 106. అయ్యగారి భాస్కర శ్రీరామారావు (మామిడిపల్లి, తూ॥గో) 107. చెన్నుభొట్ల అలివేలుమంగతాయారు (విశాఖపట్నం) 108 అల్లమరాజు వెంకమాంబ (బరంపురం, గంజాంజిల్లా) 109. చిల్లర కృష్ణకుమారి (కాకినాడ) 110. భాగవతుల రవీంద్రనాథ్ (ఆదోని, కర్నూలుజిల్లా) 111. పూళ్ళ వెంకటరత్నం (ఎలమంచిలి, విశాఖజిల్లా) 112 గురజాడ వెంకటరావు ప్రసాద్ (విజయనగరం) 113. వారణాసి జయశ్రీ (లక్ష్మీపురం అగ్రహారం, విశాఖ జిల్లా) 114. లావు విజయకుమార్ (విజయవాడ) 115. ఎస్. పురుషోత్తం (నల్గొండ) 116. పి సంపూర్ణమ్మ (జొన్నగురకల, చిత్తూరు జిల్లా) 117. ఎ. మనోరమ

(రాజోలు) 118. బలివాడ ప్రసాదరావు (విజయనగరం) 119 వేటూరి కృష్ణబ్రహ్మ (విశాఖపట్నం) 120 తాడేపల్లి దయాళ్ బాబు (చిలకలపూడి, కృష్ణాజిల్లా)

121. వుద్దంపేము ఉమాదేవి (కాకినాడ) 122. కొక్కిమూడి విజయకుమార (గుంటూరు) 123, నూరంపూడి నిర్మల (గుడ్లవల్లేరు, కృష్ణాజిల్లా) 124. వేగుల రత్నమాల(విజయనగరం) 125. యూడలి అప్పారావు (రాజమండ్రి) 126. ఏ ఢిల్లీరావు (శ్రీకాకుళం) 127. చింత జ్యోతి (కాకినాడ) 128. మునగవలస కోదండరావు పట్నాయక్ (వేణమ్మపేట, శ్రీకాకుళంజిల్లా) 128. జేలమూరి సీత రామమూర్తి (నెల్లిమర్ల, విశాఖజిల్లా) 129 గాడేపల్లి రాధ (పెనుకొండ, అనంతపురంజిల్లా) 130. కరణం హనుమేశ రావు (గుంతకలు) 131. సయ్యద్ నజీర్ అహామ్మద్ (ఏలూరు) 132. ఎన్. శ్రీధర రావు (చిత్తూరు) 133 కొనకంచి రమాదేవి (అనంతపురం) 134 చలసాని రాజగోపాల రావు (పడమట, కృష్ణాజిల్లా)134 జోస్యుల గౌరీకుమారి (కలకత్త) 135 వి. ధ్రువరావు (ఆదోనీ, కర్నూలుజిల్లా) 136. గాదంశెట్టి సరోజ (కళ్యాణదుర్గం, అనంతపురంజిల్లా) 137. గుళ్ళపల్లి విజయకుమార్ (గుంతకల్లు) 138. పి. దండపాణి (పెద్దాపురం, తూ॥గో) 139. అంగర అనంతరామకృష్ణారావు(న్యూఢిల్లీ) 140. ఎన్. శాంతిమోహన్ గౌడ్ (వజ్రకరూర్).

141. యార్లి లక్ష్మీరాజ్యం (బెండమూర్లంక, తూ॥గో) 142. టి.తిరుమలరావు (అనకాపల్లి) 143 లాలం శివశంకర గంగాభవాని (లాలం-కోడూరు, విశాఖజిలా) 144. దళిరాజు వరలక్ష్మి (రాయఘుడ్, ఒరిస్సా) 145. గుడవల్లేటి వెంకట రామారావు (సికింద్రాబాదు) 146. కె. ఇ అర్. ప్రభాకర్ (కదిరి, అనంతపురంజిల్లా) 147. చామర్తి సుబ్రహ్మణ్యం (ఆలమూరు) 148. నూరుపల్లి మురళీకృష్ణ(రాయఘుడ్,ఒరిస్సా) 149 నూరంపల్లి గోపాలకృష్ణ (రాయఘుడ్) 150 కే. శివనారాయణరావు (కడప) 151. ఎన్. నాగరాజు (కర్నూలు) 152 గండికోట సుబ్బరత్నమ్మ (అనంతపురం) 153. ఆలపాటి తులసి (తెనాలి) 154. జె వి. ఎన్. సోమయాజులు (విజయవాడ) 155. వేదాంతం ప్రభావతి (మద్రాసు) 156. భోగరాజు విజయ వెంకట కామేశ్వరరావు (ఏలూరు) 157. కందికొప్ప హైమవతీదేవి (హీరమండలం, శ్రీకాకుళంజిల్లా) 158. వేదుల సువర్చలాదేవి (కొకరపర్రు, ప॥ గో) 159. వన్నెంశెట్టి కౌశల్యాదేవి (శనివారపుపేట, ప॥ గో.) 160. నేమాని కృష్ణమూర్తి (విజయనగరం).

161. బోయిన కనకదుర—(ఈడేపల్లి, కృష్ణాజిలా) 162. బి. అర్. యస్. ప్రసాద్ (కర్నూలు) 163 పిలంమత్తి పుణ్యశీల (రాజరాజేశ్వరిపురము, గుంటూరు) 164 కొడిదర్ల ఫణి—(కాకినాడ) 165 జమ్మి కృష్ణారావు (పిఠాపురము) 166. కొత్తపల్లి రాధాకృష్ణ సాయిబాబా (చిన్న గంజాం) 167. పిల్లుట్ల విజయలక్ష్మీసుందరి (బాపట్ల) 168 సి. ఎన్ అరుణ తంపీ (నెల్లూరు) 169 ఉప్పల హరినాథ గుప్త (అనకాపల్లి) 170. ఎమ్. కృష్ణకుమారి (బాపట్ల) 171. సానె-లక్ష్మీమోహనరావు (శ్రీహరిపురము కృష్ణాజిల్లా) 172 కొలెపు హేమలత (కాకినాడ) 173. చామర్తి హనుమంత సర్వేశ్వరరావు (బందరు) 174. కుప్పల-సుదర్శనము-(చెర్వాల, వరంగల్లు) 175. తాడిమేటి-సూర్యనారాయణబోసు. (అత్తిలి-పశ్చిమగోదావరి) 176 టి భుజంగ రావు (పుత్తూరు, చిత్తూరుజిల్లా) 177. కొలచన సత్యనారాయణమూర్తి (పలివెల, తూర్పు-గోదావరి) 178. సిద్దాబత్తిని అరుంధతి (తెనాలి) 179 ఆకిప్ప మల్లికార్జునరావు (రాజమండ్రి) 180. పోతురెడ్డి శివారెడ్డి (కల్లూరు, కడపజిలా).

181. రాచకొండ ప్రభావతీదేవి(మాచెర్ల గుంటూరుజిల్లా) 182 యద్దనపూడి సరోజనీదేవి (యద్దనపూడి కృష్ణాజిల్లా) 183 వి. హరిప్రసాదరావు (అచ్చంపేట-గుంటూరుజిల్లా) 184. మానవ రమేషుబాబు (టంగుటూరు, గుంటూరుజిల్లా) 185 అక్కినప్రగడ నీహారమోహన్ (గుంటూరు) 186. శనగవరపు శ్రీనివాసరావు (భీమవరము) 187. పులిశేషు సత్యభారవ (ఏలూరు) 198. ఉప్పు కృష్ణమూర్తి (దోసపాడు, పశ్చిమగోదావరిజిల్లా) 189 జవహర్ హుస్సేన్ (యలమంచిలి, విశాఖజిల్లా) 190. వి. ఎస్. వి. మురళీకృష్ణ (తిరుపతి) 191. నాముగిరి వనజ (తుని, తూ॥ గో) 192 కె. నరసింహారావు (ఏలూరు) 193. ఏ లక్ష్మీబాయి (సికింద్రాబాదు) 194. మరూరు సావిత్రి (మార్కాపురము, కర్నూలుజిల్లా) 195. తూము సోమరాజు (కొల్లంపూడి తూ॥ గో) 196. కేశపల్లి వేంకటసత్య సూర్యరామలక్ష్మి (తాళ్లపూడి ప॥ గో॥) 197. సి. రంగయ్య


చీకటిలో మీ సహవాసి




మీ బేటరీ లైటు
నమ్మకముగా వెలుగుటకు ఎల్లప్పుడూ
ఎస్ట్రెలా బేటరీ వుపయోగించండి
అది చాలాకాలము వరకు ఎక్కువ
ప్రకాశవంతమైన వెలుగునిచ్చును.




ఎస్ట్రెలా బేటరీస్ లిమిటెడ్
బొంబాయి - మద్రాసు - ఢిల్లీ - కలకత్తా - కాన్పూరు
E 22

# కొందరు సభ్యుల పేర్లు

నాయుడు (కమటంపల్లి - చిత్తూరు జిల్లా) 198 వి. వి. ఎస్ మహాలక్ష్మి (ఎస్.ఆర్.పి. అగ్రహారం, పశ్చిమ గోదావరిజిల్లా) 199. న్యాయపతి రంగారాణి (పద్మపూర్, ఒరిస్సా) 200. జె. సౌభాగ్యలక్ష్మి (తాడిపత్రి అనంతపూరుజిల్లా).

201. సింగారెడ్డి అరుణాదేవి (వెంపల్లి, కడపజిల్లా) 202 ఎం. ప్రసన్న నారాయణ (కర్నూలు) 203 ఎస్. కృష్ణలీల (జంషెడ్‌పూర్, బీహారు) 204. ఎ. వెంకటరమణ దీక్షితులు (తిరుపతి) 205 సి. విజయ సారథి (కర్నూలు) 206. ఎం. ఎస్. చంద్రశేఖరయ్య (ఆర్. కె. వి. బహుదూరువారిపేట, చిత్తూరుజిల్లా) 207. రావూరి శివరామ కృష్ణారావు (కొవ్వూరు - ప॥ గో॥ 208 చాగంటి లక్ష్మి (మొగలేరు పశ్చిమ గోదావరిజిల్లా) 209 ఎం. గుండేరావు(జడచర్ల, మహబూబ్‌నగర్ జిల్లా)210. మానూరి నారాయణమూర్తి (న్యూఢిల్లీ) 211. పరాంకుశము వెంకటరామసుభద్ర (బరంపురం)212. సాంతి విశ్వనాథం (విజయనగరము) 213. మహాజనం శ్రీనివాసరావు (పాలూరు, శ్రీకాకుళం జిల్లా) 214. వాడపల్లి జగన్నాథరావు (కోటవురట్ల-విశాఖ జిల్లా) 215. ముడిమెట్ల-మంగలక్ష్మిదేవి కుమారి (పుత్సలంక, తూ॥ గో॥) 216. నూనె రామకృష్ణచౌదరి (మండపేట, తూ॥ గో॥) 217. పోతుల రవికుమార్ (పెద్దాపురము) 218. జుజ్జవరపు అనంతలక్ష్మి కుమారి (వడ్డిపర్రు తూ॥ గో॥) 219. బొప్పిలి సుభాషిణి (మార్కాపురం, కర్నూలుజిల్లా) 220 గుర్రం దుర్గాప్రసాదరావు (కమ్మపల్లి, చిత్తూరుజిల్లా.)

221 పాలపర్తి గురుమూర్తి (నెల్లూరు 222. బొమ్మిరెడ్డిపల్లి కృష్ణకుమార్ (హైదరాబాద్) 223. ముటుకూరు ప్రసాద్ ఆంజనేయశర్మ (వలపర్ల, గుంటూరుజిల్లా) 224. హనుమంచిపల్లి వెంకటశేషాచారి (బొబ్బిలి) 225. అంగజాల సన్యాసిరావు (బొబ్బిలి, (శ్రీకాకుళంజిల్లా) 226 కె. వి. రమణారావు (కటక్, ఒరిస్సా) 227. రాంపల్లి వెంకటసత్యసూర్యరాజ్యలక్ష్మి (నిడదవోలు ప॥ గో॥) 228. పుటపర్తి గీతాదేవి (మదనపల్లి) 229. ఎస్. రత్నమాలబాయి (వందరి, కర్నూలుజిల్లా) 230 తాతి సరస్వతి (బొబ్బిలి) 231. కూచిభొట్ల శశిభూషణరావు (విశాఖపట్నం) 232 పి. ప్రతాపరెడ్డి (భువనగిరి, నల్లగొండజిల్లా) 233. కుప్పా అన్నపూర్ణ విశాల (తుంగభద్రా డామ్) 234. కొప్పినీడి సత్యనారాయణమూర్తి (రాజమండ్రి) 235. కేదారశెట్టి రామచంద్రుడు (అమలాపురము) 236. మండలపర్తి సూర్యనారాయణశర్మ (కొత్తపేట, తూ॥ గో॥) 237. చిట్టూరి శ్రీనివాసరావు (తణుకు) 238. నివర్తి జగన్నాథశాస్త్రి (రాజేంద్రనగర్, అనంతపురంజిల్లా (239) దడిరావు కృష్ణ మధుసూదనరావు (విజయనగరము)240 రంగిశెట్టి-కుసుమకుమారి. (గుంటూరు.)

(241) బాయనేని ఝాన్సీ రాణి (రాపూరు, నెల్లూరు జిల్లా) (242) అనుమంచిపల్లి వేంకటరంగాచారి. (బొబ్బిలి) (243) ఎస్. సురేందర్ (గన్‌బజారు, హైదారుబాగు.) (244) నంబూరు హరబాల (విజయవాడ.) (245) జంధ్యాల రామలక్ష్మి. (విజయవాడ) (2.6) పొట్టి వెంకయ్యగుప్త (గుంటూరు.) (247) మిక్కిలినేని విజయలక్ష్మి (తెన్నేరు, కృష్ణాజిల్లా) (248) వేదాంతము సుబ్రహ్మణ్యప్రసాగు (మదరాసు) (249) మందడి పద్మారెడ్డి (చందుపట్ల, నల్గొండజిల్లా) (250) పి పట్టాభి (సంబలపూర్, ఒరిస్సా) (251) రేవూరు వెంకటసుబ్బయ్య (పొన్నాపురం, కర్నూలుజిల్లా) (252) తూఫత్ శ్రీఫర్ (తిరుపతి) (253) ఈశ్వరయ్య (కుల్లాపురం, మహబూబ్‌నగర్ జిల్లా) (254) అరిటాకుల, హనుమంతరావు (విజయనగరం) (255) ఏ మోహనరావు (హైదరాబాదు) (256) మేకా భాగ్యలక్ష్మి (పిఠాపురం, తూ॥ గో॥) (257) సంతానం (తిరుపతి) (258) పి. సుబ్బారావు కిషోర్ (కాకినాడ) (259) డమట అప్పలరావు, (యలమంచిలి) (260) మాదిరాజు విజయానందకృష్ణారావు (వేంసూరు, ఖమ్మంమెట్టుజిల్లా).

(261) కొప్పరిహనుమవెంకటసత్యనారాయణమూర్తి (పిఠాపురం) (262) వలమల నాగేశ్వరమ్మ (కోమటిపల్లి, శ్రీకాకుళం జిల్లా) (263) చాకలమడుగు ప్రభాకరరావు (రామానగరం, కృష్ణాజిల్లా) (264) సుంకర రాజమోహన్ (నెల్లూరు) (265) నల్లాని చక్రవర్తుల సత్యాదేవి (మంగళగిరి, గుంటూరు జిల్లా) (266) వి. సుందరరామయ్య

(49- వ పేజీ చూడండి)





ఇప్పుడు! పామాలివ్-
మీ సౌందర్య పోషణ కొరకు
భారతదేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములతో తయారైనది

ఈ రోజునుంచే ఈ ఒకదానిలో, రెండు ఇమిడివున్న దానితో సౌందర్య పోషణకుపక్రమించండి!

1. పామాలివ్ యొక్క మీగడవంటి సమృద్ధియగు నురుగుతో శరీరమును శుభ్రపరచండి. అదిదేహ మందలి మలినమును పోగొట్టి మీ చర్మ సౌందర్యమును కాపాడును.

2. సౌందర్యమును పెంపొందించే శుద్ధమైన సుగంధిత తైలములుగల పామాలివ్ సబ్బునువాడి మీ చర్మమును మృదువుగా, లేతగా మరియు యౌవ్వనవంతముగా ఉంచుకోండి.



పామాలివ్
సౌందర్యమునిచ్చు సబ్బు

క్రొత్తది! దీని తాజాయైన పూల సువాసన చాల సేపు ఉంటుంది.

PSO/G/13

# సుష్టుగా తింటున్నా ఆకలితో మాడేవారు!

ఆహారాన్ని, అందులో సారాన్ని శక్తిలోకి, బలంలోకి మార్చడంలో ఏపుగా, బొద్దుగా, ఆరోగ్యంగాఉన్న పసిపాపకన్న మిన్న అనతగ్గ 'యంత్రం' ఎక్కడా ఉండదనడం అతిశయోక్తి కాదు. ఇటువంటి 'యంత్రాన్ని' అగ్రశ్రేణి ఇంజనీర్లు తయారుచెయ్యలేక పోయార్సు; ఇటువంటి ఉపాయాన్ని ఎంతటి విజ్ఞాన శాస్త్రజ్ఞాలూ కనుగొనలేకపోయారు.

పసిపాపల శరీరంలో జీర్ణశక్తి అంత గొప్పది. బాల్యం తరువాతకూడా ఈశక్తి చాలవరకు శరీరంలో ఉంటుంది. యౌవనంలోనూ, ఆ దరిమిలానుకూడా చాలామంది, తిన్న తిండిని సమర్థంగా వంట పట్టించుకో గలుగుతు నే ఉంటారు. ఎలాగైనా పోనుపోను ఈయంత్రం శక్తిసామర్థ్యాలు సన్నబడతాయి. వాటిపని మందగిస్తుంది, చిన్నవాటిలా ఆయాభాగాలు పనిజేయలేవు. మనిషి అరవయ్యోపడిలో పడేసరికి, కాస్త అటూ ఇటూగా మానవ యంత్రంలో భాగాల జవసత్వాలు తగ్గిపోతాయి. పూర్వంలా చురుగ్గా తిరగవు తిరిగినా ఇట్టే అలిసిపోతాయి. అలాగని విశ్రాంతిని తీసుకోలేవు. అలా అలుపూ సొలుపూ లేకుండా, ధాటీగాపని చేసేది ఏ కొదిమందిలోనో. నూటికి కోటికి ను. అయితే ఈ మినహాయింపులే కొత్తసూత్రాలకు నిదర్శనలు కాగలవు. వీటి ద్వారానే అసాధ్యాలనిపించే లక్ష్యాలు సాధ్యాలు కావడానికి కృషి జరగాలి.

ఇప్పుడు ఈ జీర్ణశక్తి సమస్యమీద ఆసక్తి గలవారి సంఖ్య నానాటికీ పెరుగుతోంది.

"ఎప్పుడో అరవైయేళ్ళకిప. అప్పటి దాదా బతికుంటాడూ పాడా" అని కొట్టిపారేసిందుకు వీలేదు. ఎందుకంటే, అప్పటిదాకాను, ఆపైనాకూడా బ్రతికి వుండేవాళ్ళ సంఖ్య— ఆధునిక విజ్ఞానశాస్త్ర ప్రగతి ధర్మమా అని —గత 50 ఏళ్లుగా పెరుగుతోంది. మనుషుల ఆయుర్దాయం పెరుగుతోంది. మాట వరసకి అమెరికాలో షష్టిపూర్తి చేసుకుని 65 దాకా సాగినవాళ్ళు నూరేళ్ళ క్రితం నూటికి ముగ్గురు ఉంటే, ఇప్పుడు అలాంటివాళ్ళు ఎనమండుగురు దాకా కనబడుతున్నారు.

ఇప్పటి తరహా చూస్తే 1975 నాటికి నూటికి 12 గురు ఉంటారనుకోవచ్చు.

ఇదీ, జీర్ణశక్తికి పై జరిగిన పరిశోధనల వల్ల తెలిసిన విషయాలూ, ఆహారం విషయంలో కొత్త పరిశోధనలకు కారణాలు అవుతున్నాయి.

చివరకి తేలవలసింది ఒకటే ప్రశ్న.

ఆహారంలో ఏయే పదార్థాలు లోపించడం వల్ల వార్ధక్యం దాపురిస్తుంది? ఆ లోపాలను సర్దుకోవడం ఎలా?

తిండిలేక మాడడం అంటే ఏమిటో తెలుసుకోవచ్చు. కాని, ముప్పొద్దులా సుష్టుగా తింటూ 'మాడడం' అంటే కొంచెం వింతగా కనిపిస్తుంది. అయినా ఇది అక్షరాలా నిజం. తినే ఆహారంలో కావలసినది ఏదో లోపిస్తే, ఆ మేరకు, తినేవాడికడుపు ఆకలితో మాడుతున్నదన్నమాట. ఎటొచ్చీ ఈ సంగతిని, కడుపు మనకి దండోరా వేయించి మరీ తెలియచెయ్యదు.

నీరసానికీ, జబ్బులకూ కాస్త లోకువగా కనిపించేది ప్రతిఘటన శక్తిలేని వృద్ధులు. వాళ్ళకి దాగిలిమూతలాడే ఈ ఆకలిసంగతి బాగా తెలుస్తుంది. తెలీకపోయినా, దీని ప్రభావం వాళ్ళ ఆరోగ్యంమీద దెబ్బతీస్తుంది. వాళ్ళకి ఆకలి తగ్గిపోతుంది పనిలేక అని మనం సర్దిచెప్పుకుంటాం. అనుకుని తక్కువ తింటే, ఉన్న కాసిని ఆహార పదార్థాలూకూడా తగి మరింత నీరసం కలుగుతుంది. కొందరు యౌవనులే లావుతగ్గడానికని తిండి తగ్గించుకుంటారు వాళ్ళుకూడా ఈ ప్రయత్నంలో విటమినులూ అవీ లేకుండా చేసుకునే ప్రమాదం ఉంది. ఇకపోతే, ఒక మనిషి మామూలుగా తినే భోజనంలోనే, ఆరోగ్యానికి ముఖ్యమైన మాంసకృత్తులు, పిండిపదార్థాలూ [illegible] లేకపోవచ్చు. ఉన్నా, ఒక్కొక్క మనిషిలో, వాటిని జీర్ణంచుకు వంటబట్టించుకునే శక్తి తగ్గవచ్చు; అసలే లేకపోనూవచ్చు. తినే ఆహారం నాసిరకం అయిఉండవచ్చు.

ఈ ప్రమాదాలు నివారించడానికి రెండు మార్గాలున్నాయి: ఒక మనిషి అవసరాలు, తినే ఆహారం సరిచూచి, ఆహారాన్ని తగువిధంగా మార్చడం. ఇదికష్టం. రెండోది, ఆ మనిషికి అవసరమైన విటమిన్లు, ఖనిజాలూ, దేంట్లోనూ కలపకుండా, సారాన్ని యథాతథంగా యివ్వడం.

జీర్ణప్రక్రియగురించి, దాని శాఖలూను యంత్రవిభాగాల స్వభావాలగురించీ సూక్ష్మ విషయాలు తెలియడానికి ఇంకా చాలా పరిశోధన జరుగవలసిఉన్నా, ఉన్నంతలో, ఈ ఆహారసారాన్ని,–విటమినులు, మాంస

GP
RAJA (REGD) SNOW for Beauty & Complexion
MANUFACTURERS MANYAM & CO BANGALORE
రాజా స్నో
అందానికి, ముఖవర్చస్సుకు.
రాజా (REGD) అగరు వత్తులు
మీ యింటియందు నవకోమల పరిమళం ఘుమాయింప జేయును.
RAJA AGARBATHI
Use RAJA KASTURI SOAP for luxury Bath, RAJA BAR SOAP for easy washing.
MANYAM & CO.,
Raja Snow Buildings, Bangalore-3 *Branches:* Bombay, Madras, Madurai.

# పిల్లలకోసం

ప్రపంచంలో ఉండే బీద పిల్లలందరికీ సహాయం చేయాలనీ, వాళ్ళకు జబ్బులు రాకుండా చూడాలనీ, వాళ్ళు అందంగా, బొద్దుగా ముద్దొచ్చేలా పెరగడానికి బలమైన ఆహారం ఇవ్వాలనీ కొందరు పెద్దవాళ్ళకి ఒక రోజున ఒక ఊహ కలిగింది. అది కలగడానికి కారణం జిట్కా సంకోవా అనే ఒక అమ్మాయి. ఆమె జెకోస్లావాకియాలో ఉంటోంది. ఇప్పుడు పెద్ద అమ్మాయి అనుకోండి.

ఆ అమ్మాయి చిన్నతనంలో, దాదాపు పన్నెండేళ్ళ క్రితం వాళ్ళ సీమలో వానలు కురవక కరువు వచ్చింది. యుద్ధం వచ్చింది. ఇంకా జబ్బులు వచ్చాయి. పిల్లలు ఆకలితో మాడిపోయారు. ఎందరికో కడుపు నిండా తిండిలేక జబ్బులు వచ్చాయి. ఇలా ఉండగా ఒక రోజున ఊళ్ళోకి ఒక పెద్ద లారీ వచ్చింది. అందులో పాలు, తినడానికి రొట్టెలు, మందులు ఉన్నాయి. ఆ పాలతో ఎందరో కోలుకున్నారు. మందులతో ఎందరో బాగుపడ్డారు. ఆ వ్యానులో సరుకులు అక్కడి పిల్లల ప్రాణాలు కాపాడాయన్న మాట. వాటిని యూనిసెఫ్ వారు పంపించారు.

యూనిసెఫ్ అనేది పిల్లలకోసం పెట్టిన నిధి.



'దీపావళి' అనే ఈ చిత్రాన్ని క్రిట్జ్‌బస్ అనే జర్మన్ చిత్రకారుడు వేశాడు

ఐక్యరాజ్యసమితివారు, దేశదేశాలలోని బాలబాలికల ఆరోగ్యంకోసం మందుమాకులూ, పాలూ ఉచితంగా పంపడానికి డబ్బు పోగుచేసి ఇందుకై ఉంచుతారు. వీరే జిట్కా సంకోవా ఊళ్లో పిల్లలకి పాలూ మందులూ పంపినది. ఇలా పంపినందుకు తామందరూ ఎంత సంతోషపడ్డారో తెలుపుతూ తమ కృతజ్ఞతకు గుర్తుగా ఏమైనా పంపాలనీ జిట్కా ఆమెతోటి పిల్లలూ అనుకున్నారు. వాళ్ల మేస్టరుకి చెప్పారు. జిట్కా ఒక బొమ్మ వేసింది. కాగితం దొరక్క, ఒక అద్దంమీద ఆ బొమ్మ వేసింది.

యునిసెఫ్ అధికారులకి పిల్లలు డాన్సు చేస్తున్నట్టున్న ఆ బొమ్మ నచ్చింది. అంత చిన్న పిల్ల, అంత మంచిమనసుతో వేసినదని, ఆ బొమ్మని లక్షలకొద్దీ కార్డులుగా అచ్చు వేయించారు. దీపావళికి మనం స్నేహితులకీ చుట్టాలకీ పంపే (గ్రీటింగ్స్) కార్డులాంటివన్న మాట. వాటిని జెకోస్లావాకియాలోని అన్ని ఊళ్లలోనూ అమ్మించారు. అవి అమ్మగా వచ్చిన డబ్బుతో మళ్లీ పాలూ, మందులు తెప్పించి డబ్బులేక జబ్బులతో, ఆకలితో బాధపడుతున్న ఎందరో పిల్లలకి పంచిపెట్టించారు.

ఈ పద్ధతి చాలా బావుందని, అప్పట్నించీ ప్రతి ఏడాదీ అలాగే కార్డులు వేయించి అమ్మి డబ్బు పోగుచేస్తున్నారు. అన్ని దేశాలలోనూ అందరూ వాటిని కొనుక్కుంటున్నారు. పెద్ద పెద్ద చిత్రకారులంతా ఈ కార్డుమీదకి ఎంతో అందమైన బొమ్మలు వేసి యిస్తున్నారు. ఈ కార్డులు పదేసి కలిపి ఒక పెట్టెలో పెట్టి అమ్ముతారు. పెట్టె ఐదు రూపాయలు.



మానవ హక్కులు ఈ చిత్రాన్ని [illegible] (ఆఫ్రికా) వేశాడు.



# మనిషిలో మనిషి

(నాటకం)

ప్రఖ్య శ్రీరామమూర్తి

(గతవారం తరువాయి)

రఘు: (వస్తూనే) ఇంకే పార్సిల్సు లేవక్కడ.

శేఖర్: లేవూ? తమాషాగానే వుందే! (టేబులుమీదవి అన్నీ చూసి) ఓ - సారీ. అన్నీ తీసుకొచ్చేశాను. అరె - అనవసరంగా మెట్లు దింపించి ఎక్కించానే నిన్ను!

రఘు: అనవసరం ఏం లేదులే. టాక్సీవాడు కాచుకునేవున్నాడు కింద.

శేఖర్: ఆఁ ఆఁ అవును. వాడున్నాడుగా.

సుజాత: (అటువెళ్తూ) ఇహనే వెళ్లాలి బాబీ.

శేఖర్: (ఉలిక్కిపడి) ఆఁ? నువ్వు - నువ్వు వెళ్తున్నావా? అప్పుడే?

సుజాత: అవును. వెళ్లాలి రాజా.

శేఖర్: పోనీ రాణీ వచ్చేదాకా నైనా ఆగిపోరాదూ?

రఘు: అన్నట్టు - ఆ అమ్మాయేదిరా?

శేఖర్: వస్తూవస్తూ కేకేశాను గాని - గేయం ఒకటి రాస్తోంది - సహాందాకా వచ్చిందట-

రఘు: ఐతే యిహ రేపొద్దున వచ్చినా వచ్చినట్టే!

శేఖర్: అఁహాఁ-లేదులే. మేడమీద నుంచి కేకేసి చెప్పింది-చాలా చిన్న గేయమే నట!

[రఘు కూర్చుని పార్సిలు ఒకటి ఊడదీస్తూంటాడు.]

రఘు: పిచ్చిపిల్లపాపం...ఎప్పుడో పెళ్ళి కావలసింది...అవునూ-అసలు పెళ్లి కావలసింది లిల్లీ వుండగా దాని బదులు ఉత్సవి గ్రహంగా రాణీనే మనిద్దరి మధ్యా కూర్చోబెట్టి పెళ్లంటే ఎలాంటి మజాయో చాలుగుమ్మక్కలో—

శేఖర్: (లేచి) వాట్?

రఘు: అబ్బ-అసహ్యంగా ఏంమాట్లాడ్డం లేరా. అంతా హయ్యర్ ప్లేన్‌లోనే! భావాంబరవీధిలోనే! నెమ్మదిగానిదానంగా కూర్చుని డిన్నరు కానిద్దాం. 'భోజనమధ్యే' గానీ 'భోజనాంతే' గానీ ఆమెరాసిన చిన్న గేయం వినిపిస్తుంది మనకి!

[ఈలోగానే సుజాత గుమ్మందాకా అలికిడి కాకుండా వెళ్ళింది. గుమ్మంలో ఆగి ఓక్షణం పస్తాయించి-]

సుజాత: వెళ్లొస్తాను బాబీ.

[ఒక్క క్షణం నిశ్శబ్దం. ఈ నిశ్శబ్దంలో రఘు లేచి ఆమెకేసి కాస్త నడిచి, అంతలోనె మరో ప్రక్కకు రెండడుగులు వేసి ఆగుతాడు.]

రఘు: జీవితంలో ఎలాంటి డ్రామావుంది రాజా! చూశావా ముందు మాటిచ్చిన ఫలితంగా నాకొక్కవాల్సిన పెళ్లాం నన్ను వదిలేసి పోవాల్సివస్తోంది. సొసైటీ, సభ్యత ఆమెకున్న స్వకీయకార్యాలూ ఆమెను నాకు దూరం చేస్తున్నై. ఆమెమాత్రం ఏం చేస్తుంది...ఉప్పొంగి వచ్చే కన్నీరు అపుకోడానికి ఆమె కళ్లు మూసుకుంటోంది - చూడు!

[సుజాత చెయ్యిజాచి అందిస్తుంది]

మీదపడి యేడవటానికి చూసేవాళ్ళేమనుకుంటారో నని భయంవేసినా ఆగాని వియోగభారంతో చెయ్యి అందిస్తోంది!

[ఆమె చెయ్యి అందుకుని ఒక మోకాలి మీద కూకరిల్లి—]

గుడ్ బై మై లవ్, మై ఏంజిల్, మై లైఫ్! నాట్యంచేసే ఆ కళ్లు, రాగాలుతీసే ఆ గొంతు, లాస్యంచేసే ఆ పెదవులపర్వు, నా మెడచుట్టూ ఆటలాడుకునే ఈ చిటి చేతులూ-ఏవీ-ఏవీ కూడా ఎన్నటికీకూడా మరువలేను. [లేస్తూ—] మంచిది పోయిరా లిల్లీ! జాగ్రత్త-బైట చలిగాలి వేస్తోంది. మఫ్లరు చెవులమీదుగా బాగా కప్పుకో.

[ఆమె భుజంమీద వేలాడుతున్న మఫ్లరు తీసి అలా కప్పుతాడు]

మళ్లీ తప్పకుండా రావోయ్—ఎంతఆలస్యమైనా సరే-ఎప్పుడైనా సరే-నే నేమైనా అనుకుంటానని నువ్వేం అనుకోకు—

[లేచి ఆమె నొసలు చుంబించి, తలుపు బోర్లగాతీసి నిలబడతాడు. సుజాత ఒక్కక్షణం అతనివంక చూసి గభాల్న చేతుల్తో మొహం కప్పుకుని గబగబా బైటికి వెళ్లిపోతుంది. రఘు తలుపు వేసాడు.]

శేఖర్: (ఇందాకటినుంచీ దిగులుగా, కించిత్ రవ్వంతా విమూఢంగా చూస్తున్నవాడల్లా గబగబా లేచి) బాబీ!—(నోట మరి మాట పెగలదు.)

రఘు: అదేమిట్రా అలా దిగాలుపడతావ్ కొంపంతా మునుగు పోయినట్లు? ఏం—ఒంట్లో బావులేదా?

శేఖర్: బాగుండకేం? నిక్షేపంలా వున్నాను.

రఘు: గుడ్. శుభమా అంటూ నేనేదో పెళ్ళి తలపెట్టుకుంటుంటే...ఉరేయ్ - పది గంటలకల్లా వచ్చెయ్యాదురా లిల్లీ?

శేఖర్: ఆఁ—ఆఁ—ఎందుకు రాదూ!

రఘు: అదేమిట్రా—రాదన్నట్టు మాట్లాడతావ్?

శేఖర్: అబ్బే—

రఘు: లిలీ తప్పకుండా వస్తుంది. పదింటికి కాకపోతే పదకొండుకి వస్తుంది. ఆ ఫారన్ రిటరన్డ్ ఎంత ఆలస్యం చేసినా అధమం పన్నెండింటి లోపు వచ్చేస్తుంది.

శేఖర్: అవునవును.

రఘు: మేం పెళ్ళి చేసుకునే మాట ఖాయం. నేను సంకల్ప సిద్ధుణ్నిరా. నేను సాధించలేంది లేదు...కాని...ఒక్క అనుమానం నాకెప్పుడూ జ్ఞాపకం వస్తూవుంటుందిరా...నేనెప్పైనా బొమ్మ రాయడానికి ప్రయత్నిస్తా ననుకో......అది పోయినంత వరకూ బాగానే పోతుంది. ఆతర్వాత దబ్బీ చెడీ ఎంత ప్రయత్నించినా గీయలేకపోతాను. అది నా కంట్రోలులో లేదు.

# ★ మనిషిలో మనిషి ★

న్ను నా చెయ్యి ఈడుస్తుంది. నా చేతిని నా పెన్సిలు ఈడుస్తుంది. నా పెన్సిలు జీవితం చాలా విచిత్రమైంది. డ్రాయింగ్ పేపరు కనిపిస్తే చాలు మంత్రించినట్లయిపోతుంది...

(వున్నట్లుండి గభాల్న శీర్షాసనం మీద నిలబడతాడు.)

ఉకేయ్—నిజంగా జీవితం చాలా బ్యూటిఫుల్ రా—కదూ?

శేఖర్ : ఏమిట్రా ఈ వెఱ్ఱి ఆనందం?

రఘు: వెఱ్ఱి ఆనందమా? నా ఆనందం నీకేం తెలుసురా నారాజా—

* తూరుపునబుట్టి మిన్నెక్కి తొంగిచూచి
యబ్ధి బొంగించి కువలయ మలరజేసి
కమలజాండ కటాహంబు గలయ బ్రాకి
చలువలను గుమ్మరించి ప్రశాంతి నెసగు
పావన ప్రేమచంద్రికా పటలమందు
నెంత యమృతంబు గలదో యెవరికెరుక?
ఎంత మాధుర్య మున్నదో యెవరికెరుక?
ఎంత లావణ్య మున్నదో యెవరికెరుక?
ఎంత యానంద మున్నదో యెవరికెరుక?

శేఖర్ : బాబీ—

రఘు: ఆఁ—?

శేఖర్ : బాబీ—

రఘు: ఆఁ...?

శేఖర్ : ఆఁ...అహఁ - ఏం లేదు...

రఘు ఏదో వుంది.

శేఖర్ : ఏం లేదులేగానీ...

రఘు: ఆఁ...! నాకు తెలుసు—నీ బాధేమిటో నాకు తెలుసులేరా! మనబాబీకి పెళ్ళి అవుతోంది. అతనికేం బహుమతి ఇద్దామనికదురా నీ విచారం?

శేఖర్ : ఆఁ...అహఁ.

రఘు: మొహమాట పడకురా అబ్బీ. ఐనా నీకెందుకురా విచారం? మనలో సంపాదనపరులెవరు? నే నేకదా! ఎందుకని? నా బొమ్మలు అమ్ముడు పోతాయి గనక! ఎందుకని అమ్ముడు పోతాయి? నన్ను ప్రేమించే మిత్రులు చాలామంది ఈ విశాల విశ్వమంతటా వున్నారుగనక—వాళ్ళు లేకపోతే నేను 'దారీ తెన్నూ కానగరానీ...'

(గద్గదికమైన కంఠంతో పాటలోకి దిగబోతాడు. శేఖర్ 'ఇష్—ఉకేయ్' అని వారిస్తాడు రఘుపుంజాకుని, అతనికేసి తిరిగి కన్నుగొట్టి—)

థేంక్సు టు మై ఫ్రండ్స్! బొమ్మలు గీస్తున్నంతసేపూ బ్రహ్మానందం అనుభవిస్తాను. నా ఆనందం నా విషాదమూర్తుల్లో ప్రతిఫలిస్తుంది. పెళ్ళికూడా చేసుకుంటాను ఇహ నా ఆనందానికి పట్టపగ్గాలుండవ్! నువ్వేమో నాకేం బహుమతి ఇవ్వాలా అని బుఱ్ఱబద్దలుగొట్టుకుంటున్నావా!...అసలు బహుమతి ఇవ్వాల్సింది నేనురా నీకు! నీకేం కావాలో చెప్పు... ఉ-హుఁ-వొద్దు-నీకేం బాగుంటుందో నేనే చెపాను...అహ-కొంచెం-నీకు నచ్చిందేదో నువ్వే కొనుక్కుందువుగాని—.

(అంటూ గబగబా లోపలికి వెళ్తాడు.)

శేఖర : (లోపలికి వినపడేట్లు) నిజంగా నీకుమతిపోయింది.

రఘు : (లోపల్నుంచి) నాకు పెళ్ళి అవబోతోందంటావా లేదా?

(లోపల్నుంచి ఒక చేత్తో టేబుల్ క్లాత్, ప్లేట్లు పట్టుకుని రెండో చేత్తో జేబులో ఏదో దోపుకుంటూ వస్తాడు. బల్లమీద గుడ్డపరిచి ప్లేట్లు సర్దుతూ—)

ఇవ్వాళ నా పెళ్లి నిశ్చయంరా! ఉకేయ్-

ఖుషీని నువ్వు ఖూనీ చెయ్యొద్దనుకుంటే ఇదుగో ఇది పుచ్చుకో.

(జేబులోంచి పదిరూపాయల కాగితాలు రెండుతీసి అందిస్తాడు.)

నీకిష్టమైంది నువ్వు కొనుక్కు తెచ్చుకో.

శేఖర్ : అబ్బే-అహ—.

రఘు : నన్ను చిన్నబుచ్చాలని నీకూ కూడా వుందా యేమిరా?

శేఖర్ : ఛా ఛ.

రఘు : ఐతే మరి తీసుకో. తీసుకుని నువ్వు కూడా నన్ను మందానందకందళితహృదయారవిందుణ్ణి చెయ్యి.

శేఖర్ : (ఏదో తప్పు చేస్తున్నట్టు తీసుకుంటూ) థాంక్స్. (జేబులో పెట్టుకుంటాడు.)

రఘు : ఏం కొంటావ్?

శేఖర్ : ఊఁ...టాయిలెట్ సెట్ ఒకటి కొనుక్కుంటాను.

రఘు : అందులో రేజరు కూడా వుంటుందా? ..నాకొచ్చేబోయే భార్యలాగా నే ఆ సెట్ కూడా నీకు జీవితాంతం ఆనందం యిచ్చుగాక!

[శేఖర్ తెల్లబోయి అతనివంక తేరిపారజూసి, ఏం అనలేక ఇకిలిస్తాడు. వీధి వాకిలి బెల్ చప్పుడు.]

అదుగో రాణీ వచ్చినట్టుంది.

తలుపు తెరుస్తాడు. వీరభద్రయ్య వేషంలో గురవాచారి ప్రవేశం వయస్సు 40 సం॥ కాస్తపాతకాలపు తరహా. పంచె-చొక్కా-కోటు - ఉత్తరీయం - చంకలో గొడుగు. మనిషి కాస్త ఆదుర్దాగా కనిపిస్తాడు.]

కొంచెం మా వీరభద్రయ్య మామ! రా మావయ్యా! లోపలికిరా, ఇదుగో ఇతను రాజు అని నా స్నేహితుడు. కూర్చో... ఇప్పుడే వస్తానూ? రాజూ, మావయ్యతో మాట్లాడుతూ ఉండరా ఇప్పుడే వచ్చేస్తాను.

[లోపలికి వెళ్తాడు.]

శేఖర్ : నమస్కారమండీ... కూర్చోండి.

గురవాచారి : (కూర్చుంటూ, అతన్ని నిదానించి చూస్తూ) ఆఁ...మా బాబి స్నేహితుడవా నాయనా నువ్వు?.. నీ పేరేమిటో గాని...

శేఖర్ : అవునండీ

గురవా : పాపం వట్టి మేధకుడు-మావాడు! చాలా మంచివాడు లే!

శేఖర్ : అవును.

గురవా : అసలు మేనల్లుడంటే ముందు మావాడి సంగతే చెప్పాలి...పిచ్చినాయన.. ఈ దుర్వార్త విని ఎంత తల్లకిందులౌతాడో పాపం...అసలే వట్టి కెంపి లేని మనిషి!

శేఖర్ : ఐతే మీకూ తెలిసిందా?

గురవా: మరి—?

శేఖర్ . అఁహఁ—

గురవా: కాని—నీకెల్లా తెలిసిందీ? బాబీకూడా తెలుసా అప్పుడే? అతను గాని చెప్పాడేమిటి నీకు?

శేఖర్ : అబ్బెబ్బే—అతనికేం తెలీదింకా పాపం. అంతా ఆవిడే చెప్పింది.

గురవా: ఎవరు?

శేఖర్ : లిల్లీ.

గురవా: ఆ అమ్మాయి కెల్లా తెలుసూ?

శేఖర్ : సరె—అసలావిడే గదండీ ఇప్పుడు లేచిపోయింది!

గురవా: మా ఆవిడపేరు లిల్లీ కాదే!

శేఖర్ : క్షమించండి, కాస్త గందరగోళంలో పడ్డట్టున్నాం మనిద్దరం. మీ ఆవిడగారెవరో నాకు తెలీదు.

* పై పద్యానికి శ్రీ వేంకటపార్వతీశ్వర కవులకు కృతజ్ఞత.

గ్రామకరణముల భూమిశిస్తు
నయా పైస జంత్రి
1, 2, 3 భాగములు
ఇంగులో గ్రామ కరణములకు మిక్కిలి ఉపయోగపడు భూమిశిస్తులు లాండు శిస్తు, ఎడ్యుకేషన్ సెస్సు, ఫసలీజాస్తి తీరువ జాస్తి, నీటి తీరువలు వర్షాధిక్యం వలన కలుగు కలావతిముజరాలు, వడ్డీ లెక్కలు నెలసరి జీతములు సెంట్లు ఎకరములకు నయా పైస లెక్కలతో తెలుపు-గొప్ప జంత్రి.
డెమ్మీ సైజు 200 పేజీలు వెల: రు. 4.00
బాలసరస్వతీ బుక్ డిపో,
పి. బి. నం. 3, కర్నూలు, మద్రాసు.

గురవా: ఇంకెక్కడి 'మా ఆవిడ' నాయనా! అదేగా ఇప్పుడు లేచిపోయింది! వొద్దుబాబూ వొద్దు. జన్మజన్మానికీ ఆడదాన్ని పెళ్ళి చేసుకోకోక నాయనా. తిరిగి తిరిగి భోజనం టైము కింటికి పోయేసరికి గొళ్లేనికి చీటిముక్క తగిలించివుంది—"నే వెళ్లిపోతున్నాను—నాకోసం చూడవక్కర్లేదు!" అంతే—ఎంత తెగింపో ఎంత నిబ్బరమో చూడు!

శేఖర్: అయ్యొయ్యో—ఎంత దారుణం!

గురవా: వెంటనే నేను హుటాహుటీ లోపలికివెళ్లి డ్రాయరు తెరిచి—

శేఖర్: (ఆదుర్దాతో) చాకో బాకో తీశారేమిటి, ఆత్మహత్య చేసుకోడానికి?

గురవా: అబ్బెబ్బే—పద్దెనిమిదేళ్లు కాపరం వెలగబెట్టిన ఆడది లేచిపోతే కాస్త తల్లకిందులు కావడం సహజేగాని మరీ అంత మూర్ఖంగా ఎవడుంటాడు? నే తీసింది చాకూ కాదు బాకూ కాదు—నా జాతకం!

శేఖర్. అదెందుకూ?

గురవా: జరిగిందీ జరగబోయేదీ—భూత భవిష్యద్వర్తమానా లన్నీ రాసిపెట్టి వున్నయ్యందులో. మహానుభావుడు—మూడురూపాయలుమాత్రం పుచ్చుకుని అరికాలి ముద్రలూ అరిచేతిముద్రలూ సుళ్లూ గిళ్లూ తణిఖీ చేసి జన్మలగ్నం గ్రహబలం అంతా పరిశీలించి మన జాతకం రాసిపెట్టాడు చచ్చి ఎక్కడున్నాడో గాని ఆయః హస్తవాసికొద్దీ రాసిపెట్టినంతా జరిగింది

[జేబులోంచి జాతకంతీసి చదువుతాడు.] ఆఁ...ఊఁ...ఇదుగో ఇక్కడుంది అసలు సంగతి!—"కట్టుకున్న ఆడది కాస్త రాలుగాయి.. బండీ బోర్లాపడకుండా వుండాలంటే కాస్త అడకువతో నే నడుచుకోవాలి ...చివరకు పరారీతో పెళ్ళి పెటాకులై పోతుంది!" చూశారా?...ఏమంటారు మీరు దీనికి?

శేఖర్: చాలా నిక్కచ్చిగా రాశాడు.

గురవా: అదేమరి. అల్లా రాసిపెట్టివుంది కనకనే—సూర్యుడో మరెవడో శనిగాడిలా తగలడబట్టే—అది లేచి చక్కాపోయింది.

శేఖర్: మరే కారణమూ లేకుండా వుత్తినే గ్రహవిశేషంకొద్దీ లేచిపోయిందంటారా?

గురవా: అసలు ఎప్పటికైనా ఫలానా ఫలానా గ్రహాలు కలిస్తే ఫలానా టైంలో పెట్టే బేడా సర్దుకుని ఓ చీటిముక్క రాసిపెట్టి పలాయనం చిత్తగించి తీరాల్సిన దండుముండకి మంచిమొగుడుగా వుండాల్సిన అవసరం నాకేముందండి!...(గొంతు తగించి) అందుకని దీన్ని ఎలాగూ జీవితాంతం నమ్ముకుని లాభంలేదని మా యింటి చాకలిదాంతో కాస్త సావాసంచేశాను. ఎల్లా పసిగట్టిందో పసిగట్టివుంటుందండీ. ఐనా ఆ మాత్రానికి--

శేఖర్: ఓ! ఐసీ...

గురవా: అసలు వచ్చిన చిక్కంతా ఎక్కడంటే—పోయేది ఒక్కత్తీ పోలేదు.

శేఖర్: అవును మరి - లేచిపోవడమంటే ఎవళ్ళనో ఒకళ్ళను తీసుకునేగా!—

గురవా: అది సరే లేవయ్యా. అందులో బ్రహ్మాండమేముంది. ఐనా అది ఎవడితో పోతేమటుకు నాకేం?

శేఖర్: మరి—!

గురవా: వొంటెని బోలెడు నగానట్రా వుంది. పెట్టెలో బోలెడుసొమ్మంది. అంతా వూడ్చుకుపోయింది పీనుగ!

శేఖర్: అయ్యో పాపం - ఏమాత్రం వుంటుంది?

గురవా: (జాతకం చూసి జేబులో పెట్టుకుంటూ) ఇది మిగిలింది. ఇది మినహా నా యావదాసీ మూట కట్టుకు చక్కాపోయింది. ఏంచేసేది-ఇన్నాళ్ళూ పరువుగా బ్రతికిన ఘటాన్ని-నా పెళ్లాంసొమ్ములో సహా వుడాయించిందని ఏ మొహం పెట్టుకుని పోలీసు రిపోర్టివ్వను?

శేఖర్: ప్చ్ - చాలా కష్టమే పాపం.

గురవా: ఒక్క కానీ రొక్కం లేకుండా చేసింది ఒక్క కానీ అంటే ఒక్క కానీ! అందుకనే పోనీ మా బాబిగాడి దగ్గరేమైనా వుంటే చేబదులు పుచ్చుకుపోదామని వచ్చాను. ఖర్మకాకపోతే యేమిటి చెప్పండి- 'బాబీ బాబీ మా ముసిల్ది లేచిపోయింది - జేబులో కానీడబ్బు లేదు - ఓ యిరవై లక్షలుంటే అప్పియ్యి నాయనా' అని ఎలా అడిగేది?

శేఖర్ ఇరవై లక్షలా? రూపాయలు?

గురవా: అదేలే నాయనా- వెనకెప్పుడో ఘనంగా బ్రతికినవాళ్లం. వంద రూపాయల కాగితాలు రూపాయి కాగితాల్లా మార్చి తగలేసేవాళ్ళం. ఏదో పాతవాసనకొద్దీ ఖర్చు చేసేది రూపాయైనా లక్ష ఖర్చుపెట్టి నట్టుండాలని—

శేఖర్: ఓ! ఐతే ఇరవై రూపాయ లన్నమాట!

గురవా: ఎంతైతేమటుకు బాబిగాణ్ణి ఎలా అడగటం? అంతకంటే అవమానం ఇంకేముంది నాకు?...ఛాఛా—అసలిక్కడికి రాకుండా వుండాల్సింది నేను. ఈ సంగతే ఎత్తకూడదు!

శేఖర్: నా వుద్దేశం కూడా అదే బాబుగారూ. అందులోనూ ఈపూట ఇలాంటి సంగతి వాడికి తెలిసే...

గురవా: కాదు మరీ? ఎంత షాకు – ఎంత షాకు! అసలు వీడికి వాళ్ళత్తంటే ప్రాణం ఎందుకనో గాని!

శేఖర్: (జేబులోంచి ఇరవై రూపాయలు తీస్తూ) మీరేం అనుకోనంటే...

గురువా: అదేమిటి నీ చేతిలో? (ఆశగా చూసి, నిలదొక్కుకుని) అబ్బే—ముక్కూ మొహం ఎరగని కొత్త మనిషినుంచి...

[వీధి తలుపు గంట మోగుతుంది. లోపలనుంచి రఘు వచ్చి అటు వెళ్లాడు. అతన్ని చూసి శేఖర్ నోట్లు దాచి, ఏమీ ఎరగనట్టుంటాడు. అతను వెళ్లగానే మళ్ళీ బెటికితీసి—]

మొహమాట పడకండి మళ్ళీ వాళ్ళొస్తే కుదరదు.

గురువా: మొహమాటం నా కెప్పుడూ లేదు. ఐనా మీ దగ్గర—

శేఖర్: మీకంత ఇష్టం లేకపోతే... [నోటు జేబులో పెట్టుకోడానికి మడత పెడ్తూంటాడు.]

గురవా: (ఆదుర్దాగా చెయ్యిజాచి) సరే ఇవ్వండి. వొద్దంటే బాగుండదు.

శేఖర్: (ఇస్తూ) బతికించారు.

గురవా: (ఖటెక్కిన లాక్కున్నంత పని చేసి) అదేమిటో నిన్ను చూడంగానే ఆత్మబంధువుని చూసినట్లయింది నాకు. నీ వుపకారం—

శేఖర్: ఆఁహాఁ—

గురవా: నువ్వెంత మంచివాడివి నాయనా! బాబితో చెప్తాను—

శేఖర్: అహఁహఁ—ఇదేం వాడికి చెప్పకండి వాళ్ళత్తయ్య సంగతికూడా ఈపూటేం చెప్పొద్దు.

గురవా: మరి...

శేఖర్: ఏదో దోవేపోతూ చూసి పోదామని వచ్చానని చెప్పండి. ఈ పూట బాబీ పెళ్ళి నిశ్చయం చేసుకుంటున్నాడు. దాంతో బాటు ఏదో విందు కూడానూ!

గురవా: ఏమిటి? బాబీకి పెళ్లా? హోరి బడుద్ధాయ్! చెప్పన్నా చెప్పాడు కాదు!

శేఖర్: కాని పాపం...ఆ కాబోయే పెళ్లికి పెళ్లికూతురు లేదు.

గురవా: (అర్థంకాక) ఎట్లా?

శేఖర్: చిత్రంగా లేదూ?

గురవా: మహా చిత్రంగా వుంది.

[రాణీవేషంలో సరళ ప్రవేశిస్తుంది. ఆమెవెనకే రఘు వస్తాడు. సరళ చాలా అల్ట్రామోడర్న్ డ్రెస్‌లో వుంటుంది. విశాలమైన కళ్లతో ఎక్కడో చూస్తూ దోవలో వున్న మనుషుల్ని కూడా చూడ


కలవరపడు స్త్రీలకు

"కుమారి" మాత్ర మరువకండి మీ ఆరోగ్యం రక్షించును చింత అనవసరం

వెల (సాదా) రు. 3/-
(స్పెషల్) రు. 5/-
(ఎక్స్‌ట్రా స్పెషల్) 8/-
పోస్టేజిప్యాకింగు ప్రత్యేకం

P. DEVEE & CO. (A.P.) Calcutta-10

# ★ మనిషిలో మనిషి ★

కుండా సరాసరి వెళ్ళి సోఫాలో అటు తిరిగి కూర్చుంటుంది.]

రఘు : ఏం మావయ్యా ! రాజు చెప్పా డనుకుంటాను నా పెళ్లి సంగతి—అనుకో కుండా నిమయానికొచ్చావ్—నువ్వీ పూటకు మాతోనే వుండిపోవాలి !

గురవా : అంతకంటేనా బాబూ !

రఘు : (సరళను చూపుతూ) ఇదుగో పెళ్లికూతురు—రాణి !

[శేఖర్ కలవరపడి ఏదో అనబోతాడు కాని రఘు అతనికాలు తొక్కి, గురవాచారి వంక చూసి ఏమీ ఎరగనట్టు మందహాసం చేస్తాడు.]

గురవా : (కంగదగోళంలో పడి, శేఖర్‌తో) మరి—పెళ్లికూతురు లేదని చెప్పావ్ నువ్వు ?

శేఖర్ : ఆఁ...

రఘు : ఈ విడ కవయిత్రి కూడా మావయ్యా !

గురవా : ఏమిటీ ?

సరళ : (మొహం బుజంవరకూ తిప్పి) నేను కవిత్వం వ్రాస్తాను. (అని మళ్ళీ తన పోజ్ లోకి తిరిగి పోతుంది.)

గురవా : నీకిన్నాళ్ళకి బుద్ధివొచ్చిందిరా బాబీ ! చక్కనిచుక్క ! ఈడూజోడూ కూడా సరిగ్గా సరిపోతుందిరా !

రఘు : ఏదు మావయ్యా ?...(సరళ దగరకువెళ్ళి) ఆఁ—ఇహ వింగుప్రయత్నాలు కానిద్దామా రాణీ ? (గురవాచారి వైపు తిరిగి) ఇప్పట్నుంచే కార్యభారం నెత్తినవేసుకున్నా మావయ్యా !

[సరళ లేచి లోపలికి వెళుంది.]

గురవా : ఎంతవినయం—ఎంతవిధేయత ! చాలా అదృష్టవంతుడివిరా నాయనా నువ్వు!

సరళ : (లోపల్నుంచి) బాబీ !

గురవా : వస్తున్నా వుండమ్మా నే సాయం చేస్తా నీకు.

[లోపలకు వెళ్తాడు.]

శేఖర్ : ఏమిట్రా నీవ్యవహారం? అయనతో ఇందాక నే చెప్పేశాన్నేను పెళ్ళి కూతురు లేదని!

రఘు : నువ్వేదో వేళాకోళం ఆడుతున్నావనుకుంటాడు లే పోనీరా.


నారసింహ లేహ్యము

బంగారుతో చేరినది. మేహము, నీళ్లాక, నిస్సత్తువ వగైరా హరించి బలము రక్తవృద్ధి కల్గించును 20 తు డబ్బి రు 3-4-0. పోస్టేజియ. 1-1-0

ఏ. ఎ. ఏ. అండ్ కంపెనీ ఆయుర్వేద సమాజం పెరిడేపి (PO) నెల్లూరుజిల్లా.


శేఖర్ : ఎందుకనుకుంటాడు? బావా-

రఘు: ఓ కేయ్-నీపుణ్యమా యని-నువ్వు కాస్త పూరుకుండూ-ఒక చిన్న ప్లాను వేశాను.

[గురవాచారి లోపల్నుంచి ఫలహారాల ప్లేటతో ప్రవేశిస్తాడు.]

గురవా: ఎక్కడ పెట్టాలివ్వీ?

[రఘు అందుకుని టేబులుమీద సర్దుతూంటాడు.]

సరళ: (లోపల్నుంచి) ఓయ్ రాజా! నువ్వు కూడా రారాదూ-కాళ్ళు బారజాచుకు కూర్చోకపోతే?

శేఖర్ : వచ్చే వచ్చే వస్తూంటే నే!

[లోపలికి వెళ్తాడు.]

రఘు: ఏం మావయ్యా...ఆఁ ..ఇందాక నేలేనప్పుడు రాజు నీతో యేమన్నా అన్నాడా...కాస్త పిచ్చిపిచ్చిగా...?

గురవా: ఊఁ...నిజానికి...

రఘు: నువ్వదేం పట్టించుకోకు. వాడికి చిన్నప్పట్నుంచీకూడా వేపకాయంత వెఱ్ఱి!

గురవా: నిజమే?

రఘు: పెద్ద ప్రమాదమైందేం కాదనుకో. అప్పుడప్పుడు బుద్ధి కాస్త పెడదారి పడ్తూంటుంది. అంతే!

గురవా: ఓహో! అలా చెప్పు సంగతి!... ముందేమో నీకు పెళ్లి కాలేదన్నాడు. కాని అంతలోనే పెళ్లికూతురు అబెంటన్నాడు. ఇదేం మిసహాయింపు కన్యాదానంరా అనుకున్నాను నేనూ!

రఘు: (శేఖర్ అంటే జాలిపడుతున్నట్టు ఇకిలిస్తాడు.)

గురవా: కాని పాపం...చూడ చక్కగా నేవున్నాడే కుర్రాడు! ఎంత దురదృష్టం!

రఘు: కాదూమరి! ఎత్తునుంచి పడ్డాట్ట-అందుకని!

గురవా: ఆఁ హాఁ!

రఘు: తిరుపతికొండమీద! ఏనుగుమీద నుంచి-ఆచారుగారి అబ్బాయితో పాటు వీడూ అంబారీయెక్కి ఊరేగింపుకి బయలేరాట్ట-చిన్నతనంలో!

గురవా : వీ డెవడ్రా మతిపోయినట్టుంది అని నాకూ అనిపించింది సుమా !

రఘు : చూడంగానే తెలిసిపోతుంది మావయ్యా ఎవళ్లకైనా ! ఐనా వాడిముందు ఆమాట ఎత్తకూడదు !

గురవా : అబ్బే-ఎందు కెత్తుతాం.

[శేఖర్ వస్తాడు]

శేఖర్ : విస్‌టో. లెమనూ ఎక్కడున్నాయో కనిపించలేదురా.

రఘు : అక్కడే అల్మైరాలో మూలగా వున్నాయి.

[అంటూ లోపలికివెళ్తాడు]

శేఖర్ : నే నెవరో పిచ్చోణ్ణని అనుకుని వుంటారు మీరు !

[గురవాచారి ఇకిలిస్తాడు]

అదే- బాబీగాడు పెళ్లికూతురు లేదని చెప్పినప్పుడు !

గురవా : అఁహాఁ - దాందేముంది లే నాయనా.

శేఖర్ : నేను వేళాకోళం ఆడే సను కున్నారా !

గురవా : అబ్బే.

శేఖర్ : బాబీగాడికి కొద్దిగా పిచ్చి.

గురవా : నిజంగా ?

శేఖర్ : పెళ్లికూతురు రాణీకాదు.

గురవా : పోనిద్దూ.

శేఖర్ : పోనీడమేం ?

గురవా : ఆఁ హాఁ - నాకు తెలుసు అంటాను.

శేఖర్ : ఐతే మీకు తెలిసిందా ?

గురవా బాగా తెలిసిపోయింది. అసలు సంగతి తేట తెల్లమైపోయింది.

[యాదాలాపంగా చేతబట్టుకున్న పేపర్ నైఫ్‌తో శేఖర్ అతని కేసి ఓ అడుగు వేస్తాడు.]

శేఖర్ : మీ కెలా తెలిసిందో నాకర్థం కావడం లేదు.

గురవా : ఎలాగో అలా తెలిసిందని నే చెప్తున్నాగా ! (అతని చేతిలోంచి కత్తి తీసి) ఇదుగో - దీనికింత రగడ దేనికి ? (కత్తి దూరంగా వుంచి) కాస్సేపు ప్రశాంతంగా కూర్చో బాబూ.

శేఖర్ : నేను ప్రశాంతంగానే వున్నా.

గురవా : అవుననుకో—అయినా...ఆఁ- అలా కూర్చో. ఇహ కాస్త తిరుపతి కబుర్లు చెప్పు.

శేఖర్ : తిరపతా ? నే నెప్పుడూ అక్కడికి పోందే.

గురవా : ఓ! గుర్తు లేకుండా పోయిందా!

శేఖర్ : అసలు వెళ్లందే గుర్తెల్లా వుంటుంది ?

గురవా : అవునవునే. అదీ నిజమే... (తనలో తా ననుకుంటున్నట్టు) దాని కేమున్నా గుర్తేమో !

శేఖర్ : దానికి దేనికి ?

గురవా : వాటికి బాగా గుర్తుంటారు.

శేఖర్ : వేటికండీ మహాశయా ?

గురవా : ఏనుగులకి ! [రఘు వస్తాడు]

రఘు : మావయ్యా ! కల్లాకపటం లేని అభిప్రాయం కావాలి — (తలక్రిందులుగా నిలబడి) చూడు—

[శేఖర్ గురవాచారివంక చూసి నెమ్మదిగా నొసలు కొట్టుకుంటాడు రఘు మామూలుగా నిలబడి—]

(42-వ పేజీ చూడుడు)




"ఏమండోయ్! వరహాలరాజుగారూ!"

"ఎవరది! ఇలా కొంచెం దగ్గిర్గా వెలుగులోకి రండి"

"నమస్కారమండి నేను గుర్తులేనూ? రాయుణ్ణి! భవదీయుణ్ణి"

"జ్ఞాపకం రాలేదు కొంచెం ప్లాష్‌బాక్‌లో మాట్లాడి మీ వెనకటికథ చెప్పండి" అన్నాడు రాజా పల్లకీల జోడులోంచి గంభీరంగా చూస్తూ

రాయుడు వినయంగా నవ్వాడు "చెప్పడానికి నేను రెడీయే కానండి, వెనకటి కథంతా చెప్తే ఇప్పుడు కథకి చోటు చాలదని భయం పార్థసారథిగారు ఊరుకోరు"

"వారట్టే దగాకోరుగా ఉన్నారే ఎక్కడా దొరకడు బాక్సాఫీస్ ఫిలింరైటర్ కన్న అన్యాయం నేను డబ్బులేక లాట్రీ కొడుతుంటే అప్పుడంతా రాసి, తీరా ప్రొడ్యూసర్ని యేసరికి పబ్లిసిటీ ఇవ్వాలని పరారీ అయిపోయాడు డోంట్ కేర్ నీకథ చెప్పు నువ్వెవరు?"

"నేను రాయుణ్ణిగదండీ మీరూ నేనూ నాలుగైదు కథలనించి కలిసి తిరుగుతున్నాం ఒక్కటీ తాగి, ఒక్క సిగరెట్ కాల్చుకున్నవాళ్ళం"

"హాహా తెలిసింది నువ్వు రాయుడి వన్నమాట ఆ సంగతి చెప్పవేం"

"చెప్పానండి"

"చెబితే చెప్పావుగాని ఇప్పుడేం చెయ్యటం వాటీజ్ మై నెక్స్ట్ స్టెప్"

"ఎస్ పార్థసారథి కనుక్కోరాదండీ?"

"య్యాస్ కాదు కాదు ఛఛ్! వాడెవడు మధ్య నేనేం చెయ్యాలో చెప్పేందుకు నా యిష్టం వచ్చినట్టు చేస్తాను వెంటనే ఎవ్వరతీస్తాను స్టుడియోకి పద" అన్నాడు రాజా పార్థసారిమీద కోపం కొద్దీ

రాయుడు మాటువరసైనా అనలేదు కొంచెం గారవంగా, కొంత జాలిగా నవ్వాడు "సార్ పార్థసారి వద్దన్నా సరే వద్దన్నా సరే, మీరు మాత్రం యిప్పుడు ఎవ్వరూ తియ్యలేరు"

"వటవ్? అయామే లార్జ్ రుపీస్ ఎందుకు తియ్యలేను"

"బట్ యువార్ నాట్ ఏ రాఫిలింకోటా మీదగ్గిర లక్షలక్షల డబ్భైవేల రూపాయలున్నా ఫిలిం తియ్యలేరు ఇప్పుడు రా ఫిలిం దొరకటంలేదు అందికే పోకదా కిందటిసారి నాలాంటివాళ్ళముందర మీరు స్టుడియో ప్లాటింగుకెళ్ళి గల్లంతయిపోయారు అవాళ ఫిలింలేక కాల్షీటు కాన్సిలైంది అప్పట్నించి ఇంకా ఫిలిం తియ్యలేదేం మరి మీరే ఆలోచించండి"

రాజా ఆశ్చర్యపడిలేచాక, "నిజమే నా" అన్నాడు రాయుడి జవాబు వినకుండానే, అంచేతే ననమాట నేను కనబట్టంలేదు అన్నాడు మరిప్పుడెలా అన్నాడు

రాయుడు ఎలా అని ప్రతిధ్వనించాడు

"పోనీ పార్థసారిని అడిగితే, రా ఫిలిం కోటా యిప్పించమని?"

'ఆయన బోండా—ఆయనేం యిప్పిస్తాడు"

రాజా ఆలోచనలో మునిగిపోయి తేలాడు

"వాడి సామర్థ్యం పోయింది? కథలో ఉత్తుత్తి సినిమాకోసమే కదా ఈ కోటా" అన్నాడు తెలివిగా

"ఉత్తుత్తి సినిమాలకోసం కోటాలగిరాకీ కూడా చాలా ఎక్కువగా ఉందండి కొందరు నిజం సినిమాలు తియ్యడానికి ఉత్తుత్తి కోటాలు దొరకుతున్నాయి మనలా ఉత్తుత్తి సినిమాలు తీసేవాళ్ళకేమో"

"వటవ్ నే నెవరనుకుంటున్నావు అయామే లార్జ్ రుపీస్ బిగ్ ప్రొడ్యూసర్ డైరెక్టర్ యాక్టర్ నాకు బోల్డు గ్లామరుంది!'

"మరేండి మీకు సినిమామీద చాలా గ్లామరుంది"

* * *

"ఉరికొకి గోల"

* * *

'ఎవరది!' అన్నారు రాజా రాయుడూ జాయింటుగా ఉలిక్కిపడి ఒకళ్ళనొకళ్ళు చూసుకోటం అయ్యాక చుట్టూరా చూశారు ఎవరూ కనబళ్ళేదు "ఎవరది మన్ని కాకిగోల అంటూ నువ్వా?" అన్నాడు రాజా మెల్లిగా

"కాదు మీరా?"

"కాదు ఎవరో"

"ఎవరూ కనబట్టంలేదండీ కాని"

"పార్థసారిగాడు కాదుగదా"

"కాదు వాడలా అనడులెండి కాని ఎవరో చెప్పనా? ఈ కథ చదువుతున్న వారనుకుంటా"

"నిజమే!'

"ఒట్టూ"

రాజా హఠాత్తుగా గాంభీర్యం పులుముకున్నాడు కాలరు సర్దుకున్నాడు కళ్ళజోడు తీసి తుడిచి మళ్ళీపెట్టుకున్నాడు పోగా పాడిదగ్గరగాడు కీవి నటించాడు ఆ వారే వస్తున్న అదేకారు వాపాడు మాట్లాడకుండా ఎక్కిపోయాడు "పార్క్" అన్నాడు ముక్తసరిగా

'ఎంగో అన్నాడు టక్సీవాడు

'ఇమ్మీడియట్లీ' అన్నాడు రాజా ఠీవిగా



# తావలచిన కన్య



శంగంమీద హాజరవనే అయ్యారు.

'అయినా పెళ్ళికొడుకువు. సిగ్గూ బిడియం అక్కర్లేదురా' అని హాస్యం వొలకబోస్తూ ఆయన వెనకనే సత్యం మామయ్య.

రత్తమ్మకు నోరు జారింది—

'మాశారా! వీడు రాజేశ్వర్ని చేసుకుంటాడుట' అన్నది.

దీక్షితులు ఏదో చెప్పబోయి వూరుకున్నాడు—

సుబ్బరామయ్యగారు బుస్సుమన్నారు.

'ఏమిటేమిటి! రాజేశ్వరినా? ఒరేయ్. నీకేం మతిపోయిందా ఏమిట్రా! అయినా నేనుండగా నీకా గొడవెందుకు? నాకా మాత్రం నీపాటి సెలక్షను తెలుసు' అన్నారు.

'అయితే నన్నొక గంగిరెద్దును చేస్తా రన్నమాట,' కొంచెం వుద్రేకపడ్డాడు దీక్షితులు—'అయినా యీ విషయంలో నిర్ణయం చేయవల్సింది నేను. ఇది 20 శతాబ్దం నాన్నా. పదమూడు పద్నాలుగొద్దు' అన్నాడు.

రత్తమ్మ రంయ్ మంది—

'మాశారా! పాడుకాలం ఎలా మారిందీ!' అన్నది.

'కాదక్కా. కాలేజీగాలి వంటబట్టింది' అన్నాడు మామయ్య.

దీక్షితులు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు; 'వీళ్ళకెలా చెప్పినా అసలు సంగతి' అని.

'రాజమండ్రీ వాళ్ళు నాలుగు వేల పైచిలుకు రాలుస్తారట. అది సెటిల్ చేసుకుంటే బావుంటుంది' తన నిశ్చయం అదే అన్నారు సుబ్బరామయ్యగారు.

'అబ్బే. అదేమిటండీ. ఆ సంబంధం నాకు నచ్చలేదు. ఆ పిల్లతల్లి వర్తి గయ్యాళి గంపట' అంది రత్తమ్మ.

'అయితేనేమిటి? నా ఇంట్లో మనం కూర్చోబెంగదా ఆవిడతో పోట్లాడ్డానికి. డబ్బు ముఖ్యం. పిల్ల ముఖ్యం...ఏం హాయ్ సత్యం' అన్నారు సుబ్బరామయ్యగారు.

'మరేమిటి లేకపోతే...ఎవడిస్తాడే నాలుగు వేలు? నాలుగు వేలంటే మాటలా' అన్నాడు కుశాగ్రబుద్ధిసత్యం—'నీమాటేమిట్రా దీక్షితులూ? లక్షణంగా రాజమండ్రీ పిల్ల రాధాకుమార్ని చేసుకో' అంటూ అక్కగారిపై పునించి దృష్టి దీక్షితులువైపు తిప్పాడు.

దీక్షితులు ఏమీ సమాధానం చెప్పలేదు.

రత్తమ్మ మాత్రం వూరుకోలేదు—

'ఆరు నూరైనా నూరు ఆరైనా ఆ రాజమండ్రీ పిల్ల మనకొద్దండీ; ఆర్యపురం పిల్లని చేసుకుందాం' అన్నది భర్తతో.

'నోర్మూసుకో' అన్నాడు సుబ్బరామయ్య. 'ఆర్యాపురం వాళ్ళ సంగతి నీకేం తెలుసే. ఆ పిల్ల పెత్తల్లిగారి మనవరాలు ఎవడితోనో లేచిపోయిందిట. వారి దగ్గర బంధువుల్లో యింకొక అమ్మాయికి వితంతు వివాహం జరిగింది. ఈ తంతు నీకేం తెలుసూ!'

'మరి ఆ రాజమండ్రీ సంబంధం మాత్రం మంచిదా ఏమిటి! ఆ పిల్ల పెద్ద కాలేజీలో చదివింది. అనేకమంది మగవాళ్ళతో ఆ అమ్మాయికి స్నేహాలుట. మా పిన్నికూతురు చెప్పింది; ఆ సంబంధం వదని. కట్నం తక్కువయినా మరో సంబంధమే మంచిది', రత్తమ్మ నిశ్చయించింది.

'కట్నం తక్కువవడానికి వీలేదు,వీల్లేదు' అన్నారు సుబ్బరామయ్యగారు.

'మధ్యని మీరిద్దరూ ఎందుకయ్యా కొట్లాట. అసలు వాడేమంటాడో [illegible] దది కనుక్కో.' అని బావమరిది సలహా ఇచ్చాడు.

'వాడు నా మాటే వింటాడు' రత్తమ్మ నవ్వింది కొడుకువైపు చూస్తూ.

'లేదు. వాడు నే గీసిన గీటు దాటడు' రీవిగా చూశాడు సుబ్బరామయ్య.

'ఏం నాయనా?' అన్నది తల్లి.

'ఏరా?' అన్నాడు తండ్రి.

దీక్షితులు ఏ సమాధానం చెప్పలేక ఇద్దరివైపు జాలిగా చూశాడు.

'ఏమిటూ మూగనోము?' అన్నాడు మామ.

'నాకిదేం నచ్చలేదు' అన్నాడు దీక్షితులు.

'నీకు నచ్చిందొక్కటేమరి. అయినా తాపట్టిన కుందేటికి మూడేకాళ్ళా? బుద్ధి కాస్త మార్చుకో' అన్నాడు మామయ్య మందలింపుగా.

సుబ్బరామయ్య పైవుత్తరీయంతీసి తలకు చుట్టుకున్నాడు—

'చిత్రా బాబూ! యీ అదను కాలం దాటితే మరి పైసా రావడం కష్టం. ఇంతకూ నీకు నచ్చిందెవరిటి? రాజేశ్వరా?' అంటూ ఓ మెట్టుక్రిందికి దిగాడు.

'అని వేరే చెప్పాలా! అయినా అదెలా నచ్చిందీ అని' అందుకున్నాడు బావమరది సత్యం.

దీక్షితులు ఏమీ చెప్పకుండా నవ్వేశాడు—

'ఆ అమ్మాయికి అందంవుంది. కాని అది మొగుడితో కాపరంచేసే రకంలా నాక్కనిపించలేదు,' అంది రత్తమ్మ.

మామయ్య వెంటనే వత్తాసు పుచ్చుకున్నాడు.

'అసలా అమ్మాయి ముక్కేం బాగులేదక్కా. గద్దముక్కులావుంది' అన్నాడు.

'గెడ్డంకూడా చిన్నది' రిమార్కు చేసింది రత్తమ్మ.


ఒకటి కాదు 17 రకాల సువాసనలు



'నడకూడా ఒంటెనడకలావుంది' మావ అబ్జర్వేషన్.

'గొంతుక బొత్తిగా బొంగురు.' అమ్మ రిసెర్చి.

'అంతేకాదు. కన్యాదాత ఒట్టిమురికి మనిషి. ఇప్పటికప్పుడే ఇరవై సంబంధాలు అందుకే తేలిపోయాయిట.' నాన్న చెప్పిన కబుర్లు.

దీక్షితులు యింక ఫూరుకోలేదు——

'ఔను. అయినా వాళ్లివనడం దేనికి ? ఈ చూసిన యిరవై సంబంధాలవాళ్ళూ అంత కన్నా మురికివాళ్ళయుండాలి. లేకపోతే వీళ్ళ వితరణబుద్ధివిది ? ఏ ఒక్కరైనా అందులో విశాలహృదయులైతే ఆ కట్నం గురించి ఖాతర్చేశేవారుకాదు,' అన్నాడు.

'ఆఁ. మా గొప్పసంస్కారివి బయల్దేరావులే' హేళనగా నవ్వాడు మావ.

'అయినా సంస్కారం రమ్మంటే ఎలా వొస్తుంది ? మకిలి పట్టిన మనసుల్ని కడిగి వేయడం అంత సులువైన పనికాదు ఇంకా మనదేశం యీ విషయంలో అనేకశతాబ్దాలు వెనకబడి వుంది. ఎంతమందో వుపన్యసిస్తున్నారు. పుస్తకాలు అనేకం పేజీలకు పేజీలు వ్రాస్తున్నారు 'సంస్కారం' అంటూ. కాని అసలు సంస్కారం అనేది యింకా మాటల్లోనే దొర్లుతుంది. కాలం మారతోంది. కాలంతో పాటే మనమూ పురోగమించాలి. కాని మన మనసులోని సంస్కారం రబ్బరు తాడులా ముంగుకు సాగినట్టే సాగి యథాస్థానాని కొచ్చేస్తొంది.' అంటూ వుపన్యాసం దంచేస్తూన్న దీక్షితులుకి సుబ్బరామయ్యగారు అడ్డొచ్చారు.

'సరిలే. మాకా చదువంతా ఎందుకుగాని నీ నిశ్చయం ఏవిటో ముందు చెప్పు. రాజేశ్వరినే చేసుకోదల్చుకున్నావా ?' అన్నారు.

'ఆ గొద్దముక్కు పిల్లనే ?' అన్నాడు సత్యం ఆశ్చర్యంగా చూస్తూ.

'అవయ్యారివా ! అవన్నెల విసనకర్రనా !' అన్నది రత్తమ్మ భయావహంగా.

'తొండ ముదిరి వూసరవెల్లి అయినట్టుంది వీడి వాలకం' అన్నాడు సత్యం.

అయినా దానికళ్లు వజ్రాల రాళ్లుగానూ ! వెండి కొండలాంటి మా నాయన మంచుకొండలా కరిగిపోయాడు. అయినా మనసు మార్చుకోరా బాబూ ; చూసి చూసి ఆ బొంగురు గొంతు పిల్లను కంఠానికట్టుకుంటావా ! గట్టిపాడివేసి చూసింది రత్తమ్మ

దీక్షితులు తన నిర్ణయం పూర్తి చేసుకున్నాడు.

సుబ్బరామయ్యగారు ఆశగా చూశారు.

'ఇప్పుడు చెప్పు. రాజేశ్వర్ని చేసుకుంటావా ? రాధాకుమారినా ?' అన్నాడు సత్యం మామయ్య.

'ఇద్దర్నీ కాదు' అన్నాడు దీక్షితులు.

రత్తమ్మ కొండంగుకుంది ; కొండెక్కిన సుబరామయ గభాల్న క్రిందికి పడ్డాడు.

'మా బాబు బంగారు. ఆర్యాపురం పిల్ల ఆదిలక్ష్మి మా కోడలు' అన్నది రత్తమ్మ పొంగిపోతూ.

దీక్షితులు పకపకా నవ్వాడు—

'కాదమ్మా, ఖర్గపూర్ పిల్ల లక్ష్మీకాంతం నీ ముద్దుకోడలు' అన్నాడు. రత్తమ్మ మెత్తగా చితయిపోయింది—

'ఎవరా లక్ష్మీకాంతం ?' అన్నది.

'ఎప్పుడు చూశావ్ ? ఎక్కడ చూశావ్ ?' అన్నాడు సత్యం మావయ్య.

'ఏమతం ? ఏ కులం ? ఏ శాఖ ??' అన్నారు సుబ్బరామయ్యగారు ; దక్షయజ్ఞం వేళ కైలాసం దిగుతూన్న రుద్రమూర్తిలా.

'నేనా అమ్మాయిని ప్రేమించాను,' దీక్షితులు ప్రకటించాడు. సత్యం ముక్కుమీద వేలేసుకున్నాడు.

'దీక్షితులు చెడిపోయాడు. భ్రష్టుడైపోయాడు. ఇదేం వెధవ బుద్ధిరా' అన్నది రత్తమ్మ వొళ్లు తెలియని ఆవేశంలో.

దీక్షితులు కించిత్ కూడా చలించలేదు.

'ఏం ; యిందులో పాపేముంది. ఒకరొకరం అర్థం చేసుకుని స్వర తుల్యమైన దాంపత్యం సాగించాలనుకుంటున్నాం. మనసులు కలియడం తప్పా ? మనసులు ఒకరిచేత ఒకరు ఆకర్షింపబడటం తప్పా ? ఈ రెండూ అయినప్పుడు పెళ్ళి చేసుకోవడం తప్పా ? ఇంతకూ ఏం మతాంతర వివాహం కాదు కులాంతరం కాదు...వాళ్ళనాన్న ఓవర్సీర్ పనిచేస్తున్నాడు. అతనికి బోలెడు పలుకుబడుంది. వాళ్ళింటో అంతా చాలా మంచివాళ్ళు. అన్నిటికన్నా ముఖ్యం అమ్మాయి కల్చర్. చక్కని రూపం. విశేషమైన తెలివితేటలు. మంచి సంస్కారం వుంది సంగీత సాహిత్య విశారద.'

'ఏ వేడి నే నేం. శాఖాంతరమేగా ?'

'అయితే వొచ్చిన తప్పేమిటి ? ఆహార విహారాదులు ఒకటై, సజాతీయులూ, సభాషీయులూ అయితే...'

'నో య్యూసులే.' గర్జించారు సుబ్బరామయ్యగారు— సంతోషించాం నీ వివేకానికి. తులసి మొక్కలో దూలగుండాకు పుడుతుం దనుకోలేదు. ఇంతకూ వేళావిశేషం. తా వలచినదే...' అన్నారు. ★





Stanes

స్టేన్స్ శుద్ధమైన కాఫీ

స్టేన్స్ ఎరుపు లేబిలు కాఫీ మీకు గాలి చొరని డబ్బాలలో తాజాగా లభిస్తుంది. అది 3 పా. 7 పా 14 పా. 20 పా.ల డబ్బాలలో దొరకును.

దీ యునైటెడ్ కాఫీ సప్లయి కంపెనీ లిమిటెడ్,
కోయంబత్తూరు, దక్షిణ ఇండియా

మహబూబునగర్ ఏజెంట్లు : మెసర్సు ముత్యాలు & సన్సు జనరల్ మర్చంట్సు, మహబూబునగర్ : పశ్చిమగోదావరి డిస్ట్రిబ్యూటర్సు, మెసర్సు శ్రీపాద నరసింహం బ్రదర్స్, జనరల్ మర్చంట్సు, పాలకొల్లు, ఏలూరు.

"అబ్బ! ఆడవాళ్ళ కళ్ళు!" — అనుకొన్నాడు, మూడవ తరగతి టిక్కట్టుతో రెండవతరగతి పెట్టెలో దర్జాగా ప్రయాణం చేస్తున్న మోహన్, తన ఎదురుసీటులో వున్న ఒక అమ్మాయిని చూసి. చిరునవ్వుతో ఆమెను మరోసారి పరీక్షగా చూశాడు మోహన్.

ఇరవై సంవత్సరాల వయస్సులో వున్నట్టుంటుంది అనిపించే ఆ అమ్మాయి, చూడటానికి అమరలోకంనుంచి దిగివచ్చిన ఒక అప్సరస! చూసినకొద్దీ చూడాలనిపించే ఆమె అవయవ సౌష్ఠవం! చుట్టి చుట్టి అలిన సిగలో, గుచ్చి గుచ్చి పెట్టిన బొద్దుమల్లె మొగలదండలా, ఆమె అందమైన ముఖంలో కదిలిన ఆ పెదిమల మధ్య అణిముత్యముల వంటి తెల్లటి పళ్ళను తళ తళమని మెరపించిన ఆ నవ్వు! ఆ నవ్వులో తుమ్మెద రెక్కలవలె రెపరెప లాడిన ఆ కనురెప్పల మధ్య, తటాకంలో వికసించిన సరిక్రొత్త తామరపద్మములవంటి విశాల నేత్రాలనుంచి సముద్ర కెరటాలా కొట్టుకు వచ్చిన గిలిగింతలు! "అబ్బ! ఆడవాళ్ల కళ్ళు!"

తన వైపు మోహన్ చూడటం తెలుసుకొన్న ఆమె చటుక్కున సిగ్గుతో తలదించేసుకొంది. ఆ ఒక్క క్షణంలోనే మోహన్ కళ్ళను కలుసుకొన్న ఆమె కళ్ళకు, అతణ్ణి యీ ప్రపంచాన్నే మర్చిపోయేటట్లు చేయగలిగే మహత్తరశక్తి ఎక్కడినుంచి వచ్చిందో?

పరిగత్తే రైలులో ఒక అందమైన అమ్మాయిని ఆ విధంగా చూస్తే......?

ఆ అమ్మాయి ఒంటరిగా ప్రయాణం చెయ్యటంలేదు. ఆమె పక్కనే ఒక ముసలాయన కూర్చున్నాడు. ఆమెతో ఏవో కబుర్లు చెబుతూన్న ఆయనకు మోహన్‌ని మీద కొంచెం కోపం వచ్చింది. కాని వయస్సులోనూ, అనుభవంలోనూ పెద్దవారైన ఆయన తన కోపాన్ని బయటపెట్టలేదు; పైగా మోహన్‌ని మాటల్లోకి దింపారు.

ఆయన చాలా మర్యాదగానే మోహన్‌ని పలకరించారు.

"ఎందాకా వెళ్తున్నారు?"

ఆ ప్రశ్నతో మోహన్ ఈ లోకంలోకి వచ్చిపడ్డాడు! "నేను...నేనా కొత్తపల్లి గూడెంవరకూ వెళ్తున్నాను."

"సొంత ఊరా"?

"కాదండి. కొత్తపల్లి సొంత ఊరు. అది కూడా పేరుకేలెండి!"

"ఓహో! మరి ఇప్పుడు..."

"అక్కడ మా పింతండ్రిగారు ఒకాయన వున్నారు. ఆయన్ని చూద్దామని వెళ్తున్నాను."

"చదువుకొంటున్నారా?"

"చదువుమానేసి చాలా కాలమయిందండి. ప్రస్తుతం ఉద్యోగంలోనే వున్నాను."

"బాగుంది. మీకు పెళ్ళయిందా?"

---

## యన్. శ్రీ కృష్ణారావు

---

"ఈ ముసలాళ్ళందరికీ ఇదొక జబ్బు! వయసులోవున్న అబ్బాయి ఎవడేనా కళ్ళకి కనిపిస్తే చాలు—చటుక్కున అడిగేస్తారు. పెళ్లైయిందా? అంటూ" అనుకొన్నాడు మోహన్ తనలోతాను.

"ఇంకా కాలేదండి" అని బదులు చెప్పాడు.

"ఏం? ఉద్యోగం చేస్తున్నానంటున్నారు. మరి ఇంకా పెళ్ళెందుకు చేసుకోలేదు?"

"చచ్చామురా భగవంతుడా! ఈ ముసలాళ్ళు ఒక్క ప్రశ్నతో వదుల్తారా?" అని అనుకొన్న మోహన్, ఆయన ప్రశ్నకు జవాబు చెప్పలేదు.

ఆయన పరిహాసంగా నవ్వి,

"ఎక్కడ పనిచేస్తున్నారు?" అన్నారు.

"ఢిల్లీ సెక్రటేరియెట్ లో సూపరింటెండెంట్ గా వుంటున్నాను."

"వెరీ గుడ్! ఇంకనేం! ఇంచుమించు నెలనెలా మూడొందలుదాకా సంపాదిస్తున్నారన్న మాట!"

"అన్నీ బాగానే వున్నాయిలెండి. ముప్ఫయ్యో తారీఖు వచ్చేనాటికి మూడు పైసలుకూడా చేతిలో వుండవు!" అంటూ నవ్వాడు మోహన్.

"ఆ! దట్ ఈజ్ నాచురల్! ఇల్లాలనేది ఒకత్తి వచ్చిందంటే, ఇంటినిండా డబ్బే! ఆ సామర్థ్యం అంతా ఆడవాళ్లకి తెలిసినట్లు మగవాళ్లకి తెలియదు!"

మోహన్ ఆయన్ని పరీక్షగా చూశాడు ఆయన ఏ ఉద్దేశ్యంతో మాట్లాడుతున్నాడో అతనికి అర్థంకాలేదు.

"ఏ కాలేజీలో చదువుకొన్నారు?"

"డిగ్రీలేదు! డిప్లొమా లేదు! ఈ రోజుల్లో డిగ్రీలనేవి లెటర్ హెడ్స్‌మీద వ్రాసుకోనేందుకు మాత్రమే పనికొస్తున్నాయి!"

"నిజం! నిజం!"

"స్కూలు ఫైనల్ మాత్రమే ప్యాసయాను పదేళ్లకిందట. అదృష్టవశాత్తూ ఒక గుమాస్తా ఉద్యోగం వచ్చింది; చేరాను. ఆ తర్వాత ప్రమోషన్లు వచ్చాయి."

"చాలా అదృష్టవంతులు. మీకు తల్లీ తండ్రీ, అన్నదమ్ములు, అప్పచెల్లెళ్లూ వున్నారా? ఆస్తి ఏమైనా వుందా?"

ఈయనగారు ఒక పెళ్లిళ్ల పేరయ్య కాబోలు అని అనుకొన్న మోహన్, నవ్వుతూనే జవాబిచ్చాడు.

"నా బంధువులు అని చెప్పుకోవటానికి ఇంకా బ్రతికివున్న ఆయన నా పింతండ్రి ఒక్కడే. ఆస్తిపాస్తులు ఏమీ లేవు."

"ఓహో! ఆయన ఏం చేస్తున్నారు?"

"ఆయనకి కొద్దిగా పొలంవుంది. చిన్న ఇల్లుకూడా సొంతఊళ్లోనే వుంది. తింటం, తిరగటం ఆయనకు పని" అని నవ్వాడు మోహన్.

"ఆయనపేరు?"

"చక్రధరరావు."

తన ఎదురుగావున్న అమ్మాయిని గురించి ఆయన్ని అడగాలనుకొన్నాడు మోహన్. కాని ఆయన అందుకు సందు ఇవ్వకుండా, తనే ఏవేవో ప్రశ్నలు వేస్తూనే వచ్చాడు. ఇంతలోకే చేబ్రోలుస్టేషన్ వచ్చింది. ఆ అమ్మాయి, ఆయనా ఆ స్టేషన్‌లో దిగిపోయారు.

మోహన్ దీర్ఘాలోచనలో పడ్డాడు. తను ఆయనకు చెప్పిన సమాధానాలు జ్ఞాపకం తెచ్చుకొని తనలో తానే నవ్వుకొన్నాడు. ఎదురుగుండా ఒక అందమైన అమ్మాయనేది వున్నట్లయితే, నోట్లోనుంచి అబద్ధా

లకేసి చూటం తట చేవస్తాయి కాబోలు అనుకొన్నాడు! ఈ విషయాన్నే తను ఇంటికి చేరేవరకూ ఆలోచిస్తూ నవ్వుకొంటూనే వెళ్ళాడు. ఇల్లు చేరిన వెంటనే, రైలులో జరిగిన సంఘటనను ఒక హాస్యంగా తన పింతండ్రికి చెప్పాడు. ఆయన అంత కన్నా విరగబడి నవ్వారు.

“వెయ్యి అబద్ధాలు ఆడి అయినా, ఒక పెళ్ళి చెయ్యమన్నారు! ఇదీ ఒకందుకు మంచిదే అనుకో” అన్నారు మోహన్ పింతండ్రి.

* * *

ఏలూరునుండి బయలుదేరిన ఆ ముసలాయన చేబ్రోలు స్టేషన్ వచ్చే లోపుగా మోహన్ ద్వారా తెలుసుకొన్న విషయాలను ఆధారంగా తీసుకొని ఒక రోజున చక్రధరరావుగారిని కలుసుకొన్నారు. వారి కుమార్తె సుశీలను మోహన్‌కు ఇచ్చి చేయటం విషయమై మాట్లాడారు. ఆయన “తథాస్తు” అన్నారు. ఆ తర్వాత నెలలో వివాహం జరిగింది. రైల్లో అకస్మాత్తుగా కనిపించిన అప్సరస తనకు భార్యగా లభించినందుకు మోహన్ పరవశించాడు. సుశీలను తీసుకొని మోహన్ ఢిల్లీ వెళ్ళిపోయాడు. ముచ్చటగా మూణ్ణెల్లపాటు వారి దాంపత్యం సుఖంగా, సంతోషంగా సాగింది.

ఒక రోజున,—మా నాన్నగారి దగ్గర నుంచి ఏదైనా ఉత్తరం వచ్చిందా?” అని అడిగింది సుశీల భర్తను.

ఆ ప్రశ్నతో ఉలిక్కిపడ్డ మోహన్ కోట్ స్టాండ్‌ను తగిలించివున్న తన కోట్ వైపు చూశాడు.

“ఏం? ఏం రాలేదే!” అన్నాడు.

“ఈ మగజాతి జాతి అంతా ఒక్కటే!” అని అనుకొన్న సుశీల “ఈ ఉత్తరం మా నాన్నగారు కాక మరెవరు రాశారు?” అని అడిగింది, తన చేతిలో ఒక కవరును చూపిస్తూ.

మోహన్ కళ్ళు అకస్మాత్తుగా నిప్పులు కక్కాయి! తన భార్య చేతిలో ఒక అసహ్యకరమైన వస్తువు వుండకూడని వస్తువు ఒకటున్నట్లు చూసిన అతను చటుక్కున “ఆ ఉత్తరం ఎందుకు తీశావు?” అని గట్టిగా అరిచాడు.

చాలా సహజంగానే జవాబిచ్చింది



# అర్ధాంగి

సుశీల. "చిల్లర డబ్బులు కావలసి వచ్చాయి జేబులో చూశాను. ఉత్తరం కనిపించింది. తీశాను."

"ఎవర్నడిగి నా జేబులో చెయ్యిపెట్టావు?"

"భర్త జేబులో చెయ్యిపెట్టటానికి భార్య ఎవర్ని అడగాలి?"

"భర్తనే అడగాలి!"

"అవసరంలేదు."

"వాట్!!" అని ఉగ్రుడై పోయాడు.

"ఏనాడయితే నా మెళ్లో మంగళసూత్రమనేదాన్ని కట్టారో ఆ నాటినుంచీ మిమ్మల్ని అడక్కుండానే మీ జేబులో చెయ్యిపెట్టే హక్కుకూడా నాకువచ్చింది పైగా ఆ ఉత్తరం నా పేరుకేవచ్చింది. అందుకనే చింపిచూశాను."

"ఓహో! అయితే నీ దవడ వాయించే హక్కుకూడా నాకుంది," అంటూ ఆమె దవడలను 'ఫళార్' 'ఫళార్' మని మ్రోగించాడు మోహన్.

ఆ దెబ్బలతో బెదిరిపోయింది సుశీల. తన భర్తకు చెయ్యెత్తి కొట్టటంకూడా తెలుసునని ఆనాడే తెలుసుకొంది.

కోట్ స్టాండ్ మీదవున్న తన బట్టలు గబగబా తొడుక్కొని ఖంగారు ఖంగారుగా యింట్లోనుంచి వెళ్ళిపోయాడు మోహన్. భర్త విచిత్రచర్య ఆమెకు అర్థంకాలేదు.

కందిన దవడలను తడుముకొంటూ ఖంగారుగా ఇంట్లోనుంచి వెళ్ళిపోతున్న భర్తను "భోజనం చెయ్యరా?" అని అడిగింది సహజంగానే. ఆమె అడిగిన ప్రశ్న అతను వినిపించుకోనికూడా, జవాబు చెప్పకుండా తనని ఎవరో తరుముకొస్తున్నట్లు ఇంట్లోనుంచి విసురుగా వెళ్ళిపోయాడు.

* * *

ఢిల్లీ మునిసిపల్ ఆఫీసులో తన సీటులో వెళ్ళి కూర్చున్న మోహన్ మనస్సు ఒక స్థితిలో లేదు. పరిపరి విధాల దుఃఖించాడు. అతని కళ్లముందు తన మామగారు వ్రాసిన ఉత్తరం ఒక ఫోటోగ్రాఫ్‌లా ప్రత్యక్షమయింది. రవ్వలు రాలుస్తూ వేగంగామీదకు వచ్చే బాంబులా కనిపించింది ఉత్తరం. భయపడి ఒకక్షణం కళ్లు మూసుకొన్నాడు.

"ఈ మూణ్ణెల్ల నుంచి సుఖంగా సాగుతున్న సంసారాన్ని కూలద్రోయటానికి కాలాంతకుడిలా వచ్చిందే ఆ ఉత్తరం!" అనే ఆలోచన కలిగేసరికి ఆ ఉత్తరం బొమ్మ అతని కళ్లముందునుంచి మాయమయింది.

రాత్రిళ్ళు టైము చూసుకోనేందుకు తలాపు దిక్కునవుండే "రేడియం డయల్" గడియారాన్ని చూసినప్పుడు, గడియారం రూపం కనిపించకపోయినా, గడియారం ముళ్ళు అంకెలు కనిపించినట్లు ఆ ఉత్తరం రూపం మాయమయినా, అందులోని కొన్ని విషయాలు—కొన్ని ముఖ్య విషయాలు—అతనికి ఇంకా కనిపిస్తూనే వున్నాయి ఆ మాటలు—ఒక్కొక్కమాట ఒక్కొక్క శూలం పోటులా అతని మనస్సును పొడిచివేశాయి! అతని కళ్ళవెంట పశ్చాత్తాపంతో నీళ్ళు జలజలమని రాలాయి!

"...ఢిల్లీనుంచి జానకిరామయ్యగారు వచ్చారు. ఆయన నీకు జ్ఞాపకమున్నాడనే అనుకొంటున్నాను ఆయన చెప్పాడు—నా అల్లుడు—మీ ఆయన—మునిసిపల్ ఆఫీసులో బిలు కలెక్టరుకదూ?—సెక్రటేరియేట్‌లో పెద్ద సూపరింటెండెంట్ అనీ, మూడొందలు జీతమనీ చెప్పిన విషయాలన్నీ అబద్ధమేనా?...ఇదంతా నిన్ను అపహరించటానికి......వేసిన దొంగ ఎత్తేనా? ఆడపిల్లల్ని కని, పెంచి, పెద్దచేసి, పెళ్ళిచేసి వాళ్లు సుఖంగా కాపరం చెయ్యాలని ఆశపడేకన్న తల్లి తండ్రులను మోసంచేసే ఇటువంటి దుర్మార్గులను ఊరికే వదలకూడదు......ఆ దొంగ రాస్కెల్‌కు తగిన గుణపాఠం నేర్పుతాను...కోర్టు కెక్కించి ముప్పు తిప్పలూ పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగిస్తాను...వెంటనే బయల్దేరి ఇంటికి వచ్చేయి..."

మోహన్ తనలోతనే కుమిలిపోయాడు. "అరచేతిలోనె అరవిందం వుందన్నట్లు అబద్ధాలాడిన నేను సుశీలముఖం ఎల్లాచూడను? ముంజేతి కంకణానికి అద్దంకూడా కావాలా అన్నట్లు నా దొంగజీవితం అంతా సుశీలకి తెలిసిపోయిందే! నేనొక సామాన్య బిల్ కలెక్టరని తెలుసుకొన్న సుశీల నన్నెంత హీనంగా చూస్తుంది? ఎంత నీచంగా భావిస్తుంది?...ఛ! నేనెంత తెలివితక్కువపని చేశాను! చదివిన వెంటనే ఆ ఉత్తరాన్ని చింపి అవతల పారవెయ్యకుండా, పరధ్యాన్నంగా జేబులో పెట్టుకోవటం ఎంత అవివేకం? సుఖంగా సాగుతున్న సంసారాన్ని కూల్చివేసిందే ఆ దరిద్రపు ఉత్తరం!..."

తన భార్యకు మరెవ్వరూ చెయ్యని ద్రోహాన్ని తాను చేసినట్లుగా దుఃఖించాడు. అందుకు ప్రాయశ్చిత్తంగా ఆమె ముఖం చూడ్డానికికూడా సిగ్గుపడ్డాడు. అవమానం వల్ల కలిగిన విరక్తి కారణంగా ఎక్కడికైనా పారిపోవాలనే అల్పబుద్ధికూడా కలిగింది. ఆత్మహత్య చేసికోవాలనికూడా అనుకొన్నాడు!

తల్చుకోకూడని పిరికిపనులు చెయ్యటానికి ఆలోచించినప్పటికీ, మూణ్ణెల్లముందే ఆ పెద్ద పట్టణానికి కొత్తగావచ్చిన తనభార్య ఒంటరిగా బాధపడుతుందేమోననే జాలికూడా అతనికి కలిగింది. జాలితోపాటు, ఆమెను అనవసరంగా కొట్టాననే పశ్చాత్తాపంకూడా కలిగింది. అదే సమయంలో ఆ రోజు ఒకటవ తారీఖు అని, జీతాలుయిచ్చే రోజుఅనీ జ్ఞాపకంవచ్చింది. జీతాన్ని పుచ్చుకొని ఒక కవరులోపెట్టి ఆమెకు చేర్చినట్లయితే ఆమె తన తండ్రివద్దకు వెళ్లగలుగుతుంది అనుకొన్నాడు.

మధ్యాహ్నం అతని జీతం యాభయి రూపాయలూ పుచ్చుకొన్నాడు. అంతకుముందే ఒక చిన్న ఉత్తరం కూడా రాసివుంచాడు. ఆ ఉత్తరం ఆ డబ్బూ ఒక కవరులో పెట్టి కవరు అంటించాడు. ఇంటి




## పూవు మీ అదృష్టం చెప్పగలదు

నీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, నీ సరియైన దర్యానుగురించిన్నీ నీవు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన నీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, నీవు వ్రాయు తేది, వేళ వివరములున్నూ, నీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసి పంపుము.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, నీవు కార్డు వ్రాసిన తేదిలగాయతు 12 మాసములలోను నీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో నీకు జయము కలుగునో, నీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. ఛార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్నయెడల శాంతిచేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt. DevDutt Shastri, Raj Jyotishi (WP-13) Jullundur City.

పందుదాకా వచ్చాడు. ముందూ వెనుకా దిక్కులు చూసుకొంటూ, వెతికిపోయిన తీగ కాళ్ళకు తగిలినట్లు, పక్కింటివాళ్ళ అమ్మాయి అటునైపే గవటం చూసి అతను కొంచెం సంతోషించాడు.

"పాపా! ఇల్లా రామ్మా! ఈ కవరు తీసికెళ్ళి మీ సుశీల అక్కయ్యకు ఇచ్చేస్తావా?"

"ఓ! అలాగే! ఈ ఉత్తరాన్ని సుశీల అక్కయ్య పోస్టులో వెయ్యమంది. అందుచేత ముందు ఇది పోస్టులో వేసి వెళ్ళేటప్పుడు యిస్తాను," అంది

"సుశీల అక్కయ్య యిచ్చిందా?" అంటూ చటుక్కున ఆ పాప చేతిలోని ఉత్తరాన్ని లాక్కుని ఖంగారుగా కవరు చింపాడు మోహన్. తన మామగారికి సుశీల వ్రాసిన ఉత్తరం అది.

మహారాజశ్రీ నాన్నగారికి—

నమస్కారములు. మీరు వ్రాసిన ఉత్తరం చేరినది. ఉత్తరమా అది? రెండణాల కవరొకటి చౌగ్గా దొరికిందికదా అని, రెండు పేజీలు మీ ఇష్టం వచ్చినట్లు రాసేశారు! ఒక కాలేజీ ప్రిన్సిపాల్ గా సంవత్సరాల తరబడి ఉద్యోగం చేసిన మీరేనా ఆ ఉత్తరం రాశారు? కన్నతండ్రి కూతురికి అటువంటి ఉత్తరం రాస్తారా?

ఎవళ్ళో ఏవో పాలుకు మాటలు అన్నంత మాత్రాన అదంతా నిజమేనని నమ్మేసి మీరు నాకు ఇటువంటి ఉత్తరం వ్రాయటం మీకు అవమానంగా తోచలేదా? జా[illegible]య్యా సంగతి మీకు ఇవాళేనా తెలిసింది? ఆయన నోరు విప్పితే, పచ్చని పచ్చికగడ్డికూడా భగ్గుమని మండిపోతుందనే సంగతి మీరు ఎరగనిదా? అతడి మాటలన్నీ నమ్మేసి రాయకూడని మాటలన్నీ రాసింది నిజంగా మీరేనా?

"వెంటనే బయల్దేరి ఇంటికి వచ్చేయి"! —ఎంత తేలిగ్గా రాశారు నాన్నా ఈ మాట! మీరు అనుకొన్నంత తేలిగ్గా తెగిపోయే బంధమేనా దాంపత్యమనేది? నేను మీ కన్నకూతురినే కావచ్చు నామీద మీకు అపారమైన ప్రేమాభిమానములు వుంటే వుండవచ్చు. కాని మీరు ఒక్క విషయం—అతి ముఖ్యమైన విషయం—మర్చిపోయారు! ఏ క్షణంలో నా మెళ్ళో మంగళసూత్రము నేది కట్టబడిందో ఆ మరుక్షణంనుంచీ నేను మరొకరి సొత్తు! వయస్సులోనూ, విజ్ఞానంలోనూ పెద్దవారైన మీకు ఈ విషయంలో ఎక్కువగా చెప్పనవసరంలేదనే అనుకొంటున్నాను.

అదృష్టవశాత్తూ మీరు వ్రాసిన ఉత్తరం ఆయన చూడలేదు ఆయన ఉద్యోగం ఎటువంటిది అనే విషయం నాకు అనవసరం. ఆయన ఎటువంటి ఉద్యోగం చేస్తున్నప్పటికీ, నాకు సంబంధించినంతవరకూ ఆయన నా భర్త. నేను ఇక్కడ ఆయనతో చాలా సుఖంగా, సంతోషంగా వుంటున్నాను. ఆయన నన్ను ఎంతో ప్రేమగా చూసుకొంటున్నారు నాకు ఏ లోటూ లేదు. మీరుగాని అమ్మగాని నా గురించి ఏమీ బెంగపెట్టుకోనక్కర్లేదు. అమ్మకు నా నమస్కారములు చెప్పండి.

మరొక విషయం! ఇప్పుడే చెప్పివేయదల్చుకొన్నాను. ఏ విషయమై తెలుసుకోవాలని అనుకొంటూ ఆశగా అమ్మ ఎదురుచూస్తూ వుంటుందో ఆ విషయమే చెప్పదలచుకొన్నాను. అమ్మతో చెప్పండి. ఇప్పుడు మూడో నెల!

—మీ కుమార్తె, సుశీల."

ఉత్తరాన్ని చదివిన మోహన్ కళ్ళవెంట కన్నీటిధారలు కారాయి "నిన్ను అర్థం చేసుకోలేక ఎంతబాధ పెట్టాను సుశీలా?" అనుకొంటూ ఇంట్లోకి పరిగెత్తాడు.

సంగతేమిటో తెలియక తెల్లబోయి చూసింది పక్కింటివారి పాప! ★


అధైర్యపడవద్దు

శాస్త్రీయమైన, నిజమైన SEX—ADVICE పొందవచ్చును. మీకు ఉంటుకొన్న లక్షణములు వ్రాయుమా, యింకా వివరాలకు కవరు పంపేది.

డాక్టర్ రత్నంసన్స్, (Estd 1904)
మలక్ పేట బిల్డింగ్స్, హైదరాబాద్ - 2.
(దక్కన్)





"నా లైసెన్సు చూపించమంటావా? వహ్వా! భేషుగ్గావుంది నీధోరణి! క్రితంసారి కోర్టు కెళ్లినప్పుడు, మీ జడ్జీదాన్ని తీసేసుకున్నాడుకదూ!"

# ప్రేమ..పెళ్ళి...

"చారుణికి..........

నమస్తే! నీవు పెట్టిన గడువు దాటిపోయినా ఉత్తరం వ్రాయటానికి నాకే తీరిక లేక పోయింది. ఈ పాటికి నీకు బోలెడంత కోపం వచ్చి ఉంటుంది. అవునా? అయినా నాకు తీరిక లేక వ్రాయక పోతే నీవే యెందుకు వ్రాయకూడదూ"... మాకు యిక్కడ పరీక్షలవల్ల ప్రవేట్లతో పడి తీరుబడి చిక్కలేదు. ఏమయినా యిక సోమవారం అంటే రేపు టపాలో ఉత్తరం వేయాలని యిప్పుడే కూర్చుని ప్రారంభించాను. ఉత్తరమంటే మొదలు పెట్టాను గాని అందులోకి ఆధార మేది?...మళ్ళీ మామూలు క్షమ పణ్లే!...విశేషాలేం కనబడక పోవటం! అయినా వ్రాయాలిగా...ఏవో విశేషాలు అందుకని వ్రాస్తున్నాను.

ఈ మధ్య బందరు వెళ్ళాను. ఆ రోజే నీ దగ్గర్నుంచి కార్డు వచ్చింది. ఆ కార్డును జేబులో పెట్టుకునే వెళ్ళాను. అక్కడ మా చుట్టాలింటికి వెళ్ళాను. ఆ యింట్లో అందరితోను చాల చనువుగా ఉంటాను. మా పిన్ని—వరసకు పిన్ని అవుతుంది... నా జేబులో కార్డు గభుక్కున తీసింది. కాదనే లోగానే చదవసాగింది. Hand writing బట్టిచూస్తే మగవాని వ్రాతలా లేదే అని రిమార్కు చేసింది!...అవునన్నాను... ఆఖర్న చారుణి అన్న సంతకం చూసింది. "ఏలూరునుంచి చారుణి అనే వ్యక్తి నీకెందుకు వ్రాసిందీ ఉత్తరము?" అందినవ్వుతూ!

"స్నేహితురాల్ని కాబట్టి..." అన్నాను తప్పించుకుంటున్నానని తెలియనివ్వకుండా!

"అయితే నీకు ఆడపిల్లలతో స్నేహం యింకా..." అని ఆగిపోయింది.

"ఆ ఉత్తరం ఆడది వ్రాసిందనే యెందుకనుకొన్నావు?..." అని వెంటనే ఎదురు ప్రశ్న వేశాను.

"కాక మగాడే వ్రాశాడని అనుకో మంటావా?..." అంది!

"ఆ!..." అన్నాను.

"మగాడైతే పదో తారీఖుదాక ఫాదరంటారు, ఉత్తరం వ్రాయద్దు అని ఎందుకు వ్రాస్తాడు?...ఉత్తరం కనైనా ధైర్యం లని కొందరు అంటారా?......" నిక్కగా నిలబెట్టి అడిగింది ఆమె! ఆమెకేం తక్కువ తిన్నదా మరి!....

తప్పనిసరయి ఒప్పుకున్నాను.

"నా స్నేహితురాలు వ్రాసింది..." అన్నాను.

"అయితే కార్డుమీద వ్రాసిందేం?... ఆడపిల్లలు కవర్లే కాని కార్డులు వ్రాయరుగా! ..."అంది అర్థోక్తిగా.

"అవును!...అది లోకానికి జడిసి రహస్యాలనుకుని విషయాల్ని మరుగుపర్చాలను చేసేపని!...మా కలాటి రహస్యాలు లేవు... అల్లాంటప్పుడు ఎలా వ్రాస్తేనేం?..సంగతులు తెలిసికోవటమేగా?..." అన్నాను. ఆలోచించి.

"అయితే మరి పదో తారీఖుదాక ఎందుకు వ్రాయద్దని వ్రాసింది? తండ్రికి తెలియకూడదా యీ ఉత్తరాల సంగతి?" అంది.

## శాంతిశ్రీ

"అవును! అదే ఉద్దేశం!...తండ్రికి యిలాంటివి నచ్చవు!...ఆమె తండ్రికే కాదు...లోకంలో ఏతండ్రికీ తన కూతురు యింకొకరికి...అందులోనూ పురుషమిత్రునికి ఉత్తరం వ్రాయటం నచ్చదు." అని అందరి తండ్రులమీద ఓ రిమార్కు విసిరాను.

క్షణంసేపు మౌనంగా గడిచింది. కార్డు తీసికొన్నాను. మడిచి నవ్వుకుంటూ జేబులో పెట్టుకున్నాను. ఈసారి లాగు జేబులో పెట్టుకున్నాను.

"అయితే ఆ అమ్మాయికి పెళ్ళి యింకా?".. అని మళ్ళీ అడిగింది.

"ఏం? అలా అడిగావు?" అన్నాను.

"అహా! ఏం లేదు... తెలుసుకుందుకు?... అంతే!..." అంది!

"లేదు." అన్నాను ముక్తసరిగ.

ఈ సమాధానానికి ఆమె ఆశ్చర్యపడుతుందేమోననుకున్నాను. కాని ఆమె ఏమాత్రము చలించలేదు. బహుశా తాను ఊహించిన సమాధానంకూడ యిదే నేమో!...

"అయితే వాళ్ళెవరు?..." అంది మళ్ళీ.

"అంటే?—" అన్నాను.

"వాళ్ళెవరని?...మనవాళ్ళేనా?..." అంది మళ్ళీ.

"ఆ!...మానవులే!" అన్నాను గొప్పగా అర్థం తీస్తూ!

"అది కాదురా!...మనకులమేనా!..." అంది.

"ఆ!...చాలా!...యింకా కావాలా వివరాలు?" అన్నాను.

"అలా కోప్పడకోయ్ మిస్టర్" అంది.

"అబ్బే! నాకోపం దేనికి పిన్నీ?.." అన్నాను పైకి...లోపల బాధగా ఉన్నా!

"ఎన్నేళ్ళుంటాయి?" అంది మళ్ళీ.

"ఇరవై..." అన్నాను.

ఆమె ఎందుకిలా నిలదీసి ప్రశ్నిస్తోందో అర్థం కాకపోలేదు. ఆమెకు స్వాతంత్ర్యం ఉంది నాకూ చనువూ ఉంది. అందుకే ఆమె అడిగిన ప్రతి ప్రశ్నకు సమాధానం చెప్పాను. నేనేదో ప్రణయకలాపంలో పడ్డానని ఆమె భ్రమించింది.

"అయితే ఆమెను ప్రేమిస్తున్నావా?..." అంది తీవ్రంగా.

"ఆ!..." అన్నాను ధైర్యంగా.

"ఏమన్నావ్?...ఒక్కసారి ఉలిక్కి పడుతూ.

"ఏం ఉలిక్కి పడ్డావేం?.....ప్రేమించడం తప్పా?..." ఎదురుప్రశ్న వేశాను.

"అయితే ఆమెను పెళ్ళి చేసి కొంటావా?..." అని అడిగింది.

బహుశా యిది ఆఖరి ప్రశ్న కావచ్చు! ఈ ప్రశ్నకోసమే యింతవరకూ గ్రంథం నడిపిందనుకున్నాను.

"మాట్లాడవేం?...ఆమెను పెళ్ళిచేసి కొంటావా?" అని మళ్ళీ ప్రశ్నించింది.

"అయితే పిన్నీ! ప్రేమించడం పెళ్ళి చేసికోవడంకోసమేనా?" అన్నాను.

"మరి యింతవరకు పెళ్ళి చేసికోక పోవటానిక్కారణం?" అంది.

"ఎవరూ? ఆమెయా?... నేనా?..." అన్నాను.

"ఇద్దరూను..." అంది తానేదో రహస్యం కనిపెట్టినట్లుగా.

"చాల పెద్ద ప్రశ్న!. అది వ్యక్తిగత విషయాలకు సంబంధించినది. నేను పెళ్ళి చేసుకోకపోవటానికి కారణం నీతో చాలా సార్లు చెప్పాను. ఇకపోతే ఆమె విషయం... నాకు తెలియదు..." అన్నాను.

"అయితే యెప్పుడూ తెలిసికోలేదా?..."

"తెలిసికోవాల్సిన అవసరం కనపడలేదు..." అన్నాను.

"అయినా ఆమెను ప్రేమిస్తున్నావు... అవునా!..." అంది మళ్ళీ ఆఖరిసారిగా.

"ఆ!...యింకా గట్టిగా చెప్పనా?..." అన్నాను.

"మరయితే ఆమెను పెళ్ళిచేసికోవడం నీ కిష్టమేనా?..." అని ప్రశ్నించింది.

"ఆలోచించాలి!..." అన్నాను.

"ఎవరితో?...ఆమెతో నా?..." అంది!

చక్కటి ప్రశ్న!...ఎంతో చాకచక్యంగా ప్రశ్నించింది.

"అవును...ముందు నా అంగటనే నాలో చించుకుని ఆ తర్వాత ఆమెతో ఆలోచించాలి..." అన్నాను.

"ముందు నువ్వాలోచించుకున్నావా?..." అంది.

"ఇంతవరకూ నాకా ఆలోచన కలగలేదు..." అన్నాను.

"పోనీ యిప్పుడడుగుతున్నాను నేను. ఆలోచించి చెప్పగలవా?..." అంది.

"అంత తొందరపడి ఏ నిర్ణయానికీ రాలేను..." అన్నాను.

"ఈ విషయాన్ని మీ ఉత్తరాల్లో ఎప్పుడూ వ్రాసుకోలేదా?..." అంది.

"మాకీ ప్రసక్తి యింతవరకు రాలేదు. అయినా ఆమెకలాంటి ఉద్దేశం ఉందో లేదో..."అన్నాను...

"ఆమెను ఒప్పించే భారం నాది... నీకంగీకారమేనా?..." అంది.

పాపం!...నన్ను ఒక యింటివాణ్ణి చేయాలని ఎంతగానో తాపత్రయపడుతున్న ఎంతో మంది శ్రేయోభిలాషుల్లో ఈమె ఒకరు. అందుకనే ఆమెను వారించలేక పోయాను. కాని నేను యెందుకు పెళ్ళి చేసికోనంటున్నానో నా ఆశయమేమిటో ఏ ఒక్కరికీ సరిగా అర్థం కావటం లేదు.

"అయినా ఆమెది మనశాఖ కాదుగా!.." అన్నాను

"నీకసలు జాతిమత భేదాలే లేవుగా!..." దెప్పిపొడిచింది!.

"అయినా మన పెద్దలకుంటాయిగా." తప్పించుకున్నాను.

"ఆ సంగతి నేను చూస్తాను..." హామీ యిచ్చింది.

"ఒకవేళ ఆమె అంగీకరించక పోతే?" అనుమానంగా అన్నాను.

"నీ కోరిక గా తెలియపర్చు..." అంది.

"నిరాకరిస్తే—" అన్నాను.

ఆమెకేం అర్థం కాలేదు...ఏం మాట్లాడాలో తోచలేదు.

"అలా నిరాకరించేదాన్ని ప్రేమించడ మెందుకు?..." కొంచెం చిరుకోపంగ అంది.

"మన కోరికలను తీర్చేందుకా స్త్రీలను కాని, పురుషుల్ని కాని ప్రేమించడం!" అన్నాను.

"మరయితే యెందుకంటావ్?" అంది!

"పొరపడుతున్నావు పిన్నీ! ... నేనామెను స్నేహితురాలిగా గౌరవిస్తున్నాను."

"నీ విచ్చే గౌరవాన్ని తిరస్కరించి నిన్ను నిరాకరించినా ఆమెను గౌరవిస్తావా?" తీవ్రంగా అడిగింది.

"ఆ!...నిన్ను గౌరవించినట్టుగానే!..." అన్నాను తడుముకోకుండా.

పిన్ని తెల్లబోయింది. నిర్ఘాంత పోయింది. ఏం మాట్లాడాలో తెలియక తబ్బిబ్బైంది.

"నిన్ను అపార్థం చేసికొన్నానురా?..." అంది జాలిగా.

"అది మానవ సహజం...యింకా చెపితే మానినీ సహజం...మరేం పర్వాలేదులే... అయినా యీ రోజు నీమాటలన్నీ నేనొక విషయాన్ని గురించి ఆలోచించాల్సి ఉందని నిశ్చయించుకున్నాను..." అన్నాను.

"నీది మా నిగ్రహ మైన బుద్ధిరా!..." అంటూ కాఫీ అందిచ్చింది!

కాఫీ తాగి అక్కడినుంచి వచ్చేశాను.

—ఇదీ జరిగిన విషయం!...చారుణీ!... ఇప్పుడు నీకు వ్రాస్తున్నాను. జరిగిన విషయాన్ని విశదంగా...శ్రేదగ చదువుకొని నీ అభిప్రాయాన్ని, ఉద్దేశ్యాన్ని తప్పకుండా వ్రాస్తావని ఆశిస్తున్నాను.

వచ్చేవారం నీ సమాధానం కోసం యెదురు చూడనా?" ★


# దేహకాంతిని రక్షించే సబ్బు

## విశేషగుణముగల నురుగుతో కూడిన తాతావారి యు-డి-కోలోన్ సబ్బు






[ఆదిపర్వము — తృతీయాశ్వాసము]

మ. అవిచారం బని పల్క నోడెదము ధర్మాభిజ్ఞ నీయగ్రసం
భవుఁ డత్యున్నతశక్తియుక్తుఁడు మహీభారప్రగల్భుండు భా
ర్గవదౌహిత్రుఁడు పాత్రుఁ డీయదుఁడు లోకఖ్యాతుఁ డుండంగ నీ
భువనేశత్వభరంబుఁ బూన్పఁ దగునే పూరుఞ్ జఘన్యాత్మజున్.

వ. అనిన వారల కయ్యయాతి యి ట్లనియె.

క. యదుఁ డగ్రతనూజుఁడు నా, హృదయసముద్భవుఁడు వాఁడయిన మద్వచనం
బిది యేటిది యని కడు దుర్మదుఁడై చేయక కృతావమానుం డయ్యెన్.

క. తనయుండు దల్లిదండ్రులు, పనిచినపని సేయఁడేని పలు కెడలోఁ జే
కొనఁడేని వాఁడు తనయుం, డనఁబడునే పితృధనమున కర్హుం డగునే.

క. పూరుఁడు గొండుక యయ్యును, భూరిగుణజ్యేష్ఠుఁడును సుపుత్త్రుఁడు నవనీ
భార సహిష్ణుఁడు నాతఁడ, కోరిన కార్యంబుఁ దీర్చి కుశలుం డగుటన్.

వ. నాజరాభారంబుఁ దాల్చిన పుత్త్రుండ రాజ్యంబున కర్హుండును వంశకర్తయు నగు నని శుక్రువచనంబును నిట్టిద యని యయాతి ప్రకృతిజనంబుల నొడంబఱిచి పూరు నఖిల భూభారధురంధరుం జేసి యదుప్రభృతులఁ బ్రత్యంత భూములకు రాజులం జేసి తాను వేదవేదాంగపారగు లయిన బ్రాహ్మణులతోడం దపోవనంబునకుం జని యందుఁ గందమూలఫలాశనుం డై వన్యంబు లయిన ఫలంబుల హవ్యకవ్యంబుల నగ్నిభట్టారకుం బితృదేవతలం దనుపుచు వానప్రస్థవిధానంబు దప్పక శిలోంఛవృత్తినతిథిభుక్తశేషం బుపయోగించుచు నియతాత్ముండై జితక్రోధాదివర్గుండును నయి సహస్రవర్షంబులు దపంబు సలిపి సర్వసంగ విముక్తుండై సర్వద్వంద్వంబులును విడిచి ముప్పదియేండ్లు నిరాహారుం డయి యొక్కయేఁడు వాయుభక్షకుండయి పంచాగ్ని మధ్యంబున నిలిచి యొక్కయేఁడు నీటిలో నేకపాదంబున నిలిచి మహాఘోరతపంబు సేసి దివ్యవిమానంబున దేవలోకంబునకుం జని యందు దేవర్షిగణపూజితుండై బ్రహ్మలోకంబునకుం జని యందు బ్రహ్మర్షిగణపూజితుండై యనేక కల్పంబు లుండి క్రమ్మఱ నింద్రలోకంబునకు వచ్చిన నింద్రుండు వానిం బూజించి యి ట్లనియె.

ఆ. కొడుకుజవ్వనంబుఁ గొని నీవు నిజరాజ్య, భూరిభరము వానిఁ బూన్చునప్పు
డతని కెద్ది గఱపి తని యడిగిన వారి, కయ్యయాతి యిట్టు లనుచుఁ బలికె.

## యయాతిపూరునకు బోధించిన నీతులు

క. ఎఱుక గలవారిచరితలు, గఱచుచు సజ్జనులగోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగినదానిని, మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్.

క. ఇచ్చునది ధనము పాత్రున, కచ్చుగ నొరు వేఁడ కుండునది యభిముఖు లై
వచ్చినయాశార్థుల వృథ, పుచ్చక చేయునది సర్వభూతప్రీతిన్.

క. మనమునకుఁ బ్రియంబును హిత, మును బథ్యముదథ్యమును నమోఘముమధురం
బును బరిమితమును నగుపలు, కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్.

సీ. వదనబాణాసనవ్యక్తముక్తము లైన, పలుకు లన్కడువాఁడి బాణతతులఁ
బరమర్మలక్ష్యముల్ పాయక భేదించు, చుండెడు దుర్జన యోధవరుల

కడ నుండ కున్నది కరుణ యార్జవ మక్రు,జయము సత్యంబును శమము శౌచ
మనునవి యెద నిల్చునది శత్రుషడ్వర్గ జయమందునది శుద్ధ శాంతబుద్ధి

తే. మదముగామంబు గ్రోధంబు మత్సరంబు, లోభమును మోహమును ననులోనిసహజ
వైరివర్గంబు నోడిచిన వాఁడయొడుచు, నశ్రమంబున వెలుపలి యహితతతుల.

వ. అని పూరుం గటిపితి నమ్మహాపురుషుం డౌరులకుఁ గటిపునట్టిసర్వగుణసంపన్నుం డనిన విని యింద్రుండు వెండియు నయ్యయాతి కి ట్లనియె

క. ఏమితపం బొనరించితి, భూమీశ్వర పుణ్యలోక భోగంబులఁ దే
జోమహిమ ననుభవించితి, సామాన్యమె శతసహస్ర సంవత్సరముల్.

వ. అనిన నయ్యింద్రున కయ్యయాతి యి ట్లనియె.

క. సుర దైత్య యక్ష రాక్షస, నర ఖేచర సిద్ధ మునిగణ ప్రవరులలో
సురతపములు నాదగుదు,ష్కర ఘోరతపంబు సరియుఁ గావమరేంద్రా.

## ఇంద్రుండు యయాతిని స్వర్గలోక భ్రష్టునిఁ జేయుట

వ. అని తనతపోభిమానంబున మహర్షులతపంబు లవమానించి పలికిననయ్యయాతి గర్వంబునకు సహింపక యింద్రుం డలిగి నీకు దేవలోకసుఖానుభవంబులందుఁ బుణ్యసమాప్తి యయ్యె నీగర్వంబు నిన్నింత సేసె నింక నధోలోకంబున కరుగు మనిన వాఁడును మనుష్యలోకంబునకుం బోవ నోప నంతరిక్షంబున సద్భువనంబున సత్సంగతినుండునట్లుగా నాకుఁ బ్రసాదింపు మని యింద్రుననుమతంబు వడసి.

తే. అంతరిక్షంబువలన దిగంతరములు, వెలుఁగఁ జనుదెంచు నాతని విమలదీప్తి
సూచి సద్గణములు గడుఁ జోద్య మంది, రురుతరద్యుతి యిది యేమి యొక్కొ యనుచు.

వ. అంత నయ్యయాతి దౌహిత్రు లైన యష్టకుండును బ్రతర్దనుండును వసుమంతుండును నౌశీనరుం డయినశిబియు నను వారలు సద్భువననివాసులు దమయొద్దకుం జనుదెంచినయయాతి నధిక తేజోమయు ననంతపుణ్యమూర్తింగని నిసర్గస్నేహంబుననభ్యాగతపూజల సంతుష్టుం జేసి నీ వెవ్వండ వెందుండి యేమికారణంబున నిందులకు వచ్చి తని యడిగిన వారలకు నయ్యయాతి యిట్లనియె.

క. అనవద్యధర్మచరితం,బున నున్నతుఁ డైననహుషు పుత్త్రుఁడఁ బూరుం
డనుమధ్యమలోకేశ్వరు,జనకుండ యయాతి యనఁగఁ జనియెడువాఁడన్.

క. అమితతపోవిభవంబునఁ, గమలజలోకంబు మొదలు గాఁ గలసురలో
కములందుఁ బుణ్యఫలములఁ, గ్రమమున భోగించి యింద్రుకడ కేఁజనినన్.

క. సురపతి నాతపమున క,చ్చెరువడి నీతపముపేర్మిఁ జెప్పుమ యనినన్.
సురసిద్ధమునీంద్రతప,శ్చరణలు నాతపముతోడ సరిగా వంటిన్.

చ. అమరవిభుండు దాని విని యల్గి మదంబున నుత్తమావమా
నము దగునయ్యె చేయ నని నన్ను నధోభువనప్రపాతనం
భ్రమవివశాత్ముఁ జేసె నది పాడియ యెందును నల్ప మయ్యె ద
ర్పము బహుకాలసంచితతపఃఫలహాని నొనర్ప కుండునే.

వ ఇట్టు కుపితశతమఖవచనప్రపీడితుండ నయి తదాదేశంబున సద్భువనంబునకు వచ్చితి ననిన నాతండుదమకు మాతామహుం డగుటయు నతనిమహత్త్వంబును సార్వలౌకికత్వంబును సర్వజ్ఞానసంపత్తియు నెఱింగి యష్టకాదులు సకలధర్మాధర్మంబులు సుగతిదుర్గతిస్వరూపంబులు జీవులగర్భోత్పత్తి ప్రకారంబులు వర్ణాశ్రమధర్మంబులు నడిగిన వారల కయ్యయాతి యిట్లనియె.

ఆ. సర్వభూతదయకు సత్యవాక్యమునకు, నుత్తమంబు ధర్మ మొం డెఱుంగ
నొరుల నొప్పి కోడ కుపతాప మొనరించు,నదియు కడునధర్మ మనిరి బుధులు.

ఆ. వేదవిహితవిధుల నాదరించుట యూర్ధ్వ,గతికిఁ దెరువువిధులఁ గడచి యొందు
నాఁగఁబడినవాని లోఁగక చేయుట, యధమగతికిమార్గ మనిరిమునులు.

రెండో ఫారంలో ఒకసారు—టీచరు రాలేదు. క్లాసంతా గోలగావుంది. విమల క్లాసుకి మానిటరు. పదకొండేళ్లుంటాయి. ఎటెండెన్సు రిజిష్టరుతీసి బైటపెట్టింది. అలమారులోంచి సిరాబుడ్డి, కలం, తెల్ల కాగితం బుక్కు తీసి బల్లమీద పెట్టింది. స్కేలు చేతో పుచ్చుకుని నిల్చున్నది బల్లదగ్గరే. రేణుక అప్పుడే వచ్చిందిలావుంది. విమల దగ్గరకువచ్చి, బల్ల కానుకుని నిలబడి ఏవో చెప్పడం మొదలుపెట్టింది. పద్నాలుగు సంవత్సరా లుంటాయి ఆపిల్లకి. "అదుగో టీచరు" అన్నారు ఎవరో. చటుక్కున తన సీటుదగ్గరికి పరుగెత్తబోయింది రేణుక. ఆమెచేయితగిలి మూత లేనిసిరాబుడ్డి ప్రక్కకి దొర్లింది. సిరాఒలికి అటెండన్సు రిజిష్టరు పేజీఅంతా తడిసింది. వెనక్కి తిరిగి చూసిందే కాని రేణుక—పరుగెత్తుకుంటూ తన బెంచి దగ్గరకు వెళ్లింది. విమలచూసింది. బుడ్డిఎత్తి రిజిష్టరు తుడవసాగింది.

పిల్లలంతా గప్ చిప్ గా వున్నారు. సిరా ఎల్లాఒలికిందో ఎవరికీ తెలియదు. మిస్ జెస్సీ—టీచరువచ్చింది. అంతా లేచి నమస్కారం చెప్పారు. కానీ అందుకో లేదు టీచరు.

"ఎందుకు పారబోశావు సిరా?" గట్టిగా అడిగింది. విమల ఉలిక్కిపడింది. తన బెంచి దగ్గరికి వెళ్ళబోతుంటే టీచరు ఆపింది. "ఏమిటే అలాచూస్తావు? రిజిష్టరుఅంతా పాడైపో లేదూ? సిగ్గులేదూ మానిటరువై యుండి యిల్లాంటిపని చేయడానికి? పరిశుభ్రత లేనిపిల్ల! చెయ్యిచాపు!"

విమలకళ్లల్లో నీళ్లుతిరిగాయి. రేణుక ఎక్కడో చివరిబెంచీల్లో వుంటుంది. ఇద్దరికీ ఎక్కువస్నేహంకూడా లేదు. వెనక్కి తిరిగిచూసింది విమల. రేణుక తనని కానట్టే ఎక్కడోచూస్తోంది.

"నేను...టీచర్ ..."

"ఏమిటి నసుగుతావు? ఎవరిమీదో త్రోయ్యాలని ఎందుకు చూస్తావు? నేను చూడలేదూ కళ్ళతో? ఛీ! ఏదిచెయ్యి!" స్కేలు చెళ్లున తగిలింది అరచేతికి.

"ఫో—నువ్వింక మానిటరువి కావు." అమ్మో అనైనా గట్టిగాఅనుకో లేదు విమల. గుడ్లలో నీరు క్రుక్కుకుంది. మాట్లాడకుండా వెళ్ళిపోయి తనసీటులో కూర్చుంది.



క్లాసు జరుగుతుండగా రేణుక చూసింది మెల్లిగా తలెత్తి. విమల లెక్కలు చేస్తోంది. పాపం, దెబ్బతిన్న దేలనుకుంది. 'ఏమోయి, నాకు భయంవేసి వూరుకున్నానోయి,' అని విమలతో చెప్పాలనుకుంది. ఇంటర్వెలులో కలిశారు. కానీ అప్రయత్నంగా తల వంచుకుని ప్రక్కకు వెళ్ళిపోయింది ఆమె.

ఆ సాయంకాలం—ఇంటికి వెళ్లేటప్పుడు టీచరు దగ్గరకి వెళ్ళి లెక్కల పుస్తకంలో సంతకం పెట్టించుకు వచ్చింది. ఇంకెవరూ లేరు గదిలో. 'సిరాపారబోసింది విమల కాదు. నేను.' అని చెబుదామనుకుంది. కానీ—ఎవరో వచ్చేశారు యీలోగా.

# వహించని సాక్షి

నకరాణి



"విమలా, విమలా!" అని పిలిచింది రేణు గేటుదగ్గరున్న విమలని. విమల ఆగి వెనక్కి తిరిగిచూసింది. రేణు దగ్గరకి వెళ్ళింది. "మరే...మరి, నీహిస్టరీపుస్తకం యివ్వవూ?" అంతే అనగలిగింది.

* * *

ఆ రాత్రి రేణుకి ఏమీ తోచలేదు, పాపం విమల తనకోసం—'నేను కాదండీ. రేణుక' అనైనా అనలేదు తనకోసం దెబ్బ తిన్నది. పైగా నలుగురిలో చీవాట్లు తిన్నది. తను ఎల్లాగ చెప్పడం ఆ అమ్మాయికి?...

ఆ తరువాత మూడు సంవత్సరాలు గడిచాయి. ఐదో ఫారం వరకు ఒకే స్కూలులో చదివారు రేణు, విమల. ఎప్పుడైనా మాట్లాడుకునేవారు...విమల మామూలుగా నవ్వుతూ చూసేది ఎప్పుడైనా రేణుకి విమల చూసినప్పుడల్లా అదే సంగతి జ్ఞాపకంవచ్చేది. ఇంకెవరికీ తెలీదు క్లాసులో తను పారబోసి నట్లుసిరాని. తెలిసికూడా విమల బైట పెట్టలేదు. పాపం!

రేణుకు పదహారు సంవత్సరాలు వెళ్ళాయి ఐదవఫారం పరీక్షకి కూర్చునేప్పటికి-మిగిలిన బాధలు, మమతలు, తాపత్రయాలతో పాటు-ఇదొక చిన్నబాధ వుండేది. విమల మర్చిపోయిందేమిటి చెప్మా అనుకునేది. కానీ—ఎందుకు మర్చిపోవాలి? తన మూలంగా కాదూ అవమానంకూడా జరిగింది? ఎన్నెన్నిమాట లన్నది టీచరు?

'నన్ను క్షమించు విమలా!' అనేందుకు ధైర్యం చాలడంలేదు—ఇంక ఎన్నైనా మాట్లాడ కలుగుతోంది కానీ—ఈ విషయం వచ్చేసరికి ధైర్యం చాలడంలేదు.

ఇంటరు, బి. ఏ. కూడా బెజవాడలోనే చదివింది రేణుక. విమల ఐదవఫారం కాగానే వేరే వూరు వెళ్ళిపోయింది. మద్రాసు, కోయంబత్తూరుప్రాంతాలవుంటూ వచ్చారు వాళ్ళనాన్న. రేణుక ఎల్. ఎల్. బి. కి హైదరాబాదు వచ్చేసింది. ఎల్. ఎల్. యం. లో చేరింది. తరువాత విమల జాడ తెలియదు ఆమెకి.



రేణుకకి హైదరాబాదు హాస్టల్లో స్నేహితులు లేకపోలేదు. అందంగా, పొడుగ్గా వుండే రేణు అంటే అంతా యిష్టపడేవారు.

రాత్రిళ్ళు పడుకుని, చిన్నతనమంతా మననం చేసుకొనేది ఆమె. తల్లి, తండ్రి. జ్ఞాపకం వచ్చేవారు. ఎన్నాళ్ళు యీ హాస్టల్లో అనుకునేది. చిన్నతనం స్కూలు, ఆ ఆటలు, స్కూలులోని పెద్ద మర్రిచెట్టు, దాని క్రింద ఊడలు – అన్నీజ్ఞాపకం వచ్చేవి. మందార చెట్టుదగ్గర పైపు – దానిక్రింద కాళ్ళుపెట్టుకుని ఎంతకీ తీసేదికాదు తను, పనిమనిషి కేక లేసేది.

ఇవన్నీ స్మృతులే వీటితో పెనవేసుకుని ఒక చిన్నపిల్ల, పూల గౌను తొడుక్కుని, రెండు జడలు వేసుకున్నపిల్ల – ఆ తరువాత ఆ పిల్ల పెద్దదై ఓణీలు వేసుకున్నది, చీరలు కట్టింది. కాని రేణు స్మృతిలో మాత్రం ఆపిల్లే – ఎర్రగా కందిన ఆ పిల్ల చేయి, గుడ్లల్లో నీరు కుక్కుకుని, కిక్కురు మనకుండా కూర్చున్న ఆ విమలే కనుపిస్తుంది. రేణు కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి యిది తల్చుకోగానే. కుక్కపిల్లని కొడితే – మననేమీ చేయదు, కాళ్ళనాకి, కాళ్ళదగ్గరే పడుకుంటుంది. దాని కళ్ళల్లో నీళ్ళు నిలుస్తాయి. అలాగే విమల......

రేణుకి ఎనలేని బాధగా వుండేది మనస్సులో. నిజానికి ఏమంత పెద్దవిషయం అనిసమాధాన పరచుకోవడానికి వీలుకానట్లు కనుపించేది యిది. ఎక్కడుందో విమల? తనని క్షమిస్తుందా? ఇప్పుడేమను కుంటే ఏం లాభం? కలిగించిన బాధని ఉపశమింపచేసే అవకాశం చేజారిపోయింది అనుకునేది రేణు.

* * *

ఒక సాయంకాలం కాలేజి నుంచి వచ్చి పుస్తకాలు బల్లమీద పడేసింది. రేణు మొహం కడుక్కోడానికి తువ్వాలు తీసుకుని వెడుతోంది. అద్దం క్రింద డ్రాయరులో సోపుతీసుకుంటూ అద్దంలో చూసుకుంది. ఎర్రచాదు కొంచెం చెదిరినట్టుంటే ముందుకు వంగి చిటికెన వ్రేలితో సరిచేసుకుంది. తన వెనకాల బల్లమీద వస్తువులు కనిపిస్తున్నాయి. అద్దంలో క్రొత్త సూట్ కేసు కనుపించి వెనక్కి తిరిగింది రేణుక. ఎవరిదాయిది అనుకుంటూ దగ్గరగా వెళ్ళిచూసింది. యస్. విమల M. A. వున్నది. ఆ సూట్ కేసుకి ఒక మూలగా బంగారురంగు అక్షరాలతో విమల! ఎందుకో రేణుగుండెలు వేగంగా కొట్టుకొన్నాయి. ఎవరిదో యీ సూటుకేసు! కొంచెం సేపు పరీక్షగాచూసి చెప్పులు వేసుకుని వరండాలోకి వచ్చింది ఆమె.

"మనరూములోకి యింకో ఎవరైనా వస్తున్నారాయిందిరా!" అనడిగింది మెట్లమీద కూర్చున్న రూమ్ మేటుతో. ఇందిర వెనక్కి తిరగలేదు. "అవును విమలట, మీ వేపు అమ్మాయే. P. H. D. చేయడానికివచ్చింది."

# ★ మౌనంవహించని మనస్సాక్షి ★

రేణుక పరధ్యానంగా వెళ్ళి ముఖం కడుక్కుని వచ్చింది.

"ఎల్లా వుందేమిటి?"

"నీకు మల్లేనే పొడుగ్గా, అందంగా వున్నదిలే...అదుగో వస్తోంది."

లేతాకుపచ్చచీర, ఎర్రని చెప్పులు, చేతిలో ఫైలు, విమలవస్తోంది. రేణుపరీక్షగా చూసింది. ఆమెకి ఆత్రుతగావుంది. విమల? అవును చిన్ననాటి విమలే. ఆ అమ్మాయే రేణు అర్థంలేని గాభరాతో గదిలోకివచ్చింది. అద్దం దగ్గర నిల్చుంది. బంగారుగా కుంకం తీసిపెట్టుకుంది నుదుట. ఎలాగ విమలని ఎదుర్కోవడం? బాల్య స్నేహితురాలిని చూస్తే ఆనందం కలగడంలేదూ? లేదు, భయం వేస్తోంది.


## అమృతసంజీవిని మాత్రలు

గర్భిణులు ప్రసవించువరకు సేవించిన సుఖప్రసవము, ఆరోగ్యసంతానము కలుగును. వేవిళ్లు, నిస్త్రాణ, పాలిపోవుట నివారించి ఉత్సాహము, నరముల పటుత్వము కలుగజేయును. వెలకు రు 3

## ఉదరాంతకి

చంటిబిడ్డల లివర్ స్ప్లీన్ వ్యాధులు సమస్త ఆసాసలు నివారించును. అజీర్ణము, కడుపుబ్బరము, ముక్కుడు విరేచనములు నివారించి, బలము, రక్తవృద్ధి కలిగించును. వెలకు రు 2

## బాలా జీర్ణవటి

3 సం॥లు దాటిన పిల్లలకు తరచు కలుగు అజీర్ణము, కడుపుబ్బరము, నీళ్ళ విరేచనములు తెల్లగా పాలిపోవుట, క్రమముగా కృశించుట హరించి రక్తవృద్ధి, బలము కలిగించును. వెలకు రు 1.

## శతమూలికాది లేహ్యము

ఇది సుఖ మేహ వ్యాధులు, ఎరుపు, తెలుపుమచ్చలు, బగ్గేలుమాన్పి రక్తము వృద్ధిపరచి బలము, నరముల పటుత్వము కలిగించును. స్త్రీలఋతుబాధలు, అమిత నొప్పి నివారించి తప్పక సంతానము కలుగజేయును. లోహ్రజకసింధూరముతో రు. 40 రు 18.

## శ్రీ భుజంగరావ్వైద్యశాల

తాళ్ళరేవు, తూర్పుగోదావరి.


విమల వచ్చేసింది రూములోకి. తనని గుర్తుపడుతుందో లేదో. "ఈ విడేనండీ మా ఫ్రెండు రేణు L.L. M. చదువుతోంది" ఎర్రబడుతోంది రేణుముఖం. కాని వెనక్కి తిరిగింది.

"నమస్కారమండి. ఇందిర యిప్పుడే చెబుతోంది మిమ్మల్ని గురించి," అన్నది విమల కొన్నేపు చూసింది.

"మీరు—నువ్వు రేణుక. అవును. బెజవాడలో ఐదోఫారం వరకు మనం class mates కాదూ?"

రేణుక నవ్వింది. "పొరబడుతున్నారను కుంటాను. నేను ఎప్పుడూ బెజవాడలో చదవలేదు. మాది విజయనగరం," అన్నది.

విమలనమ్మలేకుండానే చూసింది రేణుక వంక.

"ఏమో. మా రేణు - సరిగ్గా యిదే పేరు. బాగా పోలికలు కనుపిస్తున్నాయి. ఏమో లెండి, ఇంతగా పోలికలున్న మనుష్యులు కూడా వుంటారు కాబోలు," అన్నది నవ్వేస్తూ.

"కావచ్చు. చిన్నవాడు కాకపోతే ఏమిటి? ఇప్పుడు మాత్రం స్నేహితులం కాకూడదూ? పదండి టీ తీసుకుందాం" అన్నది రేణు.

విమలతో ఎన్నో ఖబుర్లు చెబుతోందన్న మాటేగానీ రేణుకి అంతర్వాహినిగా ఆలోచన సాగుతూనే వుంది తనెందుకని అబద్ధమాడింది? భయమా విమలనిచూస్తే? విమల తనని నలుగురిలో నిలబెట్టి. తను చేసినదంతా చెప్పి, గోలచేస్తుందనా? ఏమో, ఎంత చిన్నదైతే నేం తను తప్పుచేసిన మాట వాస్తవము. పిరికిగా, మోసకారిగా ప్రవర్తించిన మాట నిజం.

టీ త్రాగుతూ విమలనే పరీక్షగా చూసోంది రేణు. సరిగ్గా తనంత పొడుగే వుంది! చిన్నప్పుడు బాగా పొట్టిగావుండేది తనకంటే, మంచిరంగుకూడా వచ్చింది. టీ కప్పు తీసుకున్న ఆ చేతులు ఎంత కులాబీగా, కాంతివంతంగా వున్నాయి! ఇంత అందంగా వున్నదే విమల అని అనుకుంది.

విమల నవ్వింది. "ఏమిటి అంత పరీక్షగా చూస్తున్నారు; మీ కూడా అనుమానం కలుగుతోందా, మీ చిన్ననాటి క్లాసుమేటు నేమోనని?" అన్నది.

రేణు నవ్వేసింది. "నిజమేనండోయి. మీరు విజయనగరంలో వుంటే అల్లానే అనుకోవలసి వచ్చేది."

టీ త్రాగినతర్వాత రేడియో దగ్గర, ఆ తర్వాత వరండాలో మెట్లమీద, రాత్రి భోజనాలదగర ఎన్నో మాట్లాడుతున్నారు రేణు, విమల. సినిమాలు, కథలు, నాటికలు, పి. హెచ్. డి. కోర్సు—ఏవేవో మాట్లాడు కున్నారు. మధ్య మధ్యలో రేణుకి విమలని చూస్తే అనుమానం కలిగేది-తను అబద్ధమాడు తున్నట్లు కనిపెట్టేస్తుందేమోనని.

* * *

రెండు నెలలు గడిచాయి. ఫిబ్రవరి నెలలో అందరూ హడావిడిగా వున్నారు పరీక్షల చదువులో. రేణూ, విమల జతగానడుస్తుంటే అందరికీ చూడముచ్చటగావుండేది. ఒకేయెత్తు, ఒకేఛాయ, హుందాఅయిన నడక—బాగుండేది వాళ్ళకలయిక.

రేణు పైకి నవ్వుతూ స్నేహంగా మాట్లాడేదే కానీ తనమూలంగా ఒకనాడు తిట్లుతిన్నదీ ఈ అమ్మాయి అనుకునేది. అంతపరాభవం జరిగినా-ఆ తరవాతి మూడు సంవత్సరాల పరిచయంలోనూ ఒక్కనాడైనా అన్నదీ తనతో 'ఏవోయి యిల్లా చేశావు?' అని. ఎంత ఉదారంగా వున్నది ఆ అమ్మాయి ప్రవర్తన. నిజంగా తను ఆ నాటి రేణుక అని తెలిస్తే ఒక్క క్షణం మైత్రి నిలుపుతుందా? ఒక చిన్న చుక్క—చిన్నారిమచ్చ పెరిగి, బ్రహ్మాండమై, ఒక గోళమంతై కనుపిస్తోంది రేణు కళ్ళకి.

"రేణూ, ఓ మాట చెబుతాను గానీ కష్టం కలిగించుకోకుండా వుంటావా" అన్నది ఇందిర ఒకనాడు.

"ఏమిటి?"

"చూశు-విమల రోజూ ప్రొద్దుపోయిన తర్వాత హాస్టలుకి రావడం, ప్రతిసాయంకాలం బైటికి వెళ్ళడం వార్డెనుకి నచ్చడం లేదు. ఎంత రిసెర్చిస్టూడెంటు ఐతేమాత్రం డిసిప్లిను ఉండనక్కర్లేదా, యింతరాత్రి వరకు ఏమిరిసర్చి? అంటోంది ఆవిడ. నీతో చెప్పమన్నది ఆ సంగతి నువ్వు ఫూరికే కష్ట పెట్టుకోకుండా తనకి మెల్లిగా చెప్పు," అన్నది ఇందిర.

విమల ఆలస్యంగా రూముకి చేరుతున్న సంగతికూడా గమనించలేదు తను. ఎందుకో యింత అనుమానం వీళ్ళందరికీ, ఏమిలోకం! అనుకుంది రేణుక....

ఒక రాత్రి పదిన్నర అయింది. దోమతెర వేసుకుని పడుకోబోతూ, 'విమల యింకా రాలేదేం?' అనుకుంది రేణు. వాచితీసి దిండు క్రిందపెట్టి, తల్లో పూలుతీసి వాసన చూచుకుంది. హాస్టల్లో అన్ని గదులో దీపాలు వెలుగుతూనే వున్నాయి. ఈ యిందిరైతే పడుకుంది గానీ, అంతా చదువుకుంటూనే వున్నారు. ఇవాళ్ళ విమలకి చెప్పేయాలి, తను ఆ చిన్ననాటి రేణుకనని, తను ఆమెకి పరాభవం కలిగించినందుకు గాను, ఆమె చేయనిపనికి శిక్షపొందవలసి వచ్చినందుకు గాను ఎన్నిసార్లు పశ్చాత్తాప పడిందో—అంతా చెప్పేసుకోవాలి.

పదీ యాభై అయింది. వరండాలో

దూరంగా అడుగులచప్పుడు, చెప్పుల్ల మోత అయింది తనగది తలుపు ఒక్క ఊగుటున తెరుచుకోవడం, విమల గదిలోకి వచ్చి, షాల్ తీసి మంచంమీద వేయడం జరిగాయి. రేణు లేచి దోమతెర తొలగించుకుని బైటికి వచ్చింది. విమల ముఖమంతా ఎర్రగావుంది. నుదుటిమీద తడివుంది. ముంగురులు వ్రేళ్లతో త్రోసుకుంటూ, ఆయాసపడుతోంది.

"ఏం విమలా, పరుగెత్తుకు వచ్చావా ఆయాసపడుతున్నావు?" అన్నది.

"అవును. ఆ చౌకీదారు చూశాడు నన్ను. 'కౌను హై బీబీ' అంటూ లేచి వచ్చాడు. పరుగెత్తుకుంటూ వచ్చేశాను. వాడు గుర్తుపట్టి వుంటాడంటావా?"

రేణుకి యిది ఏమీ బాగుండలేదు. "ఇంత ఆలస్యమయిందేం? మెయిన్ గేటు మూసేసి లేదూ?" అన్నది.

"లేదు. పదకొండు కాలేదుగా—మంచి స్పీడులో కారు లోపలికి వచ్చేసింది. కారు చప్పుడుకి కూడా కదలేగు చౌకీదారు. నేను తలుపుతీసుకుని వాడిగదిలోంచే యివతలికి వచ్చాను. హఠాత్తుగా లేచి చూశాడనుకుంటాను. నేను ఆ చెట్టుదాటి కారిడార్ లోకి వచ్చేసరికి 'కౌన్ హై బీబీ' అంటూ లాంతరు ఎత్తిచూశాడు నన్ను వెధవ! షాల్ నిండుగా కప్పుకున్నాను గాదూ, గురుపటడు లే నన్ను." స్క్రీన్ లోపలికివెళ్ళి బట్టలు మార్చుకోసాగింది విమల.

రేణుకి యిదంతా ఏమీ నచ్చడంలేదు. అర్ధరాత్రివరకు—కారులో ఎక్కడికి వెళ్లింది యీ విమల? కుర్చీలా కుక్కని కూర్చుంద రేణు. ఇందిర చెప్పలేదూ నిన్న తనతో. ఛీ! ఎంత అప్రతిష్ట

"అదికాదు రేణూ, మాధవ్ కారు చెక్ చేసుకుంటున్నాడు. వీడు మూసి అటకాయించలేదుకదా అని నా బాధ."

మాధవ్! "ఎవరతను?" అన్నది రేణు ముఖం చిట్లిస్తూ.

విమల అందంగా నవ్వింది. "ఎవరో! నా మాధవుడు, ఎందుకునీకు?" విలాసంగా వెళ్ళి మంచంమీద వ్రాలింది. రేణు కణతలు కొట్టుకుంటున్నాయి. ఎంత శాంతంగా, ఆనందంగా వున్నది యీ విమల. ఆమెకి తెలియవు యింకా యీ హాసలు విషయాలు.

"విమలా! నిజంగా చౌకీదారు చూసినట్లైతే మాత్రం నీకు యీ హాస్టలునుంచి నిష్క్రమణ తప్పదు రేపేపాటికి."

విమల చటుక్కున లేచివచ్చింది. ఆమె ముఖంలో విషాదం అలముకుంటున్నది. "నిజమేనా రేణూ! ఏం? చెబుతాడంటావా వార్డెన్ తో?" భయవిహ్వలమై ఆమె కళ్ళు యింకా పెద్దవిగా కనిపిస్తున్నాయి—ఇంకా

(47-వ పేజీ చూడండి)




## వాని తల్లి 'సాన్ఫొరైజ్డ్' లేబిలు చూచి బట్టను కొని ఉంటే బాగుండేది!

చాలనట్లుగా క్రుంగిపోయే దుస్తులను ధరించి మంచి అవకాశములను జారవిడుచుకోకండి! మీరు నూలు బట్టలు లేక కుట్టి తయారుగా ఉన్న దుస్తులను కొనునపుడు వాటిమీద 'సాన్ఫొరైజ్డ్' ('Sanforized') లేబిలును చూడాలని జ్ఞాపకముంచుకోండి. 'సాన్ఫొరైజ్డ్' లేబిలుగల బట్టలతో కుట్టిన దుస్తులు చాల సార్లు ఉతికినా కూడ చాలనట్లుగా ఎన్నటికీ క్రుంగవని మీరు నమ్మవచ్చును!

లేబిలు మీద **'సాన్ఫొరైజ్డ్'** గుర్తు ఉన్నదా అని గమనించండి

అలాచేస్తే మీ దుస్తులు చాలనట్లుగా ఎన్నటికీ క్రుంగవు!

రిజిస్టరు చేయబడిన 'సాన్ఫొరైజ్డ్' అనే ట్రేడు మార్కునకు అధికారులైన క్లూయట్, పీబాడి అండ్ కంపెనీ ఇన్కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో సంస్థాపితము) వారిచే ప్రచురింపబడినది. ఈ కంపెనీ యొక్క కచ్చితమైన ప్రమాణములకు తగినట్లుగా క్రుంగకుండా ఉండే బట్టలమీదనే 'సాన్ఫొరైజ్డ్' ట్రేడ్ మార్కు వేయుటకు అంగీకారము యిస్తాము.

వివరములకు : 'సాన్ఫొరైజ్డ్' సర్వీస్, 95 మెరీన్ డ్రైవ్, బొంబాయి 2

# నక్షత్ర ఫలితాలు

[13-8-58 మొదలు 19-8-58 వరకు]

గ్రహ స్థితి

| | | | |
|---|---|---|---|
| | శని | | |
| | 16 తేదిని రవి సింహములో ప్రవేశించును. పడమర బుధాస్తమయము. మిథున, కర్కాటక, సింహ, కన్య, తులలో చంద్రుడు. | | శు<br>ర |
| | | | బు |
| | కే | గురా | |

## * అశ్విని [చూ, చే, చో, లా] *

ఈ వారము మీకు యోగకాలము. వున్న యిబ్బందులు తీరుతవి. అనుకున్న సొమ్ము చేతికివస్తుంది. కోరు వ్యవహారములు కొన్ని అనుకూలముగా తీర్పు అవుతవి పిల్లల అభివృద్ధికొరకు కొన్ని ఏర్పాట్లు చేస్తారు నూతన కార్యములు ప్రారంభిస్తారు ప్రభుత్వ సన్మానం కలుగుతుంది. పండితులతో గోష్ఠి జరిపి నూతన అంశాలు తెలుసుకుంటారు. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు, న్యాయస్థానములందలి వుద్యోగులకు, యీ వారం మేలుగావుంటుంది. వారమంతా శుభయోగములతో కూడియున్ననూ అలజడి ఎక్కువగా వుంటుంది.

## * భరణి [లీ, లూ, లే, లో] *

యీ వారం యోగదాయకం. ధనయోగం కలుగుతుంది. కవితాగోష్ఠి, గానసభలువంటి వినోదములలో బంధుమిత్రులతో కలసి పాల్గొంటారు. ఇదివరకు అనారోగ్యముతో వున్న దూరస్థులైన ఆప్తుల క్షేమం తెలిసి సంతోషం పొందుతారు. విద్యార్థులకు మంచికాలము. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. ప్రత్తి, నూలు, బట్టలు, వెండినగలు, బియ్యం వ్యాపారస్తులకు లాభయోగము. నీటిపై ప్రయాణం చేయవలసివుంటుంది. వారమంతా శుభయోగములున్నా మానసిక ఆందోళన ఎక్కువగా వుంటుంది.

## * కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] *

గతవారం అసంపూర్తిగావున్న కార్యములు ఈ వారం లాభదాయకముగా ముగుస్తాయి. ధనఆదాయము అనుకున్న దానికన్న ఎక్కువగావృద్ధిఅవుతుంది. శుభకార్యాలోచనలు చేస్తారు. సంఘ సంక్షేమ కార్యాలలో పాల్గొని కీర్తి పొందుతారు. నూతన కార్యాచరణకు ఆలోచనలు చేస్తారు. విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. వుద్యోగస్తులకు అధికార హోదాలు పెరుగుతవి. బంగారము, నవరత్నములవంటి విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు ఎక్కువ లాభం వస్తుంది. మీకు వాహనయోగం, మీ భార్యకు

## బి. నరసింగరావు

అలంకార ప్రాప్తి కలుగుతవి. వారమంతా సుభయోగము లున్ననూ అధిక ఖర్చులగుట చేతను మానసికఆందోళన వుంటుంది.

## * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

యీ వారం చేదామనుకున్న పనులకు ఆటంకములు కలుగుతాయి. కార్యభారము వల్ల తీరుబడివుండదు. ఆర్థకస్థితి బాగుండనందున గృహావసరములకు యిబ్బంది కలుగుతుంది. అకాలభోజనమువల్ల తలపోటు, కళ్లుమంట, ఒళుపీకువంటి అనారోగ్య చిహ్నములు కనబడగానే ఔషధసేవ చేయుట మేలు. వుద్యోగస్తులకు ఒత్తిడివున్నా అధికారుల ఆదరణ పొందుతారు. వర్తకులకు శ్రమ ఎక్కువ. విద్యార్థులకు చదువు సముగా జరగదు, రాజకీయవాదులకు మేలుగా వుంటుంది. వారమంతా యిబ్బంది కలతలు అనారోగ్యంవున్ననూ, పితృవర్గమునుండి సహాయంవల్ల ధనయోగము కార్యలాభము కూడా వుంటాయి.

## * మృగశిర [వే, వో, కా, కీ] *

యీ వారం మీకు మిశ్రమ యోగం. మొదట్లో నిరాశగా వుంటుంది గాని క్రమేణ మిత్రులసహాయంవల్ల కార్యలాభం పొందుతారు. ధనలోపంవల్ల ఆందోళన వుద్యోగస్తులకు మంచిరోజులు కావు. వనపర్వత ప్రాంతములకు బదిలీ కావచ్చు. వర్తకులకు మాంద్యము. విద్యార్థులకు బద్ధకముచే చదువు సాగదు. రహస్య శోధనలో నిపుణులగుటచే ప్రభుత్వమువల్ల ఆ పనిలో నియమితులౌతారు. ఆప్తుల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. ధనలోపం కలతలు, మనోవ్యథ నిరాశ, వంటి అవయోగములున్నా ప్రయాణము మిత్ర సహాయము, కార్యసిద్ధి విదేశీయులతో పరిచయము, విచిత్రవస్తు సంపాదన వంటి మంచి యోగములుకూడ వుంటాయి. వారంతా అలజడి ఎక్కువగా వుంటుంది.

## * ఆరుద్ర [కూ, ఖ, ఙ, ఛ] *

ఈ వారము మీరు ఎవరి సహాయము కోరి ప్రయత్నములను చేదామనుకున్నారో ఆ వ్యక్తివల్లనే మీకు ఆటంకములు కలుగుతవి. ధనాభావము ఎక్కువగా వుంటుంది. ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలుగచేస్తుంది. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వ్యాపారస్తులకు నిరాశ. ఆధ్యాత్మిక చింతకలవారగుటవల్ల ఈశ్వర కృపచే అన్ని కష్టములను గడిచి క్రమేణా కార్యలాభమును పొందుతారు. విద్యార్థులకు మంచి కాలము కాదు. పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, విచిత్రములను చూచుటయగును వారమంతా ఆరోగ్య చింత, ఆటంకములు, ఒత్తిడిలాంటి అవయోగములున్నను, ఆధ్యాత్మిక చింత, నష్టద్రవ్యలాభము, కార్యసిద్ధివంటి మంచియోగములుకూడా కలుగుతవి.

## * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ఎక్కువ శ్రమపడినమీదట యత్నకార్యాలు ఫలిస్తాయి. కోర్టు దావాలు అనుకూలిస్తవి. పరోపకారమునకు యత్నపడి, పనుల ఒత్తిడివల్ల చేయలేక నిందలు పొందుతారు. ఇచ్చిపుచ్చుకొనుటలో వివాదములు వస్తవి. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణవున్నా తోటివారి సహకారముచే సద్దుబాటుగా వుంటుంది. వర్తకులకు వారమంతా నిరాశగావున్నా వారాంతమునకు మేలుగావుంటుంది. భార్య అనారోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారమంతా భయాందోళనలతో కూడివుంటుంది.

## * పుష్యమి [హూ, హే, హో, డా] *

మీ ఆలోచనలు కార్యరూపమునకు వచ్చేందుకు ఎన్ని అవాంతరాలుకలిగినా, నిరుత్సాహపడక పట్టుదలతో ప్రయత్నించి తుదకు కార్యసాఫల్యమును పొందుతారు. ఖర్చులకు అవసరపడినసొమ్ము సమయానికి అందనందున ఋణము చేయవలసివస్తుంది, కాని వారాంతమునకు తీరుస్తారు. అవయవములకు దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్త

వల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహపుసామాను, రంగుల వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభము. ఇంజనీరింగు శాఖ ఉద్యోగులకు, యంత్రములు నడుపు నిపుణులకు మేలు కాలము. మంచియోగములున్నా వారమంతా ఆందోళనాయుతముగా వుంటుంది.

## *ఆశ్రేష [డి, డూ, డే, డో] *

ఈ వారము మీకు యోగకాలము. మీ బుద్ధిబలమునకు తోడు అధికారుల సహాయము, బంధు సహాయము కలుగుటచేత వచ్చే ఆటంకములు గడిచి, ఫలము పొందుతారు. ధనాదాయము వృద్ధి అవుతుంది. వైద్య, జ్యోతిష శాస్త్ర ప్రసంగాలలో పాల్గొంటారు. కవులు నూతన రచనలు చేస్తారు. ఈశాన్యదిక్కునుండి మీదగర బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషము పొందుతారు. విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. వారమంతా ధనలాభము, బంధుసహాయము, యత్నకార్య లాభమువంటి యోగములున్ననూ భయాందోళనలతో కూడుకొని వుంటుంది.

## * మఖ [మా, మీ, మూ, మే] *

ఈ వారము మీకు భాగ్యయోగము ఎక్కువ. ఉన్న ఇబ్బందులు తీరుతవి. అనుకున్న డబ్బు చేతికి వస్తుంది. దావాలలో గెలుపొందుతారు. పుత్రసంతానము సుఖ సంతోషములకై చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. పండితులతో శాస్త్రప్రసంగములు చేయుటచేతనూ, ఉద్గ్రంథములు పఠించుట చేతనూ విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. ప్రభుత్వముచే సన్మానింపబడుతారు. విద్యార్థులు నూతనవిషయాలు శ్రద్ధతో తెలుసుకుంటారు. న్యాయస్థాన ఉద్యోగస్థులకు, పండితులకు, ఉపాధ్యాయులకు న్యాయవాదులకు మేలుకాలము. వారమంతా మంచి యోగములున్ననూ తొట్రుపాటుగా వుంటుంది.

## * పూర్వఫల్గుణి (పుబ్బ) *

## మో, టా, టీ, టూ

ఈ వారము మీకు యోగదాయకము. ధనయోగము కలుగుతుంది. నీటిపై ప్రయాణము చేయవలసివస్తుంది. కవితాగోష్ఠి, సంగీతసభలు వంటి వినోదాలలో పాల్గొని మృష్టాన్న భోజనము చేస్తారు. ఇదివరకు అనారోగ్యముతో దక్షిణ దిక్కునవున్న ఆప్తబంధువులు కోలుకున్నట్టు వార్త తెలిసి సంతోషము పొందుతారు శుభకార్యములలో పాల్గొంటారు. కవులకు గాయకులకు, నటీనటులకు మేలుకాలము. నూలు, బట్టలు, బియ్యము, వెండి వ్యాపారస్తులకు లాభము. వారమంతా మంచియోగములు కలిగిననూ మానసికాందోళన ఎక్కువగా వుంటుంది.

## * ఉత్తరఫల్గుణి (ఉత్తగ) *

## [టే, టో, పా, పీ]

గతవారమువలె ఈ వారముకూడా మీకు యోగకరంగా వుంటుంది. పూర్తికాకుండా నిలిచిపోయిన కార్యములు లాభకరముగా ముగుస్తాయి. ధనాదాయము ద్విగుణముగా వుంటుంది. పుణ్య. శుభ కార్యములలో పాల్గొంటారు. సాంఘికసేవచేసి కీర్తిపొందుతారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నము చేస్తారు. విద్యార్థులు వినోదములలో పాల్గొన్ననూ చదువు చక్కగా సాగుతుంది. విలువగల వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు ఎక్కువ లాభముకలుగుతుంది. ఉద్యోగస్థుల అధికారహోదాలు పెరుగుతవి. శుభయోగముతో వారమంతా కూడియున్నను మనోచాంచల్యము, ఆందోళన కలుగుతవి.

## * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీకు రాబడి తక్కువ. కార్యభారము ఎక్కువ. గృహావసరములు తీరనందున స్పర్థలు. ఆరోగ్యము చెడుచున్నట్లు సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందడమే కాకుండా గ్రహారాజైన రవికి శాంతిచేయించుట మేలు. ఉద్యోగస్తులకు క్రొత్తసమస్యలు వర్తకులకు ఆందోళన, విద్యార్థులకు చదువు సరిగాజరగదు. రాజకీయ వాదులకు ఎగురీత. పితృవర్గమునుండి ధనసహాయము, కార్యలాభమువున్నా వారమంతా భయాందోళనలతో కూడివుంటుంది.

## *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదట్లో నిరాశగా వుంటుంది కాని క్రమేణా మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. సకాలములో అనుకున్న సొమ్ము చేతికందదు. ఇంట్లో వున్నవారి అనారోగ్యము మీకు చాలా అశాంతి కలుగజేస్తుంది. ఉద్యోగస్తులకు వనపర్వతప్రాంతములకు బదిలీ అయ్యే సూచనలున్నవి. వర్తకులకు నిరాశగా వున్నా వారాంతమునకు లాభము కలుగుతుంది. విదేశీయులతో ప్రయాణమందు పరిచయము. అపురూపవస్తు సంపాదన కలుగుతవి. వారమంతా ఉద్రేకముతో కూడివుంటుంది.

## * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము మీకూ మిశ్రయోగము. కోరిన సహాయము లభించదు. అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. దైవముపై భారమువేసి కార్యసాధనకు ప్రయత్నించి ఫలమును పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ కలుగుటచే శెలవుపెట్ట వలసివస్తుంది. వర్తకులకు చాంచల్యము. కొంతకాలమునుండి రాకుండా నిలచిపోయిన పాతబాకీలు వసూలవుతాయి పుణ్యక్షేత్రగమనము, దేవతాదర్శనము, విచిత్ర వస్తుసందర్శనము కలుగుతవి. పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది. నవద్రవ్యలాభమును పొందుతారు. వారమంతా అశాంతిగా వుంటుంది.

## ధరలు:

నూలు, వస్త్రములు : మందముగా వుండును.

నూనె దినుసులు: నిలబాటుగా వుండును.

బెల్లము, పచందార, చింతపండు : మార్పు లేదు.

ఆహారధాన్యములు: కొంచముతగును.

పప్పుదినుసులు : నిలబాటుగా వుండును.

వెండి, బంగారము: ధరమందమగును.

సస్యానుకూలముగా వర్షించును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమున్నూ, హృషీకుడను పేరునకు స్వాతియూ, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకోనునది.

## * విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత యెక్కువ. ఇచ్చిపుచ్చుకొనేపట్ల పేచీలు వచ్చి మనోవ్యధ కలుగుతుంది. కోర్టు వ్యవహారములు అనుకూలించిననూ ఖర్చులు హెచ్చుగుటచే ఆ సంతోషము వుండదు. భార్యకు ఆరోగ్యము చెడే సూచనలున్నవి. కొర్రలు, రాగులవంటి అపరదినుసులు, మినుములు, ఉప్పు, నువ్వులు, నూనెవర్తకులకు లాభయోగము. ఇతర జాతివారివల్ల గౌరవము కలుగుతుంది. వారమంతా చాలా భయాందోళనతో కూడివుంటుంది.

## *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము ఎంత ప్రయత్నించినా చేయదలుచుకున్న పనులకు అనేక ఆటంకములు కలుగుతవి, సాహసముగలవారగుటచేతను నిరుత్సాహపడక పట్టుదలతో పనిచేసి కలిగిన చిక్కులను తొలగించుకొని కార్యలాభమును

#  నక్షత్రఫలితాలు 

పొందుతారు. సోదరుని సహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. జాగ్రత్తగా వుండుటవల్ల అవయవములకు దెబ్బలుతగిలే ప్రమాదము తప్పవచ్చును. గనుల యజమానులకు, ఖనిజములు, లోహముల వ్యాపారస్తులకు, భూస్వాములకు కష్టముతో కూడిన లాభము. పోలీసుశాఖవారికి మేలుకాలము.

## *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము మీకు ధనలాభము, వ్యవహారములలో జయము, బంధుదర్శనము, విద్యాప్రాప్తి, శుభకార్యములలో పాల్గొనుట, నూతన కార్యప్రయత్నలాభము, ఈశాన్యదిక్కునుండి మంచి వుత్తరములు వచ్చుట, జ్ఞానమార్గ ప్రసంగము, యుక్తిగా ప్రసంగించుట, గణిత, జ్యోతిషశాస్త్ర చర్చలు, సుఖభోజనమువంటి మంచి యోగాలు కలుగుతాయి ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి కంచు మొదలగు సరుకుల వ్యాపారస్తులకు లాభయోగము. కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము. మంచి యోగము లున్ననూ వారమంతా అలజడిగా వుంటుంది

## * మూల [యే, యో, బా, బీ] *

ఈ వారము దేవబ్రాహ్మణభక్తి, పుణ్యక్షేత్ర సంచారము, ధనలాభము, పుణ్యకార్యములు చేయుట, పుత్రప్రాప్తి సూచనలు గృహమందు శుభకార్యములు జరుగుట, బిరుదులు పొందుట, ఆకస్మిక ప్రభుత్వ సన్మానము, సుఖజీవనము, వైద్య, జ్యోతిష శాస్త్ర ప్రసంగములు, ఘనకార్య ప్రయత్నములు వంటి రాజయోగములు కలుగుతవి. విద్యార్థులు నూతనాంశాలను నేర్చుకుంటారు. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకూ వారమంతా మేలుగా వున్నా, ఆందోళన ఎక్కువగా వుంటుంది.

## *పూర్వాషాఢ [బూ, ధ, భా, డా]*

మీరు ఈవారము వినోదములలో పాల్గొనుట, దధి క్షీర మధురపదార్థ యుక్త సుభోజనము వెండి పాత్రలలో చేయుట, తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము, తెల్లని వస్తువులు కొనుటవంటి యోగములు కలుగుతవి. ప్రత్తి, దూది, నూలు, తెల్లనివస్త్రములు, వెండి, బియ్యము, ద్రవ పదార్థవస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము విద్యార్థులకు మంచి కాలము. కవులకు, గాయకులకు, నటీ నటులకు మేలుకాలము. మంచి యోగములున్నా వారమంతా మానసికాందోళనతో కూడి వుంటుంది.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము ధనధాన్యవృద్ధి, పశుసంపద, కృషిమూలకముగా లాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తులాభము, పరోపకారమువల్ల కీర్తి, ప్రభుత్వ కార్య నిర్వహణవల్ల గౌరవమువంటి రాజయోగములు గలుగుతవి. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా చదువు బాగా సాగుతుంది. వర్తకులకు ఖరీదైన వస్తువుల క్రయ విక్రయములలో ద్విగుణలాభము కలుగుతుంది కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము. వారమంతా మంచి యోగము లున్ననూ అలజడిగా వుంటుంది.

## *శ్రవణము [జూ, జే, జో, ఖా]*

ఈ వారము కార్యభారము ఎక్కువ. రాజవార్త ప్రసంగములు, వింతమాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ధనలాభము, ప్రయాణము వుండును. అకాల భోజనమువల్ల వేడిచేసి కడుపునొప్పి, కళ్ళమంట, తలపోటు, బలహీనతవంటి సూచనలు కనబడగానే ఔషధచికిత్స పొందుట మేలు. ఉద్యోగస్తులకు బదిలీ అవుటగాని, ఒత్తిడికి తట్టుకొనలేక శెలవుపెట్టుటగాని జరుగును విద్యార్థులకు చదువు సరిగా జరగదు. రాజకీయవాదులకు అనుకూలము, వారమంతా ఆందోళనతో వుంటుంది.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈవారము ప్రతిపనికి అనవసరముగా ఆలస్యము కలుగుతుంది. ఆశాభంగము ఎక్కువ. ప్రయాణము చేయవలసి వస్తుంది వర్తకులకు లాభము తక్కువ. రహస్యభేదనకు నియమింపబడి జయము పొందుతారు. ఉద్యోగస్తులకు శిక్షకొరకు వనపర్వత ప్రాంతములకు బదిలీ కావచ్చును, ఆత్మీయుల ఆరోగ్యము చికాకుపరుస్తుంది. వారాంతమున విదేశీయుల సహాయమువల్ల కార్యసిద్ది కలుగుతుంది. విద్యార్థులకు చదువు సవ్యముగా జరగదు. వారమంతా చంచల మనస్సుతో గడుస్తుంది.

## * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈవారము మీరు ఎవరి సహాయమువల్ల కార్యములు చేదామనుకున్నారో వారివల్లనే మీకు ఆటంకములు కలుగుతవి ధనాభావము ఎక్కువగా వుంటుంది. ఆధ్యాత్మిక చింత కలవారగుటవల ఈశ్వర కృపచే అన్నికష్టములు తీరుతాయనే నమ్మకముంది కనుక మీకు క్రమేణా కార్యానుకూలము కలుగుతుంది. ఇంట్లో వారి ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు ఒత్తిడి, వ్యాపారస్తులకు నిరాశ అయినా పాతబాకీలు వసూలవుతాయి. విద్యార్థులకు మంచి రోజులు కావు. సాధుసాంగత్యము, కార్యానుకూలత, సద్రవ్యలాభము వున్ననూ వారమంతా ఆందోళనగా వుంటుంది.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కోర్టు వ్యవహారములు అనుకూలిసవి. ఎక్కువ శ్రమపడిన మీదట యత్నకార్యాలు ఫలిస్తాయి. పరోపకారమునకు యత్నపడి పనుల ఒత్తిడి చేయలేక నిందలు పొందుతారు. ఇచ్చిపుచ్చుకొనే పట్ల వివాదములు. భార్య అనారోగ్య కారణముగా మనోవ్యధ కలుగుతుంది. ఉద్యోగస్తులు అధికారుల ఒత్తిడికి ఆగలేక శెలవు పెడతారు తోటివారి సహకారమువల్ల కొందరికి సర్దుబాటుగా వుంటుంది వర్తకులకు వారమంతా నిరాశగా వున్నా వారాంతమున లాభము కలుగుతుంది.

## *ఉత్తరాభాద్ర [దూ, శం. ఛా, ధా]*

మీ ఆలోచనలు కార్యరూపములోకి వచ్చిందికి ఎన్ని అవాంతరాలు కలిగినా నిరుత్సాహ పడకుండా పట్టుదలతో ప్రయత్నించి కార్యసిద్ధిని పొందుతారు ఖర్చులకు సరిపోయే సొమ్ము సమయమునకు లభించక పోవుటచేతను అప్పుచేయవలసి వస్తుంది. అయిననూ సోదర సహాయము కలుగుటచే వారాంతమునకు తీరుస్తారు. ఆత్మీయులకు సహాయము చేయుటకు మాట యిచ్చి చేయలేక నిందలపాలవుతారు. అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. ఇంజనీరింగుశాఖ ఉద్యోగస్తులకు, భూస్వాములకు, లోహపుసామాను, రంగుల వ్యాపారస్తులకు కష్టముతో కూడినలాభము. వారమంతా చాలా ఆందోళనకరముగా వుంటుంది.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము మీకు యోగకాలము. మీ బుద్ధిబలమునకు తోడు అధికారుల సహాయము బంధు సహాయ కలుగుటచేత వచ్చిన ఆటంకములను గడిచి ఫలముపొందుతారు. ధనాదాయము వృద్ది అవుతుంది వైద్య, జ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. కవులు నూతన రచనలు మొదలుపెడతారు. ఈశాన్య దిక్కునుండి మీ దగర బంధువుల క్షేమవార్త చేరి సంతోషము కలిగిస్తుంది. విద్యార్థులకు మంచి కాలము. వైద్యులకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. మంచి యోగములున్ననూ వారమంతా ఆందోళనయుతముగా వుంటుంది. 






సంక్షేమ కార్యక్రమాలు; (2)

# 'క్లుప్త విద్యా ప్రణాళిక'

ఈ రోజుల్లో చాల మంది స్త్రీలు తమ కుటుంబాల్లోని ఆర్థిక స్థితినిబట్టి, ఏదో ఒక ఆర్జనామార్గం చూసుకొంటున్నారు. ఏ విధంగానూ ఆధారంలేని స్త్రీలు తమ జీవనం కోసమే పని చేస్తుండగా, కుటుంబంలో ఆర్జించే వ్యక్తులు తక్కువగా వుండడం వల్ల, తమ ప్రయత్నం ద్వారా కుటుంబాదాయాన్ని ఎక్కువ చేయాలని కొందరు స్త్రీలు పనిచేస్తున్నారు. వీరంతా ఏమి వృత్తులు అవలంబిస్తున్నారు. ఏమి ఆర్జించగలుగుతున్నారు, వీరు చేస్తున్న పనులకు తగినటుగా వీరు సుశిక్షితులైనారా? అన్నది ఒక ప్రశ్న. అంతేకాక యింకా ఎంతమంది స్త్రీలు ఏదో ఒక ఉపాధి కల్పించుకో లేక యిబ్బంది పడుతున్నారు, దానికి కారణమేమిటి అన్నది కూడా ఆలోచించతగ్గ విషయమే.

ఒక డిగ్రీ అనేది తీసుకుని, విద్యాధికులై, ఉద్యోగాలు సంపాదించుకున్న స్త్రీల విషయం అత్యవసర సమస్య కాదు. ఎందుకంటే వారు తాము చేయబోయే పనులకు తగిన శిక్షణ కలిగి నటువంటి వారు కాకపోయినా, నిత్యజీవితావసరమైన ఒక విద్యాస్థాయిని అందుకుని, ఏ వృత్తి విద్య నభ్యసించడానికైనా అర్హులే.

ఏదో సామాన్య అక్షరజ్ఞానం కలిగివున్న స్త్రీ, యీరోజు ఏదైనా జీవనోపాధి కల్పించుకోవాలంటే మార్గం ఏమున్నది? చిన్న వయస్సులో వున్న బాలికలు బడికి పోగలరు. బాధ్యతలుండవు కాబట్టి చదువుకో గలరు. కానీ 20-35 మధ్య వయస్సున్న స్త్రీలు భిడియం విడిచి బడికి పోగలరా? కనీసం మూడవఫారం లేక ఇ. ఎస్. ఎల్. సి. లేక ఎనిమిదవ తరగతి వరకైనా చదువుకుంటేనే గానీ ఏ ట్రైనింగులోను చేర్పుకోరు. గ్రామసేవిక, మంత్రసాని, బేసికు క్లాసు టీచరు, ప్రైమరీ స్కూలు టీచరు, కుట్టు ఉపాధ్యాయిని యీ ట్రైనింగులకు, పరీక్షలకు అన్నిటికీ మూడవఫారం కనీస విద్యార్హతగా నిర్ణయించ బడినది. క్రొత్తగా స్కూలు విడిచిపెట్టిన 15 సం॥ బాలికలు, లేక ఏనాడో ఆపాటి చదువు అదృష్టవశాత్తు చదువుకో గలిగిన స్త్రీలు మాత్రమే యీ ట్రైనింగులకు వెళ్ళతగినవారై వుంటారు. యథార్థంగా ట్రయినింగుకి వెళ్ళి ఉద్యోగం సంపాదించుకుని, పొట్టగడుపుకో వలసి వున్న కొందరికి ఆ కనీసార్హత లేకపోవడం మూలంగా ఏవిధమైన ఉపాధీ లభించదు.

ఈ విధంగా యిబ్బందులకు లోనయ్యే 20-35 సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీలను 'క్లుప్త విద్యాప్రణాళిక' ద్వారా పరీక్షలను తయారుచేసేందుకుగాను కేంద్ర సాంఘిక సంక్షేమ సమితి డబ్బు కేటాయించబోతోంది. ఒకటి రెండు సంవత్సరాల కాలంలో మూడవఫారం దాక దానికి సమానమైన పరీక్షకు వెళ్ళేందుకు వీలుగా తగిన తరగతులు నడపదలచిన సంఘ సేవా సంస్థలకు అందుకుగాను ఈ సొమ్ములోంచి డబ్బు మంజూరు చేస్తారు. ఇంతవరకు కేంద్ర సాంఘిక సంక్షేమ సమితి గ్రాంట్సు కార్యక్రమములో యీ అంశము లేదు.

ఇదివరలో యీ విధమైన తరగతులను నడుపుచున్న సంస్థలను గానీ లేక చిరకాలమునుండి ఏదోఒక సంఘసేవ నిర్వర్తిస్తున్న సంస్థలకుగానీ, యీ గ్రాంట్సు యివ్వబడుతవి.

ఆంధ్రప్రదేశ్‌లో చాలా మహిళా సంఘాలు కుట్టు, సంగీతం, నృత్యమూ, హిందీ, సంస్కృతం. యింగ్లీషు నడుపుతున్నవి. ఇవికాక కొన్ని అనాథ వితంతు శరణాలయాల్లో విద్య నేర్పబడుతోంది. మన రాష్ట్రంలో ఇ. ఎస్. ఎల్. సి. ప్రభుత్వ పరీక్షకు, ఆంధ్ర సారస్వత పరిషత్ తెలుగు పరీక్షలకు ఈ పథకం క్రింద శిక్షణ నివ్వవచ్చును. ఏ రాష్ట్రములోనైనా ప్రభుత్వముచే గుర్తింపబడిన పరీక్షలకు మాత్రమే విద్యార్థినులను తయారు చేయవలసివుంటుంది ప్రప్రథమంగా యీ 'ప్రణాళికను' అమలు జరుపబోయే సంస్థ, తాము అనుసరిస్తున్న పాఠ్యప్రణాళిక (సిలబస్) ఆ పరీక్షను తగినదో కాదో చూచుకోవాలి. ఈ విధముగా తమ వద్ద ప్రైవేటుగా చదివిన స్త్రీలు పరీక్షకు కూర్చోనవచ్చునో కూడదో నిర్ధారణ చేసుకోవలసి వుంటుంది.

ఒక తరగతిలో 25 మంది వరకు స్త్రీలను చేర్చుకోనవచ్చును వీరిలో కొందరు కొంత వరకూ చదివినవారు కొందరు ఏమీ చదువుకొని వారూగా వున్నట్లయితే ఒకటి రెండు సంవత్సరముల మధ్య వారి కెప్పుడైన పరీక్షకు విడివిడిగా పంపవచ్చును. కానీ సాధారణంగా కోర్సు 2 సంవత్సరములకు మించకూడదు. ఈ కోర్సులో చేర్చుకొనే స్త్రీలు పరీక్ష పూర్తిఅయిన తరువాత తప్పనిసరిగా ఏదో వృత్తి విద్యలో శిక్షణపొందుతాము అనో గ్రామాలలో సేవ చేస్తామనో హామీయిచ్చేలా కట్టుదిట్టం చేయడం మంచిది. వర్సులుగా స్త్రీలను చేర్చుకునేటప్పుడు అనాథలకు, వితంతువులకు, యితరత్ర ఆర్థిక, సాంఘిక అవసరము లున్నవారికి, ప్రాధాన్యం ఉంటుంది.

సాలుకు 15 వేల రూపాయలకు మించని గ్రాంట్సు రెండు సంవత్సరముల వరకు యీ కోర్సు నిమిత్తము మంజూరు చేయ

(48 వ పేజీ చూడండి)

అంతా బాగానే వుందిగాని :

# ఆ అమ్మాయి చదువుకొన్న పిల్ల!

ఆ విశాలమయిన గదిలో బొమ్మల పేరంటానికొచ్చిన ముత్తయిదువులందరూ కూర్చున్నారు. రంగురంగుల పట్టుచీరలు ధగధగ మెరిసే రాళ్ళనగలు కళ్ళను చెదరగొడుతున్నాయి. ఆ దీపాలకాంతిలో "చీరలూ, నగలూ రెట్టింపుకళతో ప్రకాశిస్తూ గదిలోని వెలుగును ఎక్కువ చేస్తున్నాయి. ఇంతలో ఒక మధ్యవయస్కురాలు పసుపుగిన్నె చేత్తో పట్టుకుని వచ్చి ముత్తయిదువుల కాళ్లకు పసుపు రాస్తోంది. పలుకరిస్తూ నాదగ్గరకొచ్చింది.

"మీరొచ్చారేం? పేరంటానికి రారేమో అనుకున్నాను!" అంది ఆశ్చర్యంగా. అందులోంచి తేరుకోకుండానే అరనిముషం నన్నలాగే చూస్తూ చటుక్కున తన చూపును వేలును పసుపుగిన్నెలోనుంచి నా కాలి బొటనవ్రేలిగోళ్ళకి రాచి వెనుతిరిగింది. ఆవిడ చేస్తున్న దేనిటో అర్థంగాక "నాక్కూడా పసుపురాయండి. నాకు రాయకుండా వెడుతున్నారే!" అన్నా. ఆవిడ వెటక్కు తిరిగింది. "అయ్యో మీరు డాక్టరు చదువుతున్నారు కదా పసుపు రాచుకుంటారా కాళ్లకి మోటు వాళ్ళలాగ" అంది ఆవిడ కళ్ళు పెద్దవిచేస్తూ. నాకు నవ్వాగిందికాదు. "చదువుకుంటే పసుపురాచుకోకూడదని ఎక్కడుంది? అసలు చదువుకీ, పసుపుకీ ఏం సంబంధం" అన్నా.

ఆవిడ మళ్ళీ ఓసారి నా వంక తేరిపార చూసింది. చూసి ఫక్కున నవ్వి, "నువ్వొక్కడో నాకు అప్పచెల్లెలయి పుట్టాల్సింది పొరపాట్న ఈతరంలో పుట్టవు" అంటూ గిన్నె పుచ్చుకు చక్కాపోయింది.

ఇది జరిగి రెండు నెలలు కావస్తోంది. అది తలుచుకున్నపుడల్లా నాకు నవ్వొస్తూంటుంది. ఇంటికి వచ్చాక చాలా సేపు నాలో నేను తర్కించుకున్నాను. చదువుకున్న వాళ్లంటే వేరే మతం పుచ్చుకున్న వాళ్లలా ఎందుకు చూసారు?

అబ్బరాజు ఆదిలక్ష్మి
(సికింద్రాబాదు)

"అబ్బో ఈ చదువుకున్న వాళ్ళతో మనం గెలవలేం లేవే అంటుంది బామ్మ అమ్మతో. ఈ కాలం చదువులొచ్చిపాడు చేశాయి" అంటుంది పక్కింటి పిన్నిగారు.

"ఏమిటో వనజవయ్యారం? ఆ నడకేమిటి? తానే గాంగా ఇంతోటి బియ్యే చదువుతోందనా? ఏం చూసుకుని ఆమిడిసిపాటు? ఇది వెనకింటి వెంకాయమ్మగారు ఓనాడు నాతో అన్నది.

"వద్దు మొర్రో అని మొదటినుంచీ నే మొత్తుకుంటూనే వున్నా చదువుకున్న పిల్ల, చదువుకున్న పిల్ల అంటూ ఏరి కోరి ఎగిరి గంతేసి చేసుకున్నాడు నీ మనవడు బండెడు చాకిరీ నే చేసుకోలేక చస్తున్నా! ఆ దొరసానిగారు ఏనాడైనా పనిలో వేలు పెడితేనా. ఇటు చెంబుతీసి అటు పెట్టదు. సంసారం బట్టాబండలూ, అటుంచి ఆవిడ సినిమాలకీ, జారెటు చీరలకి నిమనవడి సంపాదన సరి. అవ్వ తీసిన గంధం తాత బొట్టుకు సరి అన్నట్లుంది. మా సంసార్ఠం ఏం చెప్ప మంటావు పిన్నీ" అంటూ నవ్వ చెప్పింది పాతం ఓ శుభోదయాన పొరుగూర్లోని చుట్టాలావిడ. ఈ తరవభర్జనలకి పర్యవసానంగానే తేల్చుకున్న దేమిటంటే:

ఈ చదువుకున్న వాళ్లకి (స్కూలుకి పైనలు ఇంకా దానిపైవి) మహా గర్వం. వాళ్ంతా ఎప్పుడూ భూమిమీద నడవరు. "ఎప్పుడూ" ఏదో పుస్తకాలు నవలలు చదువుతూ వచ్చిన ప్రతి సినిమా చూసేస్తూ మరో లోకంలో విహరిస్తూంటారు. పేరంటానికి, గుడికి వెళ్లటం, పసుపు రాచుకోడం మొదలగునవి వీరి దృష్టిలో మోటుపనులు. వంటాపెటూ అంటే ఎరగరు...ఇవీ చదువుకున్న ఆడపిల్లల గురించి అమ్మలక్కలు పత్రలు దిర్చి తీర్మానించిన విషయాలు. ఈ పైన నేను చెప్పిన వాటికి కారణాలు లేకపోలేదు. ఇందులో కొన్ని స్వానుభవం మీద రాస్తున్నవే!

మరికొందరున్నారు. వాళ్లకి కాలేజీలో చదివే అమ్మాయి లేం చేసినా విడ్డూరమే. మా పెదపాప, అంటే మా చెల్లెలు ఒకసారి నాతో అంది. "ఆమూడో ఇంట్లో కొత్తగా దిగిన అయ్యర్ల అమ్మాయ్ లేదూ? ఎమ్మే పాసయిందిట. వుద్యోగం చేస్తూ ఇంట్లో రెండు పూటలా వంట తనే చేస్తుందట చూశావా" అంది తన కళ్ళు తిప్పుకుంటూ. నాకు నవ్వు మండిపోయింది. "ఆడపిల్ల కాదేమిటీ ఆ అమ్మాయి. వంట చేతగాకపోతే నవ్వాలి




అనేక వేల మంది గృహిణులచే కొనియాడ బడిన అత్యుత్తమమైన శమనపరచే సువాసనగల పౌడరు!

శ్రీ కాఫ్
దగ్గు, ఉబ్బసములకు
దివ్యౌషధము
శ్రీవత్స కెమికల్స్ & డ్రగ్స్
లిమిటెడ్, మద్రాసు-30

గాని ఆడపిల్ల సహజంగా చేయవలసినపనులు చేసే వింతగా చెప్పుకుంటారేమిటని" నాలుగు చీవాట్లేశాను. అంతే ఈనాటివరకూ పెద్ద పాప మళ్లీ అలాంటి ప్రసక్తే తీసుకు రాలేదు.

ఇక నా సంగతి. నాకు వంటచేత నవ్వు వంటే ఎవరూ నమ్మరు. నవ్వుతారు. మా పిన్నితో కూడా అంటే నీమొహం నీకు వంటరాకేం నాలుగు పుస్తకాలుచదివిచూడు పిండివంటలు నేర్చుకుని 'మాకూ వంటవచ్చే సింది' అంటూ డంబాలు చెబుతారు "వంటంటే పరీక్షలు ప్యాసవడ మేమిటి" అంటుంది. మా పిన్నికి చదువుకున్న ఆడపిల్లలంటే కొన్ని స్థిరమైన అభిప్రాయాలున్నాయి. తన కొడుక్కి సరే. రా చదువుకున్న పిల్లను చేసుకోనంటుంది. ఎందుకు వదుపిన్నీ అంటే ఇందాక నే నేకరువుపెట్టిన 'సదుణా'లన్నీ, బాబిగాడు అప్పుపాఠం తప్పచెప్పినట్లు చెబుతుంది. అన్నయ్యకేమో తన చదువుకి తగ్గట్టుగా చదువుకున్న పిల్లే కావాలంటాడు. అంచేత పిన్నికి నన్ను చెప్పమంటాడు "లక్ష్మి (అంటే నేను)చదువుకుందికదా అది అందరితో వుండా సంసారపక్షంగ లేదా" అంటాడు. అంటే నా సంగతి వేరంటుంది. మరి న్యాయబద్ధమైన సిద్ధాంతాలు అందరికీ అన్వయించాలికదా ? ఇలాటి విషయాలు ఆవిడతో వాదించి లాభంలేదు. ఆవిడకు నామీద వున్న సదభిప్రాయం కాస్తా వూడ్చి పెట్టకపోతుంది.

చదువన్నది బాగుపడటానికే కదా ? చాకలిపద్దు రాయటంవస్తే చాలే. మా పిల్ల వుద్యోగాలు చేయాలా వూళ్లేలాలా. అంటారు చాలామంది బామ్మలు, పిన్నమ్మలూను. చక్కగా చదువుకున్నందువల్ల తప్పేమీలేదు. చదువుకుని చెడిపోయారన్న మాట కాధారంలేదు. చదువుకున్న ఆడవాళ్లకి వంటపని ఇంటిపని రాదన్నమాట శుదాబద్ధం. కాదంటే ఇంట్లో తీరికలేక బహుశా చేస్తుండరు.....చదువుకున్నవారు తెలివితో సంసారం దిద్దుకుంటారు. అంతమాత్రంచేత చదువుకున్నవారికి గర్వమనీ పని చేతగాదనీ అభాండాలు వేయరాదు. గర్వమన్నది మిడి మిడి జ్ఞానంతో కొట్టుకుంటున్నా "నా కంటె నీ కెక్కువ తెలుసా" అనే తరహా వారి సొత్తు విద్య ఎప్పుడూ మన పురోగమనానికే తోడ్పడుతుంది కానీ మన పతనానికి కాదు. ఇదంతా నేను ఇలాంటి అభాండాలు ఆడపిల్లలమీద వేసేవారిగురించే రాశాను గానీ అందరూ అట్లా అంటారనిగాదు. "అబ్బా ఆ చదువుకున్నపిల్ల మా కొద్దమ్మా. నా కొడుకసలే మెతకుడు. వాడినీ నన్నూ రెండాట లాడిస్తుంది" అని కాబోయే అత్తగార్లు అనడం మానుకోవాలి. ★

# దిండుగలీబు మీదికి



పిల్లా విజయలక్ష్మీదేవి (విజయవాడ)



# ఏ పాప అయితే నేం?

అక్కయ్య ప్రసవవేదన పడుతున్నదని తెలియగానే అప్పటికప్పుడే ప్రయాణమై త్వరగా నెల్లూరులో వుండే అమెరికన్ హాస్పిటలుకు వచ్చి చేరాను. అక్కయ్యకు తొలికాన్పు అయినందువలన అమ్మ, అన్నలు, నాన్న, అక్కయ్య భర్తగారు, అత్తమ్మ, మామగార్లు కూడా వచ్చివున్నారు. మొగవాళ్ళంతా గేటు దగ్గర వున్నారు. అమ్మ అత్తమ్మమాత్రం అక్కయ్యవద్ద వున్నారు. తీరా నేను వెళ్ళబోతే ఆ గేటు వాచ్‌మెన్ "అక్కడ ఇప్పటికే ఇద్దరు వున్నారమ్మా. మీరు వెళ్ళటానికి వీలు లేదు" అని ఖచ్చితంగా అన్నాడు. నాకు ఏమి చేయాలో తోచక నేనుకూడ నాన్న వాళ్ళతో చేరి గేటు కాపలా కాయసాగాను. గంటలుమాత్రము దొర్లుతున్నాయి. అమ్మ గాని, అత్తమ్మగాని రానేలేదు. రాత్రి ఒంటిగంట అయింది.

కునికిపాట్లు పడుతున్న నేను, అత్తమ్మ ఏడుపు స్వరముతో తత్తరపడుతూ లేచి కూర్చున్నాను. అప్పటికప్పుడే వస్తున్న కన్నీటిని తుడుచుకొంటూ "ఏమిటి అత్తమ్మా" అని అడిగాను. దానికి సమాధానంగా "ఇంకేముంది మీ అక్కయ్య ఆడపిల్లనుకన్నది" అని చెప్పి, మళ్లా ఏడుపు లంకించుకొన్నది. నిజంగా నాకప్పుడు ఏమనాలో చెప్పలేనంత కోపం వచ్చింది. మా అక్కయ్య అత్తమ్మ అంటే నాకట్టే చనువు లేకపోయినా, కొంచం వుండబట్టలేక "అదేమిటి అత్తయ్యా శుభమా అంటు చక్కటి మనుమరాలు పుట్టితే, ఈ ఏడుపు? అయినా ఆడపిల్ల పుట్టటం అంటే సామాన్యమా! ఇంటికి లక్ష్మి కదూ, ఇంతకీ తొలిబిడ్డకే ఏడుస్తారెందుకూ!" అని కొంత గట్టిగా అడిగాను. దానికి అత్తమ్మ అంది కదా "అదేమిటే అలా అంటావు? రేపు ఈ పిల్లను పెండ్లి చెయ్యాలి అంటే ఏ ముప్ఫై వేలో కట్నం ఇచ్చుకోనిదే ఎవడొస్తాడే! అందులోను మన రెడ్డికులంలో మరీ గిరాకి!" అందుకు ఏమని తెల్పాలో తోచని నేను, మా బావ దగ్గరికి వెళ్లాను. "ఏం బావా, మీకు కూడా కుమార్తె పుట్టిందని కష్టమేనా" అన్నాను. బావ నా ఎదుట డైరక్టుగా ఇష్టం లేదని చెప్పలేక కాబోలు "ఆడపాప కాబట్టి నల్లగా అయినా లేకుంటే బాగుండును" అన్నారు. "అదేమిటి బావా! మొగబిడ్డ అయితే నల్లగావున్నా ఫరవాలేదా? అయినా ముఖలక్షణాలు చక్కగా వుండాలి కాని, రంగులో ఏముంది, తెల్లని వాళ్ళంతా అందంగా వున్నారా? నల్లని వాళ్లందరు అనాకారులా? అట్లా అయితే నలుపులో లెక్క అయిన మా అక్కయ్యని మీరు ఎలా కోరిచేసుకున్నారు!" అని ఏకధాటిగా ప్రశ్నలవర్షం కురిపించేసరికి, ఆ ధాటికి తట్టుకోలేని మా బావగారు, మెల్లిగ అచ్చటనుంచి తప్పుకుంటూ కట్నాలబాధ లేకుంటే నాకుమాత్రం ఏం పోయింది! నలుపుఅయితే ఇంకొక పదివేలు ఎక్కువ ఇచ్చుకోమ్మంటారు. అన్నారు. ఎమ్. ఎస్ సి. చదివిన మా బావగారు కూడ ఇలాగె మాట్లాడుతున్నారేమా అని నాలోనేనే ఆశ్చర్యపడినాను. ఆ పుట్టిన బిడ్డను కావలసిన వారిలో ఏ ఒక్కరూ "ఏ పాపఅయితే నేం?" అన్న వారుమాత్రం కారు. నేనంటే మాత్రం నామాటలు గుచిస్తేగా!

ఆలోచిస్తే అత్తమ్మ, బావ తదితరులు అన్న మాటలలో కొంతసత్యము లేకపోలేదు. ఎవ్వరికయినా, ఏ విషయములోనైనా దూరపు ఆలోచన అవసరమే గాని, ఇంత దూరపుదృష్టితో బిడ్డ పుట్టగానే- పెండ్లి ఖర్చు తలుచుకొని ఏడుపులు మాత్రము అనవసరమనుకుంటూరు. ★

సరోజినీ సుధాకర్‌రెడ్డి



ది టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

మధ్యతరగతి సంసారంలో:

# 'వస్తుందో పోతుందన్న ఫస్టు తారీకు ఏం తెస్తుంది?'

"ఫస్టు కింకా ఎన్నిరోజులు"? అన్న వ్యాసం బాగా చదివాను. శ్యామలాదేవిగార్కి సాంసారిక అనుభవము చాల తక్కువ అనుకుంటా. మధ్య తరగతి కుటుంబాలవారు మొదటి తేదీకోసం ఎదురుచూస్తూ ఉంటారని, చిక్కులు పడుతూ, అప్పులు చేస్తూ కాలం వెళ్ళబుచ్చుతుంటారని, స్త్రీలు పొదుపుగ గడుపుకు నెఅలవాట్లుకుర్తించాలని మొగవారుకూడ చెడుఅలవాట్లకులోను గాకుండ జాగ్రత్తగ వుండాలని అందరూ సంసారాల్లో చిక్కులు ఎడటానికి కారణం వారి అజాగ్రత్తయే యని ఆమె ఆరోపించారు.

కాని నే నొప్పుకోను. మధ్య తరగతి కుటుంబాలు కేవలం జీతం డబ్బులమీదనే ఆధారపడి వుండాలికదా. వారు ఎల్లాగవుంటే అప్పులేకుండా వారికొచ్చేగాంతో కాలం గడపవచ్చునో శ్యామలగారు సూచించి ఉంటే చాలసంతసించెదానిని. కాని, "జాగ్రత్తగయుండాలి, అప్పుచేయకూడదు. ఖర్చు తగ్గించుకోవాలి" అని నాలుసార్లు రెట్టించి రాస్తే ఆదొక సలహా అయిందా!

మా యింటికి దగ్గరలో నాకు తెలుసున్న వాళ్లున్నారు. ఆ యింటాయనకు ఒక కంపెనీలో నౌకరీ జీతం, అన్ని భత్యాలూ కలిసి మొత్తం 100 రూ. యిస్తారు. గవర్నమెంటు నౌకరీ అయితే యింతకూడా యివ్వరు. ఆ డబ్బుచాలక నానాయిబ్బందులు పడుతున్నారు.

వాళింట్లో ఆయన, భార్య ఒకకొడుకు. 'అమ్మో! ముగ్గురికి–అసలు పిలాడు లెక్కలోనేలేడాయె – నూరురూపాయిలు చాలవా' అని చెప్పేటప్పుడు మాత్రం అమ్మలక్కలు బుగలు నొక్కుకుంటారు. కాని నిజానికి డబ్బుకి విలువలేని యీ రోజుల్లో అవి చాలవు.

యఱ్ఱమిల్లి గాయత్రి,
(మదరాసు.)

ఆ నూరురూపాయిలలో, ఆఖరికి రెండు గదులుగల యింటికి రూ 30 అద్దె; ఆ ముగ్గురికీ బియ్యం 15 పళ్ళు; 15 రూపాయలు. పప్పులు, మిర్చి వగైరాలకు నెలకి రూ. 10 పంచదార, కాఫీ నిమిత్తం రూ. 5. పాలు (మజిగ యింట్లోనే చేసికొనే నిమిత్తం) ఎంతతక్కువకొన్నా రెండుపూటలకి కాఫీలకి, (కాఫీ ఎంతనీళ్లలా తాగిన) రెండు పూటలకి మజిగకి (పెరుగనేది వుందా అని అనుకోవాలి) మధ్యాహ్నం పిల్లాడి విడుపు పటలేక ఒక ఔన్సు ఇవ్వడానికి ఎవ్వరైనా ముఖ్యస్నేహితులు యింటికివస్తే వారికి కాఫీ యివ్వకుండ పంపేస్తే బాగుంటుందా? ఇవన్నీ కలిపి రోజుకి అణాలు 8 పాలు. నెలకి రూ. 15. ఇంక నెయ్యి, నూనె—వీటికి నెలకి రూ. 6 ఇంక బొగ్గులతోనే వంట జరిపించాలి కనక, (పేళ్ళతో చేసుకుంటే యిలు ఖాళీ చేయిస్తారు) నెలకి ఒకబస్తా రూ. 7. అదీనా వేడినీళ్ళు పోసుకోకుండా. కేవలం ఏ పెంకుముక్కతోనో, కొబ్బరిపీచులోనో వళ్ళు రుద్దుకోలేము కనుక ఆఖరికి మొఖం రుద్దుకుందుకు సబ్బోశీకాయో, తలకి కొంచెం కొబ్బరినూని అవసరం. రోజుకు రెండుసార్లు మొఖాలు రుద్దుకొని తలకి చమురు రాసుకుంటే సబ్బులకి నెలకి 0-12-0 నూనెకి ఒక 0-12-0 అగును. అసలే ఆడవాళ్లకి కొబ్బరినూనే ఎక్కువ కావాలి కనక. ఇంక చాకలి—బారు సబ్బుతోనో లేక ఏ యితరచౌకబారు సబ్బు, [illegible] జాకెట్లు, తువ్వాళ్లు, జుబ్బాలు మొదలయినవన్నీ ఉతుక్కుంటూ మొగాళ్ళ పాంటులు వగైరాలు మాత్రం చాకలికివేస్తే నెలకి రూ 5. మొగాళ్ళవి ఉతకచ్చు. వాట్నీ యిస్త్రీ లేకుండ అసహ్యంగ ధరించి ఆఫీసుకు వెళ్ళవచ్చు కాని అగపెట్టకుంగుదు యీ అద్దె కొంపలో గాలి వెలుతురు వుండవు. అందుచేత ముఖ్యంగా చాకలికి వేయటం తప్పదు. మొగాళ్ళు నెలకు ఒక్కసారి చేయించుకున్నా క్షౌరం ఖర్చు 0 12-0 తరువాత ఆఫీసుకు వెళ్ళటానికి మైళ్ళుమైళ్ళు నడవలేరు కనుక ఆఫీసుకు ఎంత దగ్గరలోయున్నా సిటీ బస్సు బస్సుమని పుచ్చుకొంటుంది నెలకు రూ 7. కూరగాయలకని, కాని అర్ధణా తప్పనిసరి చిల్లర ఖర్చులకుగాని రూ 5. యింతవరకు 107 4 0 అయింది.

జీవితంలో పండుగలు వస్తాయి, పర్వాలు వస్తాయి. పెద్దల అబ్దీకాలు, పిన్నలపుట్టిన రోజులు, అనుకోని కష్టాలు వస్తాయి సరే. పండుగ దినాలు అవసరం లేదు కాని అబ్దీకాలు, వంట్లో అనారోగ్యాలు అప్పైనా చేసి పూర్తిచేయాలి. ఇంక యీ నూరు రూపాయల సంపాదనలోనే తను, భార్య పిల్లాడు ఒక్కొక్క జతేనా ఏడాదికోసారేనా గుడ్డలు కొనుక్కోవాలి చూసి చూసి గుడ్డలేకుండా బయటికిపోయే ధైర్యం యింకా మనకి రాలేదు. ఇవన్నీ ఎల్లాగ ఏ నెలలో తట్టుకోటం? నాకు తెలుసున్నమట్టుకి మధ్యతరగతి కుటుంబాలు ఎదుగు బొదుగు దారితెన్నూ లేకుండా మానానికి కట్టుబడి సాగిపోతున్నాయి.

పైన వివరించిన ఖర్చులలో మొగవాళ్లి పేపర్లు, సిగరెట్లు, యింగ్లీషు వతలలు, సినిమా ఖర్చులేమీ లేవు సుమండీ! ఇన్ని తెలుసుండి 80 రూ. జీతగాడు నెలకి రూ. 5 దాచాలని వ్రాస్తారు. ఏం చెప్పాలో తెలీదు.

ఆఖర్కి నాకు తోచింది ప్రస్తుత ప్రపంచ రీతినిబట్టి మనకు వచ్చే దాంట్లో అప్పుచేయకుండా వుండాలంటే ఒక్కటేమార్గం. మానాభిమానాలు వదలి, ఏ రోడ్డుప్రక్కనో ఏ చెట్టు పంచనో కాలం జాగ్రతగ గడుపుకుంటే మీరన్న రూ. 5 నెలకి తప్పక నిలవ చేయవచ్చు.

ఆంధ్ర
సుప్రసిద్ధ
గర్భాశయరోగ
నివారిణి
కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్
రాయపేట. మద్రాసు-14.
ఆంధ్రప్రదేశ్ ఏజంట్లు
మెసర్సు సీతారామ్‌జనరల్‌స్టోర్సు& ఏజెన్సీస్
విజయవాడ, సికిందరాబాదు.

కేశముల సౌందర్యాభివృద్ధికి
సుగంధ చర్మరక్షణ మలాము
దురద గజ్జలు కొట్టు మొటిమలకు
కోడి మార్కు
మద్రాసు-1.
బ్రాంచి: విజయవాడ.

# వనితా వాణి



## హాస్యాస్పదం

16-7-58 ఆంధ్ర వారపత్రికలోని వనితా వాణి శీర్షికలో సరికొత్త పాతకోణంగా కన్పించిన శ్రీ తోలేటి కామేశ్వరరావుగారు వితంతు వివాహాలమీద వివరించిన అభిప్రాయాలు హాస్యాస్పదంగా ఉన్నాయి.

ఆయన సనాతనుల కట్టుబాటులు శాస్త్ర సమ్మతంగా ఉన్నవని అంగీకరిస్తూనే వితంతు వివాహాలను వ్యతిరేకించడంలో అర్థం లేదు.

ఇక జనాభా పెరిగిపోతున్నది గనుక వితంతు వివాహాలు కూడదంటారు. కుటుంబ నియంత్రణను అమలు పరుచటానికి వితంతు వివాహాలకు సంబంధమే లేదు.

భర్తృ విహీనలు పడేబాధలు ఆయనకు పిట్టకథలుగా కన్పించడం విచారకరం. అదే పత్రికలో రాధగారు వ్రాసినది చదివితే రాతి గుండెలు కూడా ద్రవిస్తాయి!

కొట్టె రామారావు (విశాఖపట్టణం)

* * *

## మూఢ నమ్మకాలా మొండి పట్టుదలలా

వనితావాణిలో "సరికొత్త పాతకోణం" కనబడి చదివేను. ఇన్ని వందల ఏళ్ళుగా స్త్రీలుపడు అవసలనూ, వారి క్షోభనూ, ఆ లేఖ వ్రాసిన కామేశ్వరరావు అనే ఆయన వట్టి పిట్టకథగా జమకట్టుకోవడం ఘోరం. ఇంకా ఇటువంటి మూఢ నమ్మకాలూ, మొండి పట్టుదలలూ మన దేశంలోవారు వదులుకోవడం లేదు. సనాతనులు పెట్టిన ప్రతి కట్టుబాటూ, శాస్త్ర సమ్మతంగానూ, ఆధ్యాత్మిక చింతనముతోనూ పెట్టినదే కానీ స్వార్థపరత్వంతో పెట్టినది కాదని రాశారు. కానీ స్వార్థంతోనే పెట్టేరు లేకపోతే మగవారికి కూడా ఈ విధమైన కట్టుబాట్లు పెట్టే వుందురు. ఒక వేళ భార్యలు గతిస్తే తాము తిరిగి ద్వితీయ వివాహం చేసుకోకుండా మొదటి భార్య పిల్లలను గాలికీ ధూళికీ వదలకుండా ఈ విధమైన కట్టుబాట్లూ నియమాలు పెట్టి భయపెట్టేవారు కామేశ్వరరావుగారు ఇకొక విషయం రాశారు. "ఇంతకీ వితంతు వివాహాలు ప్రోత్సహించడమనేది సబబుకాదు. వితంతువులవల్ల కలిగే జనాభా కూడా కలిపే పక్షంలో భారతదేశం ఇంకో వలస రాజ్యం చూసుకోవలసివస్తుంది. ఆహారపు కొరతతోనూ, మిక్కుటమైన జనాభాతోనూ, కొట్టుమిటాడుతున్న భారతదేశంలో కుటుంబ నియంత్రణ అమలుపర్చాలి, అంటూ బహిరంగ సభలో నిర్భయంగా ప్రవచిస్తున్నారు. మరి మీరేమంటారు" అని. అటువంటప్పుడు అంత ఆహారపు కొరతతోనూ, జనాభా పెరుగుదలతోనూ, బాధపడుతున్నారని విచారించేవారైతే ఇటువంటి పెద్దమనుష్యులంతా చేరి, మొగవాళ్లు ద్వితీయ, తృతీయ, వివాహాలు చేసుకుంటూంటే చూస్తూ వుండకపోతే మాన్పించలేకపోతున్నారా? ఇలాగ భార్య గతిపోగానే ఆమెను మర్చిపోయి, తిరిగి మూడు నెలలు తిరక్కుండానే వివాహాలు చేసుకునేవాళ్లు లక్షలకొద్దీ వున్నారు. ఆరవై, ఎనభై, ఏళ్లువచ్చినా, పదహారేళ్ల అమ్మాయిని పెళ్లి చేసుకుని, ఆమెను విధవను చేసినప్పుడు, తిరిగి ఆ అమ్మాయి వివాహం చేసుకుంటే తప్పవొచ్చిందా? ఐదారు వివాహాలు చేసుకున్నవాళ్లు వున్నారు వీరందరివల్లా కలిగిన జనాభా లెక్కపెడితే మామూలువారికన్న ఎక్కువేను. కానీ పాపం చిన్నప్పుడే వివాహంఅయి భర్త చనిపోతే ఏమీ ఎరగని అమ్మాయిలు వివాహం చేసుకుంటే జనాభా పెరిగిపోతుంది అని బాధపడిపోతున్నారు. ఒకళ్ళిద్దరు పిల్లలువున్నవారిని పెళ్లి ఆడమని ఎవరూ చెప్పరు. మూడోంతులు అటువంటివారు ఒప్పుకోరుకూడాను.

రాధగారు, రాసిన "విషాదగాథ, వింటే బాధ" అన్న వ్యాసం చదివైనా ఇకముందు, ఇటువంటి అభిప్రాయాలు వొదులుకొని, సహకరించమని ప్రార్థిస్తున్నాను. అంతేగానీ వెక్కిరింతలూ, వేళాకోళాలు ఆడి బాధ పెట్టడం మంచిదికాదు.

(కాకినాడ), టి. జయశ్రీ.

* * *

సాధారణంగా వివాహార్హత గలిగిన వితంతువుల సంఖ్య (వయస్సుబట్టి) అవివాహితులైనవారికంటె స్వల్పంగా ఉంటుంది. వారిలోకూడా వివాహాలు కొద్దిమందికే, జరుగుతున్నాయి. అట్టివారి సంతానంవల్ల మాత్రమే భారతదేశం యింకొక్క వలస రాజ్యాన్ని చూసుకో నక్కరలేదు. వారూహించినంత విపరీత పరిణామాలకు తావు లేదు.

వితంతు వివాహాలను ప్రోత్సహించి, వారి అభ్యున్నతికి అవకాశాలు కలిగిస్తే మన స్త్రీ సమాజానికి కొంత మేలు చేకూరుతుంది.

మన్నవలి రాధాబాయ్, (గుంటూరు)

* * *

## తప్పెవరిది?

పి. ఎస్. ప్రభావతిగారి అభిప్రాయముతో ఏకీభవించలేక పోతున్నాను. వారు, తప్పంతా పెళ్ళిచేసుకునే యువకులదే అంటున్నారు. ఆ అభిప్రాయము తప్పేమో. తప్పంతా ఆడపిల్లలతండ్రిదే నేమో. తన తాహతును మించి కట్నాలిచ్చి తనకన్నా గొప్పవాళ్ని తీసుకువచ్చి అల్లుడిగారి, వారి తలిదండ్రుల ,ఆడపడుచుల కోర్కెలు తీర్పలేక, లాంఛనాలు సరిగా జరుగలేదని అలిగే వియ్యాలవారిని సాగదీస్తూ ఏమి అంటే తన బిడ్డను కష్టపెడతారోనని భయపడ్తూ వారి గొంతెమ్మకోర్కెలు తీరుస్తారేకాని, అదే ఒక బీదకుర్రవాడికి ఇస్తే ఎంతో గౌరవముతో చూస్తాడని గ్రహించరు. కానీ ఆడపిల్ల తండ్రి ఎప్పుడూ తనకున్న ఇల్లూ వాకిలీ అమ్మైనా తనకన్న గొప్ప సంబంధము తీసుకురావాలని తాపత్రయపడతాడు. మధ్యతరగతి కుటుంబీకుల కున్న సమస్యే ఇది. అటువంటప్పుడు ఉన్నవాడూ కూడా ఉన్నవాడే కావాలనుకుంటాడు. లేనివాడూ ఉన్నవాడే కావాలనే ఈ రోజుల్లో మగపెళ్ళివారు గొంతెమ్మకోర్కెలు కోరడములో వింతేమున్నది.

కట్నని షేధచట్టం అమలులుకువచ్చినంత మాత్రానే కట్నాలు పోకపోగా చాటుగా ఇవ్వటం తీసుకోటం జరుగుతున్నది. ఇచ్చిన ఆడపిల్లతండ్రి ఇచ్చానానికాని, తీసుకున్న పిల్లవానితండ్రి తీసుకున్నాననికానీ ఒప్పుకోరు. అటువంటప్పుడు చట్టంయొక్క ఫలితము ఏమున్నది మధ్యతరగతి కుటుంబీకులు తమ తాహతునుబట్టే వివాహాలుచేసే కట్నాల సమస్యలు పరిష్కారము కాగలవు అని నా అభిప్రాయము.

ముందడి భారతీదేవి, సత్తెనపల్లి.

జూలై 28వ తేది ఆంధ్ర వారపత్రిక యందు శ్రీమతి ప్రభావతిగారు వ్రాసిన 'కట్నపిశాచి ఫాన్సీడ్రెస్' అనే వ్యాసం వస్త్రంతో ఆకర్షించింది. నామ మాత్రం గానే వరకట్నాల నిషేధబిల్లు ప్రభుత్వం ద్వారా ప్రకటింపబడింది. కాని కట్నానికి ప్రతిరూపంగా లాంఛనాలపేరుతో వరుడి తలిదండ్రులు గావిస్తున్న అన్యాయం చెప్ప లేనిది. ఇందుకుగాను ప్రభుత్వ కృషితో పాటు, అతురాస్యులైన పెళ్ళికొడుకు వర్గాలనుండు నవయువకులు కూడా యిందుకు అనుకూలురుగా వుంటె, తర తరాలుగా మనదేశంలో ప్రేళ్ళుతన్నుకొనిన వరకట్నాలు రూపుమాసిపోవడం వాటివలన భారతనారీలోకానికి జరుగు యిక్కట్టు మంచులా కరిగిపోవడం జరుగుతాయనెడ నగ్న సత్యాన్ని, తమ వ్యాసం ద్వారా ప్రభావతిగారు తెలియజేశారు. రచయితకి నా హృదయ పూర్వక ధన్యవాదాలు...

పాలమర్తి ప్రేమలత యాదగిరిరావు
(గంట్లకుంట, వరంగల్)

* * *

కట్న నిషేధచట్టం అమలులోనికి వచ్చిన తరువాత పెండ్లికొడుకువారు వేసే ఎత్తులన్నీ ఈమె ఈ వ్యాసములో చక్కగా నిరూపించారు. మావూళ్ళోనే ఇటీవల ఒక సంఘటన జరిగింది. కొంతకాలం క్రితం ఒకరు కట్నం తీసుకోకుండా తమ కుమారుడికి గొప్పవారి అమ్మాయిని వివాహంచేశారు. వారికి ఆ అమ్మాయి ఒక్కతే కూతురు. మొగపిల్లలు కూడా లేరు. ఇంకేముంది! పెళ్ళయిన మర్నాటినుంచీ పెళ్ళికొడుకు ఆ అమ్మాయిని తలిదండ్రుల నడిగి ఆస్తి అంతా తనపేర రాయించమని సాధించటం మొదలెట్టాడు. అమ్మాయి తండ్రివచ్చి అబ్బాయి తండ్రిని "ఇదేమయ్యా" అని అడుగుతే "అవునండీ మరి. కట్నంకూడా తీసుకోలేదుగా మేము. ఏదో వాడు అడుగుతున్నాడు కాబట్టి ఉన్న కాస్తాకూస్తా వాడిపేర రాసేయండి. వాడూ మీ అల్లుడేగదా! పరాయివాడా?" అంటూ సౌమ్యంగా సలహా ఇచ్చాడు ఆయన.

'మహతీదేవి.'

* * *

## ప్రభావతీ సమాధానం

నా వ్యాసంమీద చాలామంది సోదరసోదరీమణులు తమకు తోచినరీతిని ఏవేవో జవాబులు (నన్ను అర్థంచేసుకోకుండానే అనుకోండి) యీ పత్రికాముఖంగా యిస్తున్నందుకు సంతోషం.

నాతో ఏకీభవించలేమని కొంతమంది, నా చదువునుగూర్చి ప్రశ్నించేవాళ్ళే లేక పోయారు, గనుక నేను దుఃఖపడుతున్నానని కొంతమంది, పేరుకోసమే అయితే బి. ఎ. అనే ఆరెండు సువర్ణాక్షరాలు బ్రోచ్ వంటి ఏ సువర్ణాభరణంమీదనో చెక్కించుకోమని కొందరు (ఇంకా నయం ముఖంమీద పచ్చపొడిపించుకో అనలేదు) ఇట్లా వ్రాయడంలో వారి ఉద్దేశమేమిటో అని కొందరు, వ్రాసి జూలై 2వ తేదీ సంచికలో వ్యాసంమీద తమ విన్యాసాలు చేస్తున్నారు. అవన్నీ మీరున్నూ చదువుతూనే వుంటారు. గనుక యిందులో తిరిగి ఆ విషయాలు వ్రాయదలచుకోలేదు.

కాని నావ్యాసంమీద వచ్చిన జవాబులన్నిటిలో నాకు నచ్చినది ఒక దద్దనాల రంగనాయకమ్మ (బొమ్మిడి) గారిదే. వారు నాతో ఏకీభవించలేమని అంటూకూడా, నా మనోగతాభిప్రాయాన్ని బాగా అర్థం చేసుకున్న రీతిని వారు సలహారూపంగాను, మిగతా రచయితలకు కనువిప్పుగాను ఎంతో విపులంగా, విశదీకరిస్తూ ఎన్నో విషయాలు వ్రాశారు.

"వినదగు నెవ్వరుచెప్పిన వినినంతనె వేగ పడక..." అన్న సుమతీశతక పద్యసారాన్ని బాగా గ్రహించినట్లు యీ గత 5, 6 వారములుగా నావ్యాసంపైని వస్తున్న జవాబులన్నీ చూచి, నాకేకాకుండా, తతిమ్మా సోదరులకుకూడా పనికొచ్చేటట్లు ఒక పెద్ద వ్యాసరూపంలో క్షుణ్ణంగా జవాబు యిచ్చారు.

నాతో వారు ఏకీభవించలేనట్లు వ్రాసినా నాతో ఏకీభవించే హంశాలు అందులో ఎన్నో వున్నకారణంచేత, నన్ను ముఖ్యాతికభాగం అర్థంచేసుకుని వారు వ్రాసిన హంశాలతో నేను ఏకీభవిస్తున్నాను. ఏకీభవిస్తున్నానని వ్రాసినంతమాత్రంలో నాకేమీ చిన్నతనం లేదు.

మరొక్క విషయం. అగ్రహించకండేం!

పెద్దచదువులు కావాలనే ఆశయాలుగల బిడ్డల తండ్రులపాట్లు వివిధంగా వుంటాయో అవివారికి తెలిసినట్లు మిగతా అందరికీ తెలియవు. అంత చదువు చదివిన కూతురికి అంతకంటె హెచ్చు చదివిన అల్లుడ్ని సంపాదించే విషయాలలోను, వారికివ్వవలసిన పెద్ద పెద్ద కట్నాలు లాంఛనాల విషయంలోను, ఎన్నో కుటుంబాలు చితికి పోతున్నాయంటే ఆశ్చర్యంలేదు. ఇది యథార్థం. అందరికీ అనుభవం కూడాను.

పెద్ద చదువులు చదివిన స్త్రీలను భార్యలుగా బడసిన భర్తలుపొందె ఆనందంకంటె, దుఃఖమే హెచ్చుగా గోచరిస్తోంది. బి. ఏ. చదివిన భార్యల జూచి M. A చదివిన భర్తలు ఓర్వలేక ఏడుస్తున్నారు గాబోలు అని కొందరు అనవచ్చును. ఏడ్చినా ఏడవకపోయినా చీటికి మాటికి ఎదురు జవాబులు రావడం, ప్రతి దానికి తర్కంతో తమతమ విశాల స్వాతంత్ర్యేచ్ఛా భావాలను వ్యక్తపరచడం, భర్త యొక్క ప్రతి ఆశయానికి తన ఆశయాన్ని కూడా జోడిస్తూ (తనుకూడా మరి బి. ఎ. చదువుకుంది గదూ!) దానికి వ్యతిరేకించినప్పుడు నీ లెక్కేంతపోదూ, నా బ్రతుకు నేను బ్రతకగలననే భరోసా జవాబుతో కలతలు తెచ్చుకొని, ఒకరికి ఒకరు దూరమైన సందర్భాలు ఎన్నోవున్నాయి. పెద్దచదువుల వల్ల పెడ అర్థాలు తీసుకొని, ఒకరి తెలివిని ఒకరు వోలక పోసుకుంటూ, ఒకర్ని ఒకరు లక్ష్యపెట్టాలనే భావం నశించి అదోరకం కుటుంబాలు తయారవుతున్నాయి. యథార్థం వ్రాయడానికి జంకేమతం నాది కాదుగనుక యింతగా వ్యక్తపరుస్తున్నందుకు క్షమించాలి.



(బరంపురం)


తాజాగాను, సువాసనగాను ఉండును



పంకజ్ శాండల్
టాయిలెట్ సోపు

శరీరమును కోమలముగాను, అందంగాను, పదునుదనంగాను ఉంచును




పంకజ్ సోప్స్ & ఆయిల్ మిల్స్, కొచ్చిన్.

#  మనిషిలో మనిషి 

(16-వ పేజీ తరువాయి)

దీని అర్థమేమిటో చెప్పు మావయ్యా!

గురవా: అదేమిట్రా పిచ్చివేషం! ఎవడన్నా తల్లకిందులుగా నుంచుంటాడూ?

రఘు: అంటే జీవితం చాలా బ్యూటిఫుల్ గా వుందన్నమాట మావయ్యా!

[సరళ వస్తుంది]

సరళ: నేను రెడీ అబ్బాయ్. మిగతా గ్లాసులూ డ్రింకులూ అన్నీ సర్దిపెట్టాను. పట్రండి.

రఘు: రారా రాజా. [రఘు, శేఖర్ లోపలికి వెళ్తారు.]

సరళ: (టేబులు సర్దుతూ) అమ్మయ్య-ఇప్పటకైంది.

గురవా: చూడమ్మా—కాస్త గంద్రగోళంగా వుంది—అసలు పెళ్లికూతురవి నువ్వేనా?

సరళ: అవును. [గురవాచారి పెద్ద భారం దిగినట్టు నిట్టూరుస్తాడు.]

నిజం చెప్పాల్సొస్తే అవునూ కాదూ కూడానూ!

గురవా: (తెల్లబోయి) అవునూ కాదూ కూడానా? నిజంగా నాకు పిచ్చెక్కిపోతోంది!.. .అంటే పెళ్లి కాబోయే మాట నిజమే గాని ఇంకా పెళ్లికూతుర్ని చేయలేదనా?

సరళ: ఊఁ—అఁహాఁ—

గురవా: ఊఁ—అఁహాఁ—?

సరళ: పెళ్లికూతుర్నే గాని అతన్ని కాదు నే పెళ్లి చేసుకునేది....ఇదుగో—ఇలా అన్నానని అతనితో అనకండేం?

రఘు: (లోపల్నుంచి) రాణీ! షుగర్ డిష్ ఏది?

సరళ: వచ్చే వచ్చే. [లోపలికి వెళ్తుంది. వెళ్తూ వెళ్తూ గుమ్మంలో వెకిలిగా పిచ్చి నవ్వొకటి నవ్వి పోతుంది].

లోపల్నుంచి పకపకలూ వికవికలూ విని పిస్తయ్.

గురవాచారి గాభరాపడిపోయి గొడుగూ పంచీ చంకన పెట్టుకుని ఓసారి సవిషాదంగా లోపలివైపు గుమ్మంకేసి చూసి బైటికి వెళ్ళిపోతాడు. రఘు, శేఖర్, సరళ తలో వస్తువూ పట్టుకుని వస్తారు]

రఘు (అటూ యిటూ చూసి) మావయ్యేడీ?...వెళ్ళిపోయాడేమిటి?

సరళ: ఇంతకు ముందిక్కడేవున్నాడు. (సోఫావెనక చూస్తుంది)

శేఖర్: అసలు నువ్వు రాణీని పెళ్ళిచేసుకుంటున్నట్టు ఎందుకురా చెప్పావ్ ఆయనతో?

రఘు: రాజా! మైడియర్ రాజా! వీడు మావయ్యకీ ఒక్కటే తేడా! నువ్వొచ్చినప్పుడల్లా నాకిదివరకే తెలిసిన విశేషం యేదో చెప్పడానికి వస్తావు. మావయ్య వచ్చినప్పుడల్లా ఓ యిరవై లక్షలు అప్పడగటానికి వస్తాడు?

శేఖర్: ఐతే?

రఘు: ఇవ్వాళ మా మావయ్యని బోలా కొట్టిద్దామనుకున్నా. మనమంతా ఏదో పెళ్లి హడావుడిలో వున్నట్టు నటిస్తే అడగలేక వూరుకుంటాడుగదా అని ఈ ప్లాను వేశాను. బ్రహ్మాండంగా పని చేసింది చూశావా - చెప్పకుండా వెళ్ళిపోయాడు - ఇంకెవడు దొరకుతాడా నెత్తిన చెయ్యిపెట్టడానికని!

శేఖర్: ఏడిసినట్టుంది.

రఘు: అదేమిట్రా?

శేఖర్: ఈపూటకు నెత్తిన చెయ్యి పెట్టడం ఐపోయిందిలే.

రఘు: నీ నెత్తిన పెట్టాడేమిట్రా కొంపతీసి?

శేఖర్: ఆహా. [రఘు, సరళ నవ్వుతారు]

రఘు: ఏమాత్రం? ఇరవై లక్షలు?

శేఖర్: మీ రెవళ్లూ లేకుండా చూసి—!

సరళ: అయ్యో నా పిచ్చిరాజా!

శేఖర్: ఇంట్లో సొమ్మంతా తీసుకుని పెళ్లాం లేచిపోయిందని చెప్పాడు!

రఘు (పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వి) పొట్టివాడికి పుట్టెడు బుద్ధులు! మా మావయ్యకిరాని ఆపదంటూ ఈ ప్రపంచంలో లేదు.

శేఖర్: ఐతే మీ అత్తయ్య లేచి పోవడం—

రఘు: అది ఎక్కడికీ పోతుందిరా. ఏ వాళ్ళ తమ్ముడిగారింటికో ఏ పేరంటానికో పోయివుంటుంది. (టేబుల మీద చూసి) అరె—గ్రేప్ జూస్ ఏదిగా?

సరళ. అదెక్కడుంది?

రఘు: చూడనేలేదామీరు? పారసీకం నుంచి ప్రత్యేకంగా వస్తే! [లోపలికి వెళ్తాడు.]

శేఖర్: రాణీ! చాలా దారుణం జరిగి పోయింది.

సరళ: ఏమిటది?

శేఖర్: ఈ పెళ్లి అయ్యేది కాదు.

సరళ: ఏమిటి?

శేఖర్: లిలీ వెళ్ళిపోయింది. అది వాళ్ల మేనత్తకొడుకుని ప్రేమిస్తోందట! అతన్నే పెళ్లి చేసుకుంటుందట!

సరళ: (నోట మాట రాక తెల్లబోయి చూస్తుంది.)

శేఖర్: అవున్రాణీ, బాబీతో నన్ను చెప్పమంది సంగతంతా.

సరళ: ఏమని చెప్పావ్?

శేఖర్: అదే నాకూ ఏంతోచడంలేదు. చెప్పకపోతే వీడేమో దానికోసం తెల్లవార్లూ కనిపెట్టుక్కూర్చుంటాడు.

[ఆమెముందు మోకరిల్లి ఆమె మోకాళ్ల మీద చేతులుంచి—]

నువ్వు...పోనీ నువ్వు చెప్పరాణీబాబీతో.

రఘు: (లోపల్నుంచి) హో రేయ్—వన్నాదిలేసి మొదలెట్టకండ్రోయ్ వచ్చేస్తున్నా.

సరళ: నేనా? నావల్లకాదు బాబూ.

శేఖర్: పోనీ... నేను ఫోన్ చేసి చెప్తే?

సరళ: ఫోనా?

శేఖర్: ఏదో పనుందని బైటికెళ్ళిపోయి ఏ హోటల్లోంచో ఫోన్ చేసి చెపాను.

సరళ: అలా ఎందుకు? ఇక్కడే వుండి చెప్పరాదూ?

శేఖర్: లేదు రాణీ. ఈ కబురు విని వీడేమై పోతాడో నేను కళ్ళారా చూడలేను. అసలు వాణ్ణి ఎదురుగుండా పెట్టుకుని చెప్పడానికి నాకు నోరు పెగల్దు. నేను ఫోన్ చేసేటప్పటికి నువ్వెలాగూ ఇక్కడే వుంటావు కాబట్టి ఏదో చెప్పి వాణ్ణి సముదాయించగలవ్ కూడానూ!.. ఏం?

[రఘు వస్తాడు. అతడి చేతిలో వెండి బకెట్ ఒకట వుంది. అందులో ఐస్ లో పెట్టిన షాంపేన్ బాటిల్ వుంటుంది.]

రఘు: పారసీకం నుంచి ప్రత్యేకంగా పంపించాడు నా ప్రియమిత్రుడొకడు. ద్రాక్షతోటల దివ్యరసాయనం! నీహార ప్రవాహ తుషార శీతల పానీయం!...మంద మంద మలయానిలంలా - రమణీ ప్రియ దూతిక తెచ్చియిచ్చిన కప్పురపు విడెంలా-ప్రియాంగుళీకపోష్ణ స్పర్శలా.. హ్హా హ్హా హ్హా- రాణీకి చక్కని సబ్జక్ట్ పొయిట్రీ రాయడానికి!

[బకెట్ టేబుల మీద పెడ్తాడు.]

ఏం తోడు పెళ్ళికూతురా!— ఏం రా తోడు పెళ్ళి కొడుకా! సంతోషంగా వున్నారా అంతా? హృదయాలు చిందులు తొక్కుతున్నాయా? పెళ్లికొడుకు సంగతి చెప్పనే అక్కరేదులే. ఆనందం రూపం దాల్చింది. వుండండుండండి-అలానే! (ఫొటోతీసినట్టు నటించి) దట్సెట్! థేంక్యూ! మనందరం ఇవ్వాళ ఇక్కడ కూడటం చాలా ముదావహంగావుంది. యాభై పున్నమల వెన్నెల్లావుందివ్వాళ! లిల్లీ...పాపం తన పెళ్ళింగుకు తనుకూడా వుంటే ఎంత బాగుండును! తప్పకుండా వుంటేదికూడానూ. ఆ చుట్టాలెవళ్ళో ఎమర్జెంటుగావచ్చి పడకపోతే!

[శేఖర్ లేచి లోపలికి వెళ్ళబోతాడు]

ఏమిట్రా-ఏం-వొంట్లో బాగులేదా?

శేఖర్: అఁహాఁ-అబ్బే-ఇప్పుడే వస్తాను. లోపల పంపుతిప్పకుండా వచ్చినట్టున్నాం.

సరళ: (శేఖర్ కు సౌజ్ఞలుచేస్తూ రహ-

శ్యంగా పిలుస్తున్నట్టు) రాజూ!...

[శేఖర్ లోపలకు పరుగెత్తుకు పోతాడు]

రఘు: మనిదరం ఒంటరిగానే పూర్తి చెయ్యాలి రాణీ ఈ పూట విందు! ఇవ్వాళ మన అతిథులందరూ కూడా అదోరకంగా ప్రవర్తిస్తున్నారు కదూ? నాతోడు పెళ్ళికొడుకు మరీనూ...నీకో సంగతి చెప్పనా రాణీ? నాకు జోస్యంవచ్చు—వాడు మరి తిరిగిరాడు!

సరళ: వాట్? [రఘువంక తెల్లబోయి ఏం అర్థంకాక చూస్తుంది. సీన్ చివరిదాకా అలానే చూస్తూంటుంది.]

రఘు: అవును. నా బెడ్‌రూం తలుపు తెరిచి టెర్రేస్ పక్క మెట్లు తడవకి నాలుగు చొప్పున దూకి వీధిలోపడివుంటాడీపాటికి! వాడు చాలా చిత్రమైనతోడు నాకు! నా జీవితానికి...నా ప్రేమకి—నా పెళ్ళి ప్రధానానికి—చివరికి నా లిల్లీకిచ్చిన ఫేర్‌వెల్‌కు కూడా తోడుగా నిలబడ్డాడు...పాపం!

సరళ: ఫేర్‌వెలా?

రఘు: అవును రాణీ. లిల్లి నాజీవితం లోంచి తప్పుకుపోవడం కళ్ళారా చూశాడు రాజు!

సరళ: బాబీ!

రఘు: వాడైనావుంటే ఎంతో బాగుండు ననుకుంటున్న ఈ క్షణంలో వాడుకూడా వెళ్ళిపోయాడు!...నీతో చెప్పాడు... కదూ?

సరళ: ఏమిటి?

రఘు లిల్లీ ఇహ తిరిగిరాదని!

సరళ: కాని...నీకు...నీకెలా తెలిసింది?

రఘు: నాలుగు రోజుల్నించీ వరసగా పిల్చినా నాతో డిన్నరుకి రావడంలేదు. అసలిక్కడికి రావడంకూడా తగ్గించింది. వాళ్ళొచ్చారనీ వీళ్ళొచ్చారనీ ఏవో ఎంగేజ్‌మెంట్సనీ తప్పించుకు తిరుగుతోంది. అసలు ఇంకెవరితోనో కాలంగడపాలని అనిపించినప్పుడుగాని నన్ను తప్పించుకుపోదు సామాన్యంగా. ఈసారి కొత్తసాహసం చాలా సీరియస్‌గా పోతోందనిపించింది నాకు. అందుకని పెళ్ళనీ ప్రధానమనీ ఇదంతా గబగబా ఏర్పాటుచేశాను. అది పెళ్ళి చేసుకోవాలనుకునేవాళ్ళు ఇంకెవళ్ళో వుంటే తప్ప నన్ను వదిలించుకుపోదు!...వెల్...తేలిపోయింది. అది ఎవర్నో ప్రేమిస్తోంది. లేకపోతే వెళ్ళేదేకాదు. ఎప్పుడో తిరిగిరాకపోదు గాని ఇప్పట్లోకాదు...ఇవ్వాళ రాత్రికి అసలే రాదు.

[దూరంగా ఎక్కడో ఎకార్డియన్ మొదలై ఈ అంకం చివరిదాకా మృదువుగా మోగుతూంటుంది]

ఏంరాణీ—నీకు చాలా ఆశ్చర్యంగా వున్నట్టుంది! అబ్బే—ఇందులో ఆశ్చర్యం ఏముంది? ఒక్కొక్కసారి కొన్ని కొన్ని సమస్యలకి ఇట్టే సమాధానం గోచరిస్తూంటుంది. (తలమీద తడుముకుంటూ) ఈ బొప్పిలో వుందనుకుంటాను మహాత్యం!

[టెలిఫోన్ మోగుతుంది]

రాజు అనుకుంటాను.

[మళ్ళీ మోగుతుంది]

సరళ: అదెలా తెలుసు నీకు?

రఘు: నాకిదివరకే తెలిసిన సంగతొకటి చెప్పడానికి ఫోన్ చేస్తున్నాడు. అది వాడి అలవాటేలే.

[టెలిఫోన్ మళ్ళీ మోగుతుంది]

సరళ: మాటాడవా మరి.

రఘు: అనవసరమనుకుంటాను.

[మళ్ళీ ఫోన్ మోత. రఘు లేచి రిసీవరుతీసి పక్కన పెడతాడు. మళ్ళీ వచ్చి కూర్చుని షాంపేన్ సీసా తెరిచి గ్లాసులో కొంత వొంపుకుని గ్లాసు ఎడంచేత్తో పట్టుకుని కుడిచేత్తో పళ్ళెంలోని ద్రాక్షపళ్ళగుత్తి ఒకటి తీసి సరళకేసి చేజాచి అనుద్విగ్నంగానే...]

ద్రాక్షపళ్ళంటే నీకిష్టమేనా రాణీ?

—తెర—

[ఇంకా వుంది]


## మీకు అవసరమైన ....

ఆంధ్ర మెట్రిక్యులేషన్, ప్రీ యూనివర్సిటి, బిఏ, బిఎస్‌సి., లా అండ్ లిటరేచర్ పుస్తకములకు మాకు వ్రాయండి.

వైజాగ్ బుక్ హౌస్, వైజాగ్.





"ఏడి ధైర్యం మండిపోనూ! లోడితెదుకారుకదా అది—అంత వేగంగా పడపడమే! బుద్ధి చెబుతాను వెధవాయ్‌కి!"

# ప్రాణం పై తీపి

గొల్ల పల్లెలోన ఒకడు
గొల్లపిల్లవాడు గలడు;
గొర్రెలమందను మేపుచు
గడపును ప్రతిరోజు వాడు.

నదికావల వనములోన
పొద లున్నవి; వాటి నడుమ
సంచరించు సింహ మొకటి
సంహరించు జంతువులను.

ఒకనాడా పిల్లవాడు
చీకటిపడబోవు వేళ,
మందను మరల్చి నింటికి
తొందరగా చేరబోయి—

పోబోతూ మందలోన
పోతు ఒకటి కనిపించక
బెంగపడెను పిల్లవాడు,
రంగుమారె వాని మొగము.

"కనిపించని గొర్రెపోతు
కనిపించిన నాకు మరల,
బలిసిన గొర్రెల రెంటిని
బలిగా నేనిచ్చెద"నని

గుడిలోపల అమ్మవారి
స్మరియిస్తూ భక్తిమీర—
చేరువలో గుట్టనెక్కి—
దూరముగా కలయజూచె!

దూరములో పొద దగ్గర
తీరికగా కూరుచుండి
మృగరాజము మెక్కుచుండె—
మృతిచెందిన తన గొర్రెను!

అది చూచిన గొల్లవాడు
అదిరిపడెను భయముతోడ—
కనిపించని పోతుజాడ
తనకేమీ వలదటంచు—

"మృగరాజముచేత నేడు
మృత్యుబాధ లేకుండా,
కాపాడుము నన్ను ముందు,
కన్నతల్లి! పరాశక్తి!"

అని భయమున ప్రార్థించుచు
తన ప్రాణము గాచుకొనగ
దూరపు తన యింటికేసి
పరుగు తీసె నా గొల్లడు!

★ సి. డి. యస్. రామయ్య ★



# జితేంద్రియుడు

వసిష్ట మహాముని చేత అవమానింపబడిన విశ్వామిత్రుడు తను వసిష్టుని చేత 'బ్రహ్మర్షి' అనిపించుకోవలెనని తలచి, దక్షిణ దిక్కునకు పోయి అక్కడ అతికఠిన నియమాలతో తపస్సు ప్రారంభించాడు. విశ్వామిత్రుడు బహుకాలము తపస్సు చేసిన తరువాత బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయి "నువ్వు రాజర్షి వయ్యావు" అని అదృశ్యుడైనాడు. తన తపస్సునకు యిదేనా ఫలమని నిరుత్సాహపడి పశ్చిమము వైపునకు వెళ్లి అచ్చట తిరిగి ఘోరమైన తపస్సు చేయడం ప్రారంభించాడు.

అతడు తన పదవిని ఎక్కడ కోరుతాడో అని దేవేంద్రుడు భయపడి మేనకను ఆ తపస్సును విఘ్నం చేయమని పంపించాడు. విశ్వామిత్రుడు మేనకను చూచి మోహించి ఆమెతో ఒక సంవత్సర కాలం గడిపాడు. తరువాత తను చేసిన తప్పు తెలుసుకొని, పశ్చాత్తాపముతో ఉత్తరమున హిమాలయములకు వెళ్ళి తిరిగి కఠోర దీక్షతో తపస్సు ప్రారంభించాడు.

ఈ సారి కూడా దేవేంద్రుడు ఆ తపస్సును చెడగొట్టాలనే తలపుతో రంభను పంపించాడు. మొదట రంభ ఆ మునీశ్వరుని దగ్గరకు వెళ్లుటకు భయపడింది. కాని దేవేంద్రుని ప్రోద్బలముచేత విశ్వామిత్రుని దగ్గరకు వెళ్లింది. దేవేంద్రుని మహిమ వలన అది వసంతకాలము కాకపోయినా చెట్లు చిగురించాయి. కోకిలల కుహూకుహూ రావములను విని విశ్వామిత్రుడు కళ్లు విప్పి ఎదురుగా ఉన్న రంభను చూశాడు. ఇది అంతా దేవేంద్రుని మాయ అని తెలిసికొని రంభను రాయిగా మారిపొమ్మని శపించాడు. కాని వెంటనే తను ఇంకా కోపాన్ని అరికట్టలేక పోయానని విశ్వామిత్రుడు తెలుసుకొన్నాడు. వెంటనే అచ్చట తపస్సు మానివేసి తూర్పు దిశగా వెళ్ళాడు.

ఎస్. ఉదయభాస్కర దుర్గాభవాని ప్రసాద్

అచ్చట కొంతకాలం కఠోర తపస్సు చేశాడు. అపుడు బ్రహ్మ ప్రత్యక్షమయి 'నీవింకా జితేంద్రియుడవు కాలేదు. ఇంకొంతకాలం తపస్సు చేయవలసినది' అన్నాడు. విశ్వామిత్రుడు తిరిగి తపస్సు ప్రారంభించాడు. మహోగ్రమైన ఆ తపస్సులో అతడు కామక్రోధాల్ని దరిచేరనీయలేదు. ఎన్ని ఆటంకాలు వచ్చినా చలించలేదు. ఆయన తపోగ్నికి ముల్లోకాలు దహించుకు పోయే పరిస్థితి ఏర్పడింది.

ఇంద్రాది దేవతలు, మునులు, ప్రజలు గగ్గోలు పడినారు.

బ్రహ్మకిక తప్పలేదు.

విశ్వామిత్రుని తపస్సు ఫలించింది. బ్రహ్మ ప్రత్యక్షమయి "నిన్ను అంతా బ్రహ్మర్షిగా పరిగణిస్తారు' అన్నాడు. దానికి విశ్వామిత్రుడు 'మీరు నన్ను బ్రహ్మర్షి అంటే నాకు సంతృప్తి కలగదు. నన్ను వసిష్టునిచేతకూడా బ్రహ్మర్షి అనిపించవలసింది. అని కోరాడు. బ్రహ్మ "నిన్ను వసిష్టుడుకూడా బ్రహ్మర్షిగానే గౌరవిస్తాడు" అని అంతర్ధానమయ్యాడు.

అపుడు విశ్వామిత్రుడు సంతోషంతో వసిష్టుని ఆశ్రమమునకు బయలుదేరాడు. "ఓ రాజర్షీ, నీకు స్వాగతం" అన్నాడు వసిష్టుడు. విశ్వామిత్రునికి కోపం వచ్చింది, తనను 'బ్రహ్మర్షి' అననందుకు "నీ పెద్ద కుమారుడు మరణించు గాక" అని శపించాడు. వశిష్టుని నూర్గురు కుమారుల్లోను ప్రథముడు మరణించాడు.

తన తపశ్శక్తిలో కొంతభాగం ఇలా నష్టమైంది గనుక తిరిగి తపస్సు చేసి మళ్ళీ వసిష్టుని ఆశ్రమానికి వచ్చాడు. ఈ సారికూడా 'రాజర్షీ'


Ravi Inks




రవి ఇంక్స్

రోఖ బహుమతులతో అన్ని క్వాలిటి పెన్నులకు ఉపయోగమైనవి.

సోల్ ఏజంట్లు :

న్యూస్టార్ & కో.,
మద్రాసు-21.

SWASTIK



# ఫ్రూట్ ప్యూరె చేయు క్రొత్త విధానము

1 పౌను పళ్లు (గూస్‌బెర్రి పళ్లు, దూమిళ్లు మొదలైనవి) ¼ పైంట్ బ్రౌన్ అండ్ పాల్సన్ కస్టర్డ్ పౌడరుతో తయారు చేయబడిన కస్టర్డ్ రుచికోసం చక్కెర ¼ పైంట్ క్రీము.

పీటితో పళ్లగుజ్జును తయారుచేసి ¼ పైంటు నీళ్లి పోసి పలుచగా అగువరకూ ఉడుక బెట్టవలెను దానిని వడపోసి, రుచికోసం చక్కెర చేర్చవలెను చల్లారిన తరువాత, ఈ పళ్లప్యూరెను ¼ పైంటు కస్టర్డ్ పౌడర్ కలుపబడిన ¼ పైంటు క్రీముపేసి బాగా గిలకొట్టవలెను

## ఆరోగ్యమునకు సులభ సాధనం

పిల్లలందరూ మీగడవంటి, రుచియైన, ఆరోగ్యకరమగు కస్టర్డ్‌ను ఇష్టపడుదురు. అది ఆరోగ్యమును గలిగించు పాలతో నిండియున్నది. బ్రౌన్ అండ్ పాల్సన్ కస్టర్డ్ పౌడర్ శుద్ధమైన కాయగూరలనుండి తయారుచేయబడినట్టిది అని జ్ఞాపకముంచుకోండి మీరు సరకులను కొనుటకు బజారుకు వెళ్లినప్పుడు, బ్రౌన్ అండ్ పాల్సన్‌చే తయారుచేయబడిన ఇతర రకముల పదార్థములైన — రైస్లీ, పేటెంట్ కార్న్‌ఫ్లవర్, బ్లమాంజ్ కోసం చూడండి.




**ఉచిత** ఉల్లాసకరమైన కొత్త ఫలహారముల పుస్తకము కోసం దిగువ ఫారమ్‌ను పూరించి పంపండి.

దయచేసి నాకు మీ ఉచిత ఫలహారముల పుస్తకమును ఇంగ్లీషు/హిందీ/తమిళం భాషలో గలది పంపండి
(మీకు అక్కర్లేని భాష పదమును కొట్టివేయండి)

నా పేరు ..............................................

చిరునామా ..............................................

..............................................

నేను 15 నయాపైసల తపాలా బిళ్లలను, తపాలా ఖర్చులనిమిత్తం ఇంథుతో జతపర్చాను.

డిపార్టుమెంటు కార్న్ ప్రొడక్ట్స్ కొ. (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్,
- APW-6 పోస్టు బాక్స్ నం. 994, బొంబాయి-1.



కార్న్ ప్రొడక్ట్స్ కొ., (ఇండియా) ప్రయివేట్ లి.,

ఏజెంట్లు : పారీ అండ్ కొ. లిమిటెడ్,


అనే పిలిచాడు వసిష్ఠుడు. అందువలన విశ్వామిత్రునికి కోపము వచ్చి వసిష్ఠుని రెండవ కుమారుణ్ణి కూడా చనిపొమ్మని శపిస్తాడు.

ఇలా తొంభైతొమ్మిది మంది కుమారులూ చనిపోయినా కూడా వసిష్ఠ మహాముని చలించలేదు.

నూరవసారి వచ్చి విశ్వామిత్రుడు 'రాజర్షి' అనిపించుకొని, ఇంక ఒక్కడే కొడుకు గదా బ్రతికింది, అతనినైనా కరుణిద్దామని తలచి వెళ్లబోయాడు. ఇంతలో "బ్రహ్మర్షీ" అనే కేక వినపడింది. విశ్వామిత్రుడు వెనుకకు తిరిగి చూశాడు. వసిష్ఠుడే తనను 'బ్రహ్మర్షీ' అని పిల్చాడని తెలుసుకున్నాడు.

అపుడు విశ్వామిత్ర మహర్షి వసిష్ఠుని అడిగాడు: "నువ్వు మొదటనే, నన్ను బ్రహ్మర్షీ అని ఎందుకు పిలవలేదు. అపుడు లేని మహిమ యిపుడు నాలో ఏమున్నది? నువ్వు తొంభైతొమ్మిది కుమారులను నాశనము చేసుకొన్నావు.

అందుకు వసిష్ఠుడు నవ్వి 'నిన్ను పరీక్షించటానికే నేను బ్రహ్మర్షి అని పిలువలేదు. నీవు తొంభైతొమ్మిదిసార్లు కోపముతో నా కుమారులను నీ మహిమచేత చంపి వెళ్లినావు. కాని నూరవసారి మాత్రము క్రోధాన్ని అణచుకున్నావు. అందువల్లనే మొదట నిన్ను బ్రహ్మర్షి అనలేదు. చివరసారి నీ శాంతమే నిన్ను 'బ్రహ్మర్షి అనిపించింది,' అన్నాడు.

అపుడు విశ్వామిత్రుడు సంతోషించి వసిష్ఠుని కుమారులను తన తపశ్శక్తిచేత పునర్జీవితులుగా చేశాడు. ★



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'ఇల్లరికం' చిత్రం గత వారం 17 కేంద్రాలలో శతదినోత్సవాలు జరుపుకొంది. నటనటులూ, రచయిత ఆరుద్ర, దర్శకుడు ప్రకాశరావు మొదలగువారంతా ఉత్సవాలకువెళ్ళి కృతజ్ఞతాభివందనాలు తెలియజేశారు. విజయవాడ మారుతీసినిమాలో జరిగిన సభలో గిరిజ, జమున, ఎ. నాగేశ్వరరావు, మారుతీసినిమా అధిపతి శ్రీ శ్రీనివాసరావు, నటుడు రంగారావు, నవయుగ ఫిలింస్ అధిపతి శ్రీ శ్రీనివాసరావు, దర్శకుడు తాతినేని ప్రకాశరావు, గుమ్మడి, జమునతండ్రి ఎన్. శ్రీనివాసరావు. కుడిచివర నిలచినవారు నిర్మాత అనుమోలు సుబ్బారావు

# వార్తావరణం

"ఇదెక్కడి న్యాయమండీ" అన్నారు ఎన్. టి. రామారావు

* * *

రామారావు మాట్లాడుతున్నది సినీకాల చక్ర న్యాయం గురించి. స్టార్ వాల్యూ ఉందనుకున్న నటనటులూ టెక్నీషియన్‌లూ స్టార్ వాల్యూ మనుషులుగా సినీలోకుల దృష్టిలో స్థిరపడాలంటే, కాల్‌షీటుకు సాధ్యమైనంత ఆలస్యంగా రావటం మంచిదని ఫాషన్ అనీ చాల మంది నమ్మకం. బొంబాయిలో అది సినీ జనధర్మం. ఎవరైనా పెందరాళే వస్తే వెర్రిబాగులవాడని నవ్వుకుంటారట. తమిళ సినీ రంగంలోనూ అంతే. తెలుగులో కూడా అందరినీ అది నవ్విస్తుందట. తెలుగు సినిమాలో కష్టసుఖాలు ఎరిగినవారూ, కష్టాలను మరచిపోనివారూ కొందరున్నారు. ఈ బాధ్యులు (రామారావు, నాగేశ్వరరావు, అంజలీదేవి, సావిత్రి) కాల్‌షీట్ ఏడింటికంటే ఏడింటికే రెడీ అయి కూర్చుంటారు. గ్లామర్ హీరోలు అయినా గ్లామరస్‌గా ఆలస్యంచేయడం ప్రొడ్యూసరు డబ్బు నిష్కారణం వృథా చేయించడం వీళ్ళకి నచ్చలేదు. వీళ్ళకి స్వారస్యం తెలిసిందికాదని మిగతావారు (అన్ని రంగాలలోనూ) శిక్షించవలసిన లేకుండా ఈ సత్సంప్రదాయాన్ని నిలబెట్ట, ఆంధ్రులు ఎంగువా ఏ ప్రాంతం వారికీ తీసిపోరని ప్రతి కాల్‌షీట్‌కు ఋజువు చేస్తున్నారట. ఈ విధంగా వారు విధ్యుక్తధర్మపరిపాలన చేస్తూ ఉంటెగా మరోకవంక పెద్దనటులు, ఇతర చిన్ననటులు కొందరో కొందరు దర్శకులూ పెందరాళే వచ్చి కూర్చుని వేచి చూచి చూచి ఈసారి ఈ పద్యగీతాన్ని జ్ఞాపకం చేసుకునే పరిస్థితి ఏర్పడుతోంది.

ఇంతమంది పాటించారు తమరాకకై ఎదురు చూడడం ఒక్కొక్కసారి పైన చెప్పిన సత్సంప్రదాయ సంరక్షకులకు ఇబ్బంది కలిగించవచ్చు.

అందువల్ల ఇవన్నీ చూసిన ఒకరు "ఈ క్షోభంతా ఎందుకు? కొందరు పెందరాళే రానేలా? ఆలస్యంచేసే వారికై విరహగీతాలుపాడనేల? టైమ్ వేసని అనుకోనేల? అసలు టైమ్ రిలేటివ్ గదా! ఏమైనా కూడా ఆలస్యంగా వచ్చేస్తే అందరికీ హాయిగదా" అని గంభీరంగా సమస్యని పరిష్కరించారట.

గతవారం వాహినీవారి 'బండరాముడు' సెట్ మీద విరామకాలంలో ఈ సమస్య ప్రస్తావనకి వచ్చినప్పుడు రామారావు ప్రభృతులు ఈ ధోరణి గురించి ఆందోళన వ్యక్తం చేశారు.

ఒక ప్రొడ్యూసరు దగ్గర ఒక చిత్రంలో పనిచేస్తామని ఒప్పుకుని ఆయన ఇచ్చే డబ్బు తీసుకుని—మీరు కోటీశ్వరులూ, మహాఘనతవహించిన ప్రభువులూ అయితే కావచ్చు—పనిచేయడానికి ఒప్పుకున్నాక ఇలా ఆలస్యంచేసి నిర్మాతని క్షోభపెట్టడం ఏమంత భావ్యమైనపనీ?

"ఇదెక్కడి న్యాయమండీ? పైగా పెందరాళే వచ్చేవాళ్లు అంత పెందరాళే రావడమేమిటని తప్పుపట్టుకోవడమా?" అన్నాడు రామారావు.

* * *

సావిత్రి వచ్చింది.

ఎవరో లేచి ఓ కుర్చీ చూపబోయారు. నిర్మాత డి. బి. నారాయణకూడా రండి అంటూ కుర్చీ చూపించారు.

ప్రొడ్యూసరుగారి మర్యాద అందులో వసం మా విధ్యుక్త ధర్మం అంటూ ఆ కుర్చీలో కూర్చుండావిడ.

"ఈ మట్టుకెక్కుల అద్భుతమైన కాఫీ ఉంది ఒక్కకప్పు తీసుకుంటారా?" అన్నారొకరు.

"నేను బుద్ధిగా మా యింటి దగ్గర్నుంచి మరీ చెంబులో మంచికాఫీ తెచ్చుకున్నాను. నస్యంగుకు పాడుచేస్తారు. నా మీద మీకెందుకంత కోపం?" అది సావిత్రి నవ్వుతూ.

అంతలో దర్శకుడు ఎ. పుల్లయ్యగారు వచ్చి షాట్‌కి అంతా రెడీ అవుతోంది బయలేరండి అంటూ కూర్చున్నారు.

పది నిముషాలలో లైటింగ్ రెడీయే లోగా ఆయన దారాసింగ్ రెజ్‌లింగ్ విశేషాలు సాధ్యమైనంతవరకు సేకరించేసి జరిగినవి నెవ్వి చేసుకున్నారు. సాయంకాలం గినాథ ఎమిషీంచేసి షాట్‌కి హాజరుకావాలని ప్రతిభాశాస్త్రితో జాయింటుగా సుట్ర చేసుకున్నారో అన్నారు.

* * *

సెట్ (వాహినిలో రెండోఫ్లోరు) రాముడనే దొంగతాలూకు స్వగ్రసీమ (గృహసీమ కదా!) సావిత్రిపేరు గౌరి. దొంగలక్కీ బాకీలకీ రౌడీలకీ రాలుగాయలకీకూడా మోడగానే గౌరవం, భయభక్తులు కలిగించే తరహాలో ఉంటుందా అమ్మాయి, సావిత్రి కాబట్టి దూకుడు రవ్వంత తగ్గిస్తారు. ఎలాటి వాళ్ళైనా అత్తా అత్తా అంటూ ఓ పదేళ్ళ పిల్ల ఓ నగలమూట తెచ్చి ఇవన్నీ నీకేనే అంటుంది గౌరి. కొయ్యబారిపోయినా, చలించకుండా ఎక్కడివీ మీ అమ్మిచ్చిందా అంటుంది. పేదపిల్లల అమ్మలదగ్గర సాధారణంగా నగలమూటలు సాకు ఉండే సదుపాయంగాని, వాళ్లు వాటిని అలా ప్రొత్తల మాసంలో కనగల గాయనంగా ఇంటికి పంపి పంచిపెట్టించడంగాని సందర్భపడదు. బహుశా గౌరికి ఏ మంత పరిచయం లేని వాళ్లింట్లోంచి చెప్పకుండా అది ఎవరో పట్టుకొచ్చి ఉండవచ్చు. బహుశా వాళ్లు ఆదమరిచి నిద్రపోతూ ఉంటే తరవాత చెబుదాంలే అనో, చెప్పేదేముంది మన మనుషులేగా అనో మనసుకు సర్ది చెప్పుకుని, ఈ నగలు మన గౌ

# కొందరు సభ్యుల పేర్లు

## (10 వ పేజీ తరువాయి)

(మేపాడు, నెల్లూరుజిల్లా) (267) బొద్దుల మోహనకృష్ణ (బ్రిటగుంట.) (268) సూర్య దేవర సత్యనారాయణప్రసాద్ (తుమ్మ పూడి, గుంటూరుజిల్లా) (269) కొంపెల్ల బాలసుబ్రహ్మణ్యం (అమలాపురం) (270) కొమ్మూరు ఉమాప్రసాద్, (టెక్కలి) (271) మాసిన సుబ్బారావు (జామేడపాడు, తూ॥ గో॥) (272) చిర్రావూరి సీతారామము (పలివెల, తూ॥ గో॥) 273 పరాశరం వెంకట సీతారామాచార్యులు (ఈమని, గుంటూరు జిల్లా) 274. తూబాటి పార్థసారధి (తూబాడు గుంటూరు జిల్లా) 275 ఎర్రంశెట్టి రాధాపరమేశ్వరి (విజయ నగరం) 276 టి సుధాకరరావు (బోయపల్లి రైల్వే గేటు, మహబూబ్ నగర్ జిల్లా) 277. గుడ్లూరు లక్ష్మీసుబ్రహ్మణ్యం (కోటపాగు, గుంటూరు జిల్లా) 278 పసుపులేటి దినకర రావు (గుంటూరు) 279 వెంపరాల వెంకట లక్ష్మి (నర్సీపట్నం) 280. చివుకుల నర సింహప్రసాది (విజయవాడ.)

281. బి. వరదరాజు (హిందూపురం) 282 యద్దనపూడి సాంబశివరావు (ఏలూరు) 283 బంఫకవి వెంకటాచలం (రాజమండ్రి) 284. గుత్తా గాంధి (చాటపర్రు, పశ్చిమ గోదావరి జిల్లా) 285. కస్తూరి వెంకటరమణ (రాజోలు) 286 గరిమెళ్ల సూర్యకుమారి పాశంపూడి తూర్పుగోదావరి జిల్లా) 287. రాంపల్లి సీతారాం (ఏలూరు) 288. తురు మెళ్ళ రాధాకృష్ణమూర్తి (వినుకొండ, గుం టూరు జిల్లా) 289. గణపతిరాజు మైథిలీదేవి (మహబూబ్ నగర్) 290 వి. అనూరాధ (తిరుపతి) 291. జి జయపాల్ (మద్రాసు) 292. వి మురళీధర్ (మద్రాసు) 293. కొట సూర్యకుమారి (కలకత్తా) 294. తాళ్ళ సిద్దేశ్వరరావు (భగేశ్వరము, పశ్చిమ గోదావరి జిల్లా) 295. యు ప్రభావతీ దేవి (గూడూరు) 296. పెంజాల రామప్రసాద్ (చిలకలూరిపేట, గుంటూరు జిల్లా) 297. అన్నాప్రగడ ప్రమీల (తెనాలి) 298 ఎన్ ఆర్. కె చక్రవర్తి (విజయవాడ) 299. మొదలి వెంకటేశ్వర శాస్త్రి (బొంబాయి) 300. ముడుంబై నరసింహం (బందర్)

301. శిష్లా నటరాజమూర్తి (బాపట్ల) 302. అవసరాల వెంకట వీరరాఘవరావు (విశాఖపట్నము) 303. తెన్నేటి ఆశాలత (కిషన్ పురా, వరంగలు జిల్లా) 304. కొత్త చిన భుజంగరావు (సంగం జాగర్లమూడి, గుంటూరు జిల్లా) 305. పి. వెంకటరావు (కరీం నగర్) 306. అంబటిపూడి అన్నపూర్ణ (వల్లభాపురం, గుంటూరు జిల్లా) 307. విరాల రాఘవరావు (రాజమండ్రి) 308. కొణేటి ప్రసాద్ (తిరుత్తణి) 309 టి. భారతి (టి. చదుం, చిత్తూరు జిల్లా) 310. ఘాలి శ్రీనివాసరావు (బాపట్ల) 311. ఏడిద శశిలక్ష్మి (విజయవాడ) 312 మద్దావిడ మరళీశివ రావు (కురదా రోడు) 313. చెన్నూరి వెంకట రమణ కనకబాయమ్మ (మచిలీ పట్నం) 314 శ్రీరాం గంగయ్య (నెల్లూరు) 315 పంచాన పద్మావతి (మద్రాసు) 316. ఎణ్. కుసుమ (మైసూరు) 317 ఉపద్రష్ట వెంకటశాస్త్రి (అమలాపురము) 318. సామ వేదం విజయలక్ష్మి (ఆచంట, పశ్చిమ గోదావరి) 319 తిమ్మరాజు వసుంధర (శ్రీకాకుళం) 320 తుల్లూరి సరోజినీబాయి. (కృష్ణాపురం, ఖమ్మంమెటు జిల్లా).

321. సత్యవరం సవితాదేవి (సత్యవరం, మహబూబ్ నగరం జిల్లా) 322. వి. రాధా కిషన్ రావు (హైదరాబాదు) 323. కోట రంగలక్ష్మీరాజ్యం (మద్రాసు) 324 పోకల మణిమాల (గణపూర్, వరంగల్లు జిల్లా) 325 చదలవాడ, సులక్ష్మి (మద్రాసు) 326. మాటూరి వసంతరావు (దూరిగాం, నిజామా బాదు జిల్లా) 327. మాస్టర్ నవలూరు, సుబ్రహ్మణ్యం (తరిగొండ, చిత్తూరు జిల్లా) 339 కూపర్తి, భారతి (పూనా) 331 కె. రాంచందర్ (హైదరాబాదు) 332 సంకు నీరజ (సికిందరాబాదు) 333. లంక లక్ష్మీనర సింహశాస్త్రి (నర్సారావుపేట) 334. తెలికిచెర హీరా (రాజమండ్రి) 335. దేశ రాజు బాలా త్రిపురసుందరి (చిత్తూరు) 336. చెర శాంతలక్ష్మి (కొకిరు పర్రు పశ్చిమ గోదావరి జిల్లా) 337. డి. సులోచన (నెల్లూరు) 338. గోశేటి పుష్పావతి (పెనుగొండ, ప॥ గోదావరి) 339 కొచ్చెర్ల కోట హేమలత (కొవ్వూరు) 340. పర మాత్ముని గోపాలకృష్ణ (విజయవాడ).

341 జిల్లెళ్ళమూడి సుధాకర మోహనరావు (ఒంగోలు) 342 విష్ణుభొట్ల సుబ్బలక్ష్మి (విజయనగరం) 343. నేతి వెంకట హను మాన్ శాస్త్రి (రేపల్లె) 344 ఎస్. పద్మావతి (కలికిరి, చిత్తూరు జిల్లా) 345. చెళ్లపళ్ళ కామేశ్వరరావు (నర్సారావుపేట) 346 మంచికంటి సుబ్బలక్ష్మీదేవి (విజయవాడ) 347, పట్నాల సత్యకుమారబాబు (హైదరా బాదు) 348 కస్తూరి వరహరిరావు (విజయ వాడ) 349. యస్. ఈశ్వర సాయిప్రసాద్ (సికిందరాబాదు) 350 వి. మధుసూదన. (మదరాసు) 351. సామినేని మంజుల (విశాఖపట్నం) 352 కె. సత్యానారాయణ (రాయచూరు) 353 విష్ణువఝుల అప్పల నర సింహ చంద్రశేఖర శర్మ (ఎండగండి ప॥ గో 354 కలపాల మారుతి (ఉంగుటూరు ప॥ గో॥) 355 సి యాద్రి సూర్యచంద్ర మోహన ప్రభాకరరావు (కాకినాడ) 356 దామోజీ పురపు లక్ష్మి నరసింహారావు (తాడేపల్లిగూడెం) 357. పొట్లా వెంకటే శ్వరగుప్త (రాజాం, శ్రీకాకుళం జిల్లా) 358. నల్లాని చక్రవర్తుల జ్యోత్స్నా రాణి (రాజమండ్రి) 359 వినయచంద్ర పట్నా యక్ (సోంపేట, శ్రీకాకుళం జిల్లా) 360. గోన పార్థసారధి (ఏలూరు)

### గమనిక

జులై 23 సంచికలో ప్రచురించిన బాలల సంఘం సభ్యుల పేర్లలో 53 వ నంబరు గల పేరు గవ్వల చెన్నకేశవ రెడ్డి అని గమనించాలి.

జులై 30 న ప్రచురించిన 63-వ నంబరు పేరుగల సభ్యురాలు కొకరపర్తి వెంకట సూర్యప్రభావతి ఊరి పేరు ఒంగోలు తాలూకా టంగుటూరు, ఉంగుటూరు కాదు.

—సం]


అందరూ

మీ బిడ్డను

ప్రేమిస్తారు

వాతముచేత కాళ్లు చేతులు కొట్టు కొనుట, పిత్తము, కడుపు ఉబ్బరము, నొప్పివంటి జబ్బులు లేకుంటే మీరెంత ప్రేమిస్తారో అట్లే అందరూ మీ బిడ్డను ప్రేమిస్తారు.

పెర్రీ వారి గ్రైపెండ్ బిడ్డల ఆరోగ్యాన్ని క్రమపరచును. చంటి పిల్లల జబ్బులు లేకుండా మీ బిడ్డను దీర్ఘాయువుతో ఆరోగ్యవంతంగా చేయగలదని పరిశోధింపబడి కను గొన్న నివారిణి.

Gripend

గ్రైపెండ్

బిడ్డల ఆరోగ్యాన్ని క్రమపరచును.

మద్రాసు-7

భారత దేశమంతటా స్టాకిష్టులు కావలెను

WPZ-2 TEL

## జగన్నాథ కల్త్రాచిత్రం

చంద్రికా ఎక్స్‌ప్రెస్‌వారి 'శ్రీ కృష్ణ రాయబారం' చిత్రనిర్మాణం జులై 30 న పారమౌంట్ స్టుడియోలో ఆరంభమైంది శ్రీ కృష్ణపాత్రను రఘురామయ్య నిర్వహిస్తున్నారు తొలిసెట్ మీద (విదురుడి ఆశ్రమం) చిత్రించిన సన్నివేశాలలో రఘురామయ్య విదురుడుగా గాడేపల్లి రామయ్య పాల్గొన్నారు ఇతర నటులు ఆదంకి శ్రీరామమూర్తి, గుమ్మడి వెంకటేశ్వరరావు హేమలత మాలతి

ఈ చిత్రానికి మాటలూ పాటలూ ముల్లాది రామకృష్ణశాస్త్రిగారు వ్రాస్తున్నారు పద్యాలను తిరుపతి వెంకటకవుల 'ఉద్యోగ విజయ' ల నుండి తీసుకొని ప్రయోగిస్తున్నారు రఘురామయ్యగారు కాక, మాధవపెద్ది సత్యం పి బి శ్రీనివాస్ పాడుతారు సంగీత దర్శకుడు అశ్వత్థామ

చెప్పుకోతగ గొప్ప దర్శకులలో ఒకడైన జగన్నాథ్ చాలకాలం తిరువాత తిరిగి ఈ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు జగన్నాథ్ పదిహేనేళ్ళనాడు తీసిన హాస్య రస ప్రధాన చిత్రాలు 'భలేపెళ్లి' 'తారుమారు' చూసినవాళ్లకి ఇప్పటికీ గొప్పగా కనిపిస్తాయి దరిమిలా ఆయన దర్శకత్వం వహించిన రెండు తమిళ చిత్రాలు 'విశ్వామిత్ర' 'వైరము లై', విశేష ప్రజాదరణ పొందాయి

ఈనాడు అర్థరహితమైన మాటలు అనిపించే 'ఆశయాదర్శాల పట్ల జగన్నాథ్‌కుగల గురి గౌరవం, పట్టుదల ఎరిగినవాళ్లు ఆయన మీదగల గౌరవాభిమానాల కొద్దీ సినిమా సీములో 'భీష్మాచార్యుడు' అని వ్యవహరిస్తు ఉంటారు

## 'పార్వతీ కల్యాణం'

భాస్కర్ ప్రొడక్షన్సువారి పౌరాణికం 'పార్వతీ కల్యాణం' చురుకుగా తయారవుతోంది దర్శకుడు భాస్కరరావుగారు దీన్ని కన్నడంలో కూడా తీస్తున్నారు తెలుగు చిత్రానికి మాటలూ పాటలూ సముద్రాల జూనియర్ వ్రాస్తున్నారు సంగీత దర్శకుడు కమల్ ఘోష్

ఇందులో శివపార్వతులు బాలయ్య,కృష్ణకుమారి నాగయ్య గుమ్మడి రమణారెడ్డి, మిక్కిలినేని, సంధ్య, రాగిణి కుచలకుమారి మొదలగువారు పాల్గొంటున్నారు

ఛాయాగ్రహణ దర్శకుడు కమల్ ఘోష్

భాస్కరరావుగారి కొత్త సాంఘిక చిత్రం నిర్మాణం, ఇది పూర్తికాగానే ఆరంభం అవుతుంది దానికి పాటల రికార్డింగు ఇదివరకే పూర్తిఅయింది సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు

దుర్గా ఫిలింస్‌వారి 'పతిభక్తి' చిత్రంలో శివాజీ గణేశన్, సావిత్రి

## గుళ్లో పెళ్లి

శేతనా ఫిలింస్‌వారి సాంఘిక చిత్రం 'గుళ్ళో పెళ్ళి' ప్రకాష్ స్టుడియోలో తయారవుతూంది కృష్ణకుమారి, సూర్యకళ, నిర్మల రమాదేవి రమణమూర్తి, బాలయ్య, రమణారెడ్డి, చదలవాడ మొదలగువారు పాల్గొంటున్నారు రచయిత అనిసెట్టి సంగీతం రమేష్ నాయుడు దర్శకుడు కె ఎస్ ప్రకాశ్ రావు నిర్మాత గిరిబాబు

## 'పులి చేసిన పెళ్లి'

ప్రజాదరణ పొంది, రాష్ట్రపతి బహుమతిని అందుకొన్న మలయాళ చిత్రం 'నాయరు పూట్టి పులివాలం' ను శరత్ ఎక్స్‌ప్రెస్‌వారు 'పులి చేసిన పెళ్ళి' అనే పేరుతో తెనిగించి ఈ నెలాఖరున విడుదల చేస్తున్నారు రచయిత రావూరి సత్యనారాయణ సంగీతం రాజమాణిక్యం పిళ్లై నిర్మాత పోలవరపు సూర్యప్రకాశరావు 

# ★ స్వరలహరి ★

కూడా పట్టుకొచ్చి అమ్మ మాపాడు పాటలో కొన్ని రాణించాయి కొన్ని బాగులేవనిపించాయి హోరుగాలికే పోవాయి సంగీతాన్ని అందంగా కలిపిన పాటలలో ఎన్నతగ్గది: ఈనాసి్కన్ చిత్రంలో లతాపాడిన 'అబ్ వో రాత్ ఏక హై' రాత్రి వేళ ప్రవర్తిల్లే ప్రశాంత తన నిశ్శబ్ద సౌందర్యాన్నీ ఈ పాట తనలో నిలిపుకొని శ్రోతలను పరవశులను చేసింది పాట పైను త్రంమీద ఈ ఘనకార్యం సాధించినది అనుశ్రుతిగా వచ్చిన వయొలిన్

ఆఫ్రికన్ లయలనూ హవాయి సంగీత రీతులను మేళవించి అల్లిన గీతాలలో షిన్ షినాకీ 'బూబ్లబూ', సౌదాగర్ లో గుల్ సలేరా, ఎరీ గమ్ లో మెంబొసా యార్ పైపై ఖజానాలోని బంబీనా, భాబీ బూబీ అల్ బేలాలోని దీవానా పర్వానా (రామచంద్ర బృందం) చెప్పుకోతగ్గవి రాహుతికి చిత్రం 'ఆశా లో ఈనామీనాడీకా' అనే రాక్ అండ్ రోల్ పాటా, కారీగార్ లో మెహులోం కేకూడా ఈయన పేరనే జమపడి ఉన్నాయి షిన్ షినాకీ బూబులబూ అనే పాటను లతాతో కలసి రామచంద్ర స్వయంగా పాడారు రామచంద్ర సంగీతం గురించి చెప్పుకున్నంత గొప్పగా పాట గురించి చెప్పుకోలేపోయినా ఈ పాట బాగుందనే అనవచ్చు ఇదీ ఖజానా చిత్రంలోని బాబిడీ బూబిడీ అనే మరోపాటా కలిపి ఒక రికార్డుగా (భారతీయ సినిమా సంగీత చరిత్రలో తొలిసారిగా) విదేశీ మార్కెట్ లో విడుదల అయ్యాయి

కవాలీమార్గ పాటలలో శిశిక చిత్రంలోని జల్నే వాలే జగా కరే (సంషాద్), షెహీరులక్ లోని మహబ్బత్ కే ముర్ఖ మారా ఉత్సాహకరమైనవి

అల్బేలాలో జోలపాట ధీరెసే ఆజారే (లత) ఆనాడు గొణుగుతూ నోనోటా వినబడింది సినిమా సంగీతానికి లాలిపాటలలో ఇది విప్లవం తెచ్చి ఒక శకాన్ని ఆరంభించింది ఒకే ఒక్క వయొలిన్ తో బంగారు తీగలాటి లతా కంఠంతో 'మ్యూజిక్ లో మాజిక్' అని అంచే అంత సుందర శైలిలో ఆయన ఈ పాట చేశాడు

నిరాడంబరంగా మాటిగా ఉండి అనూయకత్వమల్లె మనసులో చిరముద్ర వేసుకుని ఆప్తమిత్రుడిలా మనవెంటనే వచ్చే పాటలలో నిరాలా చిత్రంలో లతాపాడిన మొహాబత్ మేజల్ ఉరీమనా, సుజ్ బూర్ అంఖే మినార్ లోని బర్ బాదీ మొహబ్బత్ మెరీ చెప్పుకోవాలి చివరి పాటలో లయ విశిష్టంగా కొత్తగా తోస్తుంది షెహీరులక్ లో సమాకో నజరియాకే బాన్ (లత), సుబాకొతారాలో గయా అంధే గాహాశా ఉర్ఝా (తలత్, లత) శతరంజ్ లో బదీ మెధుప్పి (హేమంత్ లత), అమరదీప్ లో దిల్ కీ గునియా మే (లత) చాలా మందికి ఇష్టమైనపాటలు తలాక్ చిత్రంలో అనురాగోదయానికి స్వరరూపకల్పన అనతగ్గ మధుమధురమైన పాట 'భోల్ తుమ్ కౌన్ హో కే ఆశా మన్నాడే, ఈ చిత్రం సినిమా పాటలన్నిటా గొప్పదనిపించుకునే పాటలో నిలుస్తుంది ఆపాటకి వాత్సల్యమ్మోహనం అను రాగాన్ని చిత్ర్యజనీనంగా ఆలపించింది ఈ చిత్రంలోనే "సంభల్ కే రహనా అప్నే ఘర్ మే " అనే మరోపాట ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ప్రశంసలు కూడా అందుకొంది

తీయనిబాధని ఆలపిస్తూ హృదయాన్ని కదిలించి రసార్ద్రం చేసిన గీతాలు కనీసం రెండైనా ఉన్నాయి వాటిలో నౌసర్వాంనే ఆదిల్ చిత్రంలో రఫీ లతాపాడిన 'సాల్ జాయే సారెగాం' ఒకటి అనార్కలీలో దాయిక నిస్సహాయతను పోషిస్తూ లతా పాడిన "ఆజా అబ్ తో ఆజా మెరికిస్మత్ కె ఖరీదా" మరపురానిపాట నాస్తిక్ లో కూడా ఇదేవరసపుగల పాటఉంది మానవులు నిష్క్రమించేది, ఏమిటి ఇది స్వామీ అని ముఖాముఖిన సంగతి అడగబోయేవేళ లత పాడిన 'అరె పత్థర్ కే భగవాన్' పాట అంతా, ముఖ్యంగా అది అటుతిరిగి ఇటుతిరిగి పెద్ద గాంధారంమీద ఆగిపోయేటప్పుడు, ఆ గాంధారంలో రామచంద్ర, ఆ వ్యక్తి నిస్సహాయతనంతా పూరి పగలిగాడు సంగీత శాస్త్రంలో సాధకబాధకాలు ఎరిగినవారు ఇది చిన్న సైజు అద్భుతం అంటారు రామచంద్ర విద్య అంతా ఈ పాటకు ప్రాతిపదిక అయిన 'ప్తమే జరీ స్కేల్' మీదనే (కర్ణాటకంలో శంకరాభరణ మేళం అంటారు) నిలబడి సాగిందనవచ్చు కొందరు కొందరు ఒకొక్క మేళకర్తను ప్రధానంగా తీసుకుని సొంతం చేసుకుని దాన్ని కామధేనువులా వాడుకుంటారు రామచంద్ర పాలిట కామధేనువు ఈ శంకరాభరణ మేళ సవాలి

రామచంద్ర ఇప్పటికి దాదాపు 50 చిత్రాలకు సంగీతం కూర్చాడు వీటిలో కొన్ని పాటలు ఏమాత్రం చెప్పుకోతగ్గవి కావు పాశ్చాత్య సంగీతానికి అనుసరణలో అనుకరణలో ఎన్నో ఉన్నాయి వీటిలో బాగులేనివి ఉన్నాయి తనని తనే అనుకరించి ఈ పాట ఎలవిని ఆ పాట ట్రకే కానికి ఆపాట చరణాన్ని లేదా అందులో ఆర్కెస్ట్రా బిట్ ని ఇంకోపాట పల్లవికి వాడిన సందర్భాలున్నాయి వ్యాపారపు వత్తిళ్ళు ఇష్టం లేకపోయిన కొన్ని అంగీకరించాను ఒకసారి ఒకపాట రికార్డు చేస్తే ఇలా కనక ఇంకొన్ని రోజులు పాటలు నడిస్తే తరవాత సన్యసిస్తూ పిలవరు అనేవాడు ఆ నిర్మాత మొహం మీదనే

రామచంద్ర తత్వం అలాటిదని అన్నిబాగా ఎరిగిన వారు చెబుతారు వ్యక్తిగా అతను ఉత్సాహానికి ప్రతిరూపం సంతోష స్వర సర్వస్వాన్ని మధించి అమృతప్రాయమైన మధురశ్రుతులు కల్పించాలని నిత్యం మధురమైనబాధలో మునిగి తేలుతూ నవ్వుతూ నవ్విస్తూ ఉంటాడు అందుకే రామచంద్ర హుషారైన పాటచేసినపుడు, మిత్రులు "దాదాపు నీ అంత హుషారుగా ఉంది బ్రదర్" అంటారు ★



పొన్నలూరి బ్రదర్స్ వారి "దైవబలం" లో జయశ్రీ

ఒక చిత్రంలో ఒక మేడమీద గదిషూట్ చెయ్యవలసివచ్చింది. మేడ ఇవతలనించి, గోడ వెంబడే కెమెరాను పైకి ఎక్కించి కిటికీలోంచి లోపలి మనుష్యుల్ని తియ్యాలనుకున్నాడు డిమిల్.

"కెమెరాలు ఎక్కడైనా గోడలెక్కుతాయా" అన్నాడు ఒక 'వాస్తవికవాది' విడ్డూరంగా వెటకారంగా.

డిమిల్ అతనికేసి ఒక క్షణం చూసి, "నేర్చుకుంటే ఎక్కగలవు" అన్నాడు. వెంటనే ఒక పేద్ద నిచ్చెన (దన్ను ఉండేది) తెచ్చారు. దానిమీద పొడుగుపాటి పలక వేసి బిగించారు. ఓ చివర కెమెరా ఉంచి, ఇంకో చివర ఇసకబస్తాలు పెట్టి తూకం అనుకుని, షూట్ చేశారు. చక్రాలు, బండీ, హంగులు సమకూరాక కొన్నాళ్ళకి అదే కెమెరాబూం అయింది. కెమెరా చుట్టూరా తిరగడానికి పైనించి కిందకి చూడటానికీ సదుపాయం కలిగింది.

ఈవిధంగా, తనచిత్ర నిర్మాణ యాత్రే, చలనచిత్ర పరిశ్రమ ప్రగతిగా కొత్తవింతలు కని పెడుతూ, ప్రపంచావధిని అగ్ర్యతమైన చిత్రాలు తీస్తూ పేరు ప్రఖ్యాతులు గడించిన సిసిల్ డిమిల్, ఈ ఆగస్టు 12-వ తేదీని 77-వ జన్మదినోత్సవం జరుపుకొంటున్నాడు. ఆయన ఇటీవల నిర్మించిన "ది టెన్ కమాండ్‌మెంట్స్" బ్రహ్మాండమైన చలనచిత్రమనీ, అలాంటి చిత్రాన్ని ఇంతవరకు ఎవరూ నిర్మించలేదనీ, ఇంతలో నిర్మించగల అవకాశాలు కూడా ఉండకపోవచ్చునని చెప్పవచ్చు.

తన 44 సంవత్సరాల చలనచిత్ర జీవితములో డిమిల్ నిర్మించిన చిత్రాలలో అది 70 వది.

తొలిసారిగా 1913 లో "ది స్క్వా మాన్" అనే చిత్రం నిర్మించాడు. హాలీవుడ్ కూడా అప్పటినుంచే అభివృద్ధి చెందుతూ వచ్చింది. 1915 లో ఆయన "కార్మెన్" అనే చిత్రం నిర్మించాడు. 1918 లో ఆయన దర్శకత్వం వహించిన "జోన్ ది ఉమన్" విజయవంతం కావటంతో ఆయన ఖ్యాతి ద్విగుణీకృతమైంది. దానిలో యుద్ధ దృశ్యాలూ, స్వప్నలోక విహారాలు, డబుల్ ఎక్స్‌పోజరూ — ప్రేక్షకులనూ, విమర్శకులనూ కల్పనాలోకంలో విహరింపచేశాయి.

19 7 లో సిసిల్ బి డిమిల్ నిర్మించిన "ది కింగ్ ఆఫ్ కింగ్స్" ఈనాటికీ ప్రదర్శింపబడుతున్నది. అలాంటి అద్వితీయ శాఖండాల్లో "ది సైన్ ఆఫ్ ది క్రాస్", "క్లియోపాత్రా", "ది క్రూసేడ్స్", "ది గ్రేటెస్ట్ షో ఆన్ ఎర్త్", "అన్ కాంకర్డ్" నిత్యనూతనంగ భాసిస్తూ చలనచిత్ర ప్రేక్షకులను ఆకర్షిస్తున్నవి.

డిమిల్ చలనచిత్రకళను రసపుష్టి కూర్చలేకపోయినాడని ఆయనను కొందరు విమర్శకులు అనవసరంగా వెక్కిరించవచ్చు. స్నానమందిరాలు, రాజసభలు, యుద్ధరంగాలు మొదలైనవాటికి ఆయన వెచ్చించే ధనానికి ఆయనను హేళన చేయవచ్చు. కాని సిసిల్ బి డిమిల్ చిత్రాలు ప్రపంచంలో మరి ఏ ఇతర నిర్మాత తీసినచిత్రాలకన్నా ఎన్నో రెట్లు ప్రేక్షకులను ఆకర్షించి, కోటానుకోట్లుగా కనకవర్షం కురిపించేసినవి అనేది వారంతా ఒప్పుకొంటారు. ఆయన నిర్మించిన చిత్రాలు "బ్రహ్మాండం"గా ఉండటమే కాక, చలనచిత్ర సీమలో ఎంతోమంది నిర్మాతలు ఉన్నప్పటికీ, ఆయన ఒక్కడే "మిస్టర్ హాలీవుడ్" అనే నామధేయంతో విశ్వవిఖ్యాతి గం పేటటు చేశాయి. ఆబిరుదు ఆయన ఒక్కడికే తగును తగదని ఎవరూ అనలేదు, అనరు.



బ్రిటిష్ నిర్మాత ఆర్థర్ రాంక్ తో సుప్రసిద్ధ దర్శకుడు డేవిడ్‌లీన్. గత సంవత్సరం 7 అకాడమీ అవార్డులు గడించుకొన్న 'బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్' చిత్రానికి దర్శకత్వం ఈయనే నిర్వహించారు. లీన్ తీసిన 'గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్' చిత్రం ఇదివరలో ప్రపంచావధిని ప్రశంస లందుకుంది.

## మిస్టర్ హాలీవుడ్

హాలీవుడ్ ప్రొడ్యూసర్లకుగల, సంప్రదాయ సిద్ధంగా అనండి మరి ఏమైనా అనండి — చుట్టపీకలు నములటం, హంగామా చేయటం మొదలయిన లక్షణాలు డిమిల్ లో లేకపోవటంచేత ఆయనను "మిస్టర్ హాలీవుడ్" అని పిలవటం కొంచెం చిత్రంగానే కనిపిస్తుంది. ఆయనలో కళాకారుని లక్షణాలు, వ్యాపారవేత్త లక్షణాలు ఆధునిక రూపంలో సమన్వయం అయివున్నాయి.

డిమిల్ 77 వ పడిలో పడినప్పటికీ, 40 సంవత్సరాల వాడి చురుకుదనం అడుగడుక్కూ కానవస్తుంటుంది. అలా ఉండటానికి కావలసినబలంకోసం తాను ఔషధాలేవీ సేవించటంలేదు అంటాడాయన.

"రసస్పృష్టి అనే ఔషధం లేకుండా నేను జీవించలేను" అనితరచు ఆయనవ్యక్తం చేస్తూంటాడు.

ప్రొడ్యూసరు, డైరెక్టరు-ఈ రెండు బాధ్యతలు ఒకేవ్యక్తి భరించటమన్నది చాలా గురుతరమైన విషయం. ప్రతిరోజూ 12 నుండి 14 గంటలవరకూ నిర్విరామంగా పని చేసి, 6 నుండి 8 గంటలవరకూ నిద్రిస్తుంటాడు. ఆయన ఎక్కడవున్నా గణాధిపతిగా సాంకేతిక, నటబృందంమీద అజమాయిషీ చేస్తూ ప్రతిపని అనుకొన్న ప్రకారం నిర్విఘ్నంగా జరిగేటట్టు చూస్తాడు. ఆయన బృందంఅంటే సామాన్యం కాదు. నిన్నమొన్నటి "టెన్ కమాండ్ మెంట్స్"

ప్రతి రాత్రి ఒక చిత్రం ఆయన గృహంలో ప్రదర్శింపబడుతు ఉంటుంది మనుమలు మనుమరాళ్ళలో ఎవరో ఒకరిని పక్కనే కూర్చోపెట్టుకొని కబుర్లు చెపుతూంటాడు

## కథ ప్రాధాన్యం

"చిత్రంలో నటించేది ఎవరైనా సరే. ఆ పాత్ర మంచిదా చెడ్డదా? అంతే ప్రేక్షకులకు కావలసింది భావ వైరుధ్యం పరికిస్తూ, కథా ప్రవంతిలో కలిసిపోతారు దాని అర్థం ఏమిటి? ఏ యుగంలో చలనచిత్రం నిర్మించినా సరే ముఖ్యంగా గమనించవలసిందీ, శ్రద్ధ తీసుకోవలసిందీ కథనుగురించి అని వ్యక్తమౌతుంది" అని డిమిల్ అంటారు

బ్రహ్మాండమైన సెట్టింగులూ, ప్రముఖ తారాగణంతో చిత్రాలు నిర్మిస్తాడని ఆయన పేరుపొందినా, ప్రపంచంలో ప్రేక్షకులను ఆకర్షించేటందుకు అవి కారణాలని ఆయన ఒప్పుకోడు

"బ్రహ్మాండమైన సెటింగులు కానీ- లక్షలాది డబ్బుతీసుకునే తారాగణం గానీ, ప్రముఖ దర్శకత్వం గానీ ఒక చిత్రాన్ని విజయవంతంగా నడిచేటట్టు చేయలేవు కాని ఒక్కదానికి మాత్రమే ఆ మహత్తర శక్తి ఉన్నది- అదే కథ" అని ఆయన నొక్కి వక్కాణిస్తాడు

1912 లో న్యూయార్కు నగరంలో ఒక నాటి భోజన సమయంలో ఆయన జెస్సీ లాస్కీతోనూ, సామ్యుల్ గోల్డ్విన్‌తోనూ చలనచిత్ర నిర్మాణ భాగస్వామిగా చేరాడు. అంతకుముందు ఆయనకు కెమెరా అంటే ఏమిటో ఆట్టే తెలియదు కాని నాటక కళారాధకుల కుటుంబంలో మనిషి కాబట్టి దానిగురించి తెలుసు ఆపైన స్వయం కృషి వల్ల అమోఘమైన అనుభవం గడించాడు

బ్రాడ్వే ప్రొడ్యూసర్ డేవిడ్ బెలాస్కోతో, సిసిల్ తండ్రి హెన్రీ సి డిమిల్ కలిసి పనిచేస్తూండేవాడు తరువాత బ్రాడ్వే నాటక ప్రతినిధిగా ప్రఖ్యాతి చెందింది న్యూయార్కులోని అమెరికన్ అకాడెమీ అఫ్ డ్రమెటిక్ అర్ట్సులో శిక్షణ పొందాడు నటుడుగా ఆయన అమెరికాలో పది సంవత్సరాలు పర్యటించాడు నాటకాలు రచించాడు తర్వాత సొంత కంపెనీ స్థాపించాడు

1918 లో చిత్రనిర్మాణం ఆరంభించాడు పది సంవత్సరాలైన పిమ్మట త్రిమూర్తులు (డిమిలీ, లాస్కీ గోల్డ్విన్) విడిపోయారు పేరమౌంట్ వారు ఒక చిత్రం తీసిపెట్టమని డిమిలీని కోరారు సరేనని, మిలియన్ డాలర్లు (సుమారు 45 లక్షల రూపాయిలు) ఖర్చుపెట్టి "టెన్ కమండ్‌మెంట్స్" అనే చిత్రం నిర్మించాడు (ఇది తొలి చిత్రం) అంతడబ్బు వెచ్చించి తీసినందుకు ఆయనను పేరమౌంట్ వారు ఎన్నో మాటలన్నారు

చిత్రం విడుదల అయింది. పెట్టుబడికి ఎన్నోరెట్లు డబ్బు వచ్చిపడింది డిమిల్‌ను తొందరపడి మాటలన్నందుకు పేరమౌంట్ వారు ఎంతో నొచ్చుకున్నారు డిమిల్ తన సొంత స్టూడియో స్థాపించి చలనచిత్ర నిర్మాణం నిర్విరామంగా సాగిస్తూవచ్చాడు దానితోపాటు మెట్రోగోల్డ్విన్ మేయర్ సంస్థలో ప్రొడ్యూసర్ గా కూడా పనిచేశాడు అలా ఎనిమిది సంవత్సరాలు గడిచింది తిరిగి పేరమౌంటు సంస్థలో చేరాడు

చలనచిత్రకళకు సిసిల్ బి డిమిల్ చేసిన సేవలో కొన్ని అపూర్వవిషయాలు ఉన్నవి వాటిలో మొదటిది: మామూలు కాన్వాసుమీద పెయింట్ చేసి, నాలుగు ఫోటోలు అడ్డంపెట్టి ఇవే రాజసౌధాలు, లతానికుంజాలు, భీకర రణరంగాలు, పర్వతశిఖరాలు, పాతాళలోకాలు అనకుండా సాధ్యమైనంతవరకు అవి యదార్థంగా ఎలా కనిపిస్తవో అంత బ్రహ్మాండంగానూ సెట్టింగులు నిర్మించటం మరొకటి: లైటింగ్‌కు సంబంధించినది సెట్‌కూ, నటీనటులకూ భేదం తెలియకుండా అంతా ఒకే కాంతిమయం చేసేవారు సెట్ ఎంత గొప్పదివేసినా, లైటింగ్ వల్ల లోటుపాటులు కన్పించక తెరలాతయారయేది ఆయన ఆలోటు గ్రహించి కాంతి ఛాయలభేదం సుస్పష్టంగా కనిపించేటటూ, వ్యక్తులు స్ఫుటంగా, సెటింగులు విశదంగా కనిపించేటట్టూ కొత్తరహా "రెంబ్రాంట్" లైటింగ్ ప్రవేశపెట్టించాడు

చలనచిత్ర నిర్మాతలు టెలివిజన్ మొదలైన పోటీలవల్ల చిత్రసీమ దెబ్బతింటుందని ఆందోళన పడుతుంటే, ఆయన మాత్రం నిశ్చలంగా ఏకైక దీక్షతో చలనచిత్రాలు నిర్మిస్తూనే ఉన్నాడు దానితోనే ఆయన సంతృప్తిపడి హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు ఏవో అవాంతరాలువచ్చి చిత్రకళాసౌధం ఛిన్నాభిన్నమౌతుందన్న జోస్యం ఆయనముందు వమ్మయింది.

"బాగా నిర్మించిన చిత్రాలు సదా వినోదంచేకూరుస్తూనే ఉంటాయి నిర్మాణ విధానంలో కొన్ని మార్పులురావచ్చు, కాని కథాగమనం, రసపుష్టి చిరస్థాయిగా ఉంటూనే ఉంటుంది" అంటారు డిమిలీ టెలివిజన్ మూలంగా చలనచిత్రాలను థియేటర్లలో ప్రదర్శింపచేయవచ్చునని ఆయన పురస్కరించుకొని మే సూచించాడు ఆ విషయమై ఇంజనీర్లు అందరూ ఈనాడు తీవ్రకృషి చేస్తున్నారు

"ఇళ్ళలో టెలివిజన్ సెట్లలో చిత్రాలు చూచినంత మాత్రాన, థియేటర్లు మూలపడిపోతాయన్నది అసంభవం వలభై ఆరు అడుగుల తెరపైన "టెన్ కమాండ్ మెంట్స్" చూసినదానికీ, ఇంట్లో వలభై ఆరు అంగుళాల తెరపై చూసినదానికి హాసి మశకాంతరం ఉంటుంది" అన్నారు సిసిల్ బి డిమిల్



---

## పద్మశ్రీ

(51 వ పేజీ తరువాయి)

ప్రత్యేక బహుమతిని, కాతలిక్ సినిమటోగ్రాఫ్‌బూరో వారి ప్రశంసలతో పాటు బహుమతిగా ఒక ఫలకాన్ని అందుకొంది

వీటివల్ల విదేశ విపణులలో భారతీయ చిత్రాలు ప్రవేశించడానికి అనుకూల వాతావరణం ఏర్పడుతోంది దేశదేశాలా మనపట గౌరవం పెరుగుతోంది శాంతారాం చిత్రం పశ్చిమ జర్మనీలో వాణిజ్య సాయిన విడుదల కావడానికి సన్నాహాలు జరుగుతున్నాయి

*　　*　　*

ఈ విజయాలు యావద్భారతానికీ గర్వకారణాలే అయినా, దక్షిణ భారతం కూడా ఇంగులో అక్షరాలా (అనగా


విషపు కోతగాయములు



జామ్-బక్ తో
త్వరితంగా మానును

కోతలు, పగుళ్ళు, కీటక కాటులను త్వరితంగా నివారించును కాళ్ల వాపులు, వ్రణములు, కాలిన పుండ్లు, విషగాయములను రూఢిగా మాన్పును తల గజ్జిని నిర్మూలించును ఏబాధకైనను జామ్ బక్ వాడవచ్చును ఇది చర్మవాపులకు నానావిధ మూలికా ఔషధము దీనిలో జంతు క్రొవ్వులు, నూనెలు లేవని గ్యారంటీ చేయబడినది
ఇది చర్మవ్యాధి నివారణకు చర్మసౌందర్యమునకు ఒక్కటే—జామ్ బక్, జిగటగా లేని ఔషధ క్రీమ్‌ను వాడి చూడండి

Zam-Buk



జామ్-బక్
మూలికా బామ్
మరియు
ఔషధ క్రీమ్

ఇది మందుల వ్యాపారులందరివద్దను దొరుకును
వి ఇ ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
బొంబాయి
సోల్ ఏజెంట్లు దాదా & కంపెనీ,
16, నైనప్పనాయకన్ వీధి, మద్రాసు-3



సంగీతావారి ‘ఇంటిగుట్టు’లో ఎన్ టి రామారావు, రేలంగి, స్టాన్లీ, జగ్గారావు, సుబ్రహ్మణ్యాచారి

ముల మేరకంటే ఎక్కువ పడదు ఆదేశాల ప్రకారం అలా సంభవిస్తేగా పడుతుంది అవతల ఏమీ ఉండదు ఇదేమిటనుకుంటారు ప్రేక్షకులు ఇలాటివి సహజంగా కనిపించేలా తీయడానికి పెద్ద అభివృద్ధి ఏమీ అవసరంలేదు కొంచెం ఆలోచించాలి కొంత కష్టపడాలి ఇదే ఇంగ్లీషు చిత్రాలలో చూడండి ఉ॥ ‘బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్’ లో జపాన్ జనరల్ హెడ్ క్వార్టర్స్ వద్ద వర్షం కురిసినప్పటి దృశ్యంలాటిది మనవారు ఎప్పుడు తీస్తారు? ప్రేక్షకుడు ఇచ్చే డబ్బు సమానమే మేలు చిత్రాలకీ తక్కువ వాటికీకూడా అటువంటప్పుడు ఏ చిత్రం సహజంగా ఉంటుందో దాన్నే చూడాలనుకుంటాడు అంతేకాని, మనం లోగడ బ్రిటిష్ హయాంలో ఉండడం వల్ల, వాళ్ళ సంస్కృతిమీద మోజువల్లా కాదు వాట్ల ప్రాముఖ్యం వారి నాగరికత, సంప్రదాయాలూ మనకి నచ్చడం అసలు కాదు వాటిలో అన్ని అంశాలూ సున్నితంగా అందంగా ఉంటాయి ఇక మనం అలా తీయలేకపోవడానికి, మనదేశం వెనకబడి ఉండడం కారణం కాదు ‘పురోభివృద్ధి’ మాత్రమే చిత్రాలను బాగు చేయ లేదు సాధ్యం అయిన వాటినికూడా మనవారు నిర్లక్ష్యంతో అసహ్యంగా తీసి పాడు చేయడంవల్లనే మన చిత్రాలు పాశ్చాత్య చిత్రాలకు తీసికట్టు

మనం గొప్పవాళ్ళం అనుకున్నప్పుడు, ఇతరుల స్థాయిని, అభివృద్ధినీ కూడా పరిశీలించాలి

ఎస్ డి ఎల్లాజోస్యుల, (కలకత్తా)

## రేలంగికి సన్మానం

సుప్రసిద్ధ హాస్యనటుడు శ్రీ రేలంగి వెంకట రామయ్యను విజయనగరం పౌరులు ఇటీవల సన్మానించారు ‘చెంచులక్ష్మి’ శతదినోత్సవ సందర్భంగా, రేలంగి అవూరు వెళ్ళినప్పుడు జులై 19న స్థానిక మాజస్ట్రేటు శ్రీ ఎ ఎ ఆర్ మూర్తి అధ్యక్షతన ఆకోశపురారి పాఠశాలభవనంలో సభ జరిపారు ప్రధానోపాధ్యాయుడు శ్రీ బి గురువులు రెడ్డి స్వాగతం చెప్పారు రేలంగి ప్రతిభా సంపత్తిని ప్రశంసిస్తూ సన్మానపత్రం చదివి సమర్పించారు జిల్లా అడిషనల్ మాజిస్ట్రేటు శ్రీ భోజరాజు మొదలగువారు మాట్లాడారు. అనంతరం రేలంగి సన్మానానికి సముచిత సమాధానం యిచ్చి కృతజ్ఞత తెలియజేశారు

## ‘కాత్తవరాయుని కథ’

ఆర్ ఆర్ పిక్చర్స్‌వారి భారీ జానపద చిత్రం ‘కాత్తవరాయుని కథ’ నిర్మాణం పూర్తికావచ్చింది వచ్చేనెలలో విడుదల చేస్తున్నారు సావిత్రి, కన్నాంబ, గిరిజ, బాలసరస్వతి, ఇ వి సరోజ, ఎన్ టి రామారావు, రమణారెడ్డి, ముక్కామల, కె వి ఎస్ శర్మ రాజనాల, పద్మనాభం, బాలకృష్ణ మొదలగువారు ఇందులో పాల్గొంటున్నారు

సంభాషణలు ముదిపట్ల సూరి, పాటలు కేవులపల్లి కృష్ణశాస్త్రి వ్రాశారు సంగీత దర్శకులు జి రామనాథన్, అశ్వత్థామ

ఛాయాగ్రహణం రాజాబాదర్, దర్శకత్వం రామన్న నిర్వహించారు సంయు దర్శకుడు ఐ ఎస్ మూర్తి ★

## ఆసియా ఆఫ్రికా చలనచిత్రోత్సవం

ఆగస్టు 20 నుండి సెప్టెంబరు 8 వరకు ఢిల్లీలో ఆసియా ఆఫ్రికా చలనచిత్రోత్సవాలు జరుగబోతున్నాయి దాదాపు 40 దేశాలు ఇందులో పాల్గొంటున్నాయి

మనదేశం తరఫున ఎ వి ఎం వారి ‘భాభి’ చిత్రాన్ని ‘కాశ్మీరుఉత్సవం’, ‘కాల్ ఆఫ్ ది మౌంటెన్స్’ అనే రెండు డాక్యుమెంటరీలను ప్రదర్శిస్తారు

ఉత్సవచిహ్నంగా ఆసియా ఆఫ్రికా తీరరేఖతో ఒక గోళాకృతిని రూపొందించారు

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd by S Radha Krishna at The Andhra Patrika Press. 6 & 7 Thambu Chetty Street, Madras 1 Editor S Sambhu Prasad

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.


# అంతకొద్ది సన్‌లైట్ చాలా బట్టలను ఉతికింది

## -అట్లు చేసినట్టిది దాని అధికమైన నురగ:




ఆ కనిపించింది లతని షర్టు ఆ పెద్ద బట్టల దొంతర్లో ప్రతీ బట్టయున్నా మెరుస్తున్నది ! అమ్మ ఈ బట్టలన్ని కొద్ది సన్‌లైట్ సబ్బుతో ఉతికింది ఆ అధికమైన సన్‌లైట్ నురగ పూర్తిగా మురికి నంతా తొలగించివేసింది చాలా ఎక్కువ బట్టలను ఎంతో తెల్లగాను కాంతివంతముగాను ఉతికింది మీరు సన్‌లైట్‌తో బట్టలను ఉతుకునప్పుడు వాటిని బాద నక్కర్లేదు

*సన్‌లైట్ సబ్బు బట్టలను తెల్లగాను,*

**కాంతివంతముగాను ఉతుకును**

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి.

S 250 X.2 TL